పాఠకులకు అశ్విని వారి దీపావళి శుభాకాంక్షలు.




అశ్విని హాలిడే హంగామాలో
ఇంకా మీరు గెల్చుకోగల బహుమతుల్ని
ఒక్కసారి చూడండి.




















The Nedungadi Bank Manager




శ్రీ కె. ఎం. శ్రీనివాస్ గారు బి.పి.ఎల్ కలర్ టి.వి. గెలుపొందారు, శ్రీమతి బి. సెల్వి గారు వీడియోకాన్ వాషింగ్ మిషన్ గెలుపొందారు. అంతేకాక 600 మంది వెండి నాణేలు బహుమతిగా పొందారు. అశ్విని హాలిడే హంగామాలో ఇంకా మీరు గెల్చుకోవడానికి ఎన్నో మంచి మంచి బహుమతులు ఉండి పోయాయి. వాటిలోగోవా, సింగపూర్, మలేషియాకు ఉచిత విహారయాత్ర, 1 వాషింగ్ మిషన్, 1 కలర్ టీవి, 2 సెల్ ఫోన్‌లు, 1200 వెండినాణేలు........ ఒకటేంటి, రెండేంటి ..........

ఏకంగా గ్రాండ్ బంపర్ ప్రైజ్ యూరోపా పర్యటన కూడా ఇంకా మీకోసం ఎదురుచూస్తున్నది. కాబట్టి, వెంటనే మీ సమీప అశ్విని హెయిర్ ఆయిల్ డీలర్ రిటైలర్ వద్దకు వెళ్ళండి. యాక్టివ్ 3 గ్రోత్ ఫార్ములాగల అశ్విని హెయిర్ ఆయిల్ కొనండి. అశ్విని హాలిడే హంగామా స్క్రాచ్ కార్డ్ తీసుకొని మెల్లగా గీయండి. ఈ లోపున అదృష్టం మిమ్మల్నే వరించాలని మీ ఇష్టదైవాన్ని ప్రార్ధించండి. ఇది మా 12 వ వార్షికోత్సవం. అందరికీ కావాలి ఇది ఆనంద సంబరం. మీ ఇంట విరియాలి బహుమతుల నందనవనం.

## అశ్విని
హోమియో హెయిర్ ఆయిల్

♦ రాలే జుట్టును అరికడుతుంది. ♦ జుట్టు పెరిగేందుకు సహకరిస్తుంది. ♦ తలనొప్పిని తగ్గిస్తుంది. ♦ చుండ్రును నివారిస్తుంది.
♦ మెదడును చల్లబరుస్తుంది. ♦ చిన్న వయస్సులో జుట్టు తెల్లబడటాన్ని అరికడుతుంది.

అశ్విని హోమియో అండ్ ఆయుర్వేదిక్ ప్రొడక్ట్స్ లిమిటెడ్, వజ్ర హౌస్, మూసాపేట, హైదరాబాద్ 18 ఫోన్: 3703607
web: www.aswini.com, e-mail: info@aswini.com

SSB/ASWINI

ఇవీ సంగతులు

27

హాసం
హాస్య - సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం













'సెంటర్ స్ప్రెడ్'లో - 'బాబీ' 'నీ స్నేహం' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'నీ స్నేహం'లో ఆర్తీ అగర్వాల్

"రాత్రింబవళ్ళు నన్ను వేధించే వొత్తిళ్ళ మధ్య నేను కనీసం నవ్వకపోతే చచ్చిపోవాల్సి ఉంటుంది" అన్నాడు అబ్రహాంలింకన్. ఇజ్రాయిల్ - పాలస్తీనా దేశాలమధ్య నిత్యం యుద్ధ వాతావరణం అలుముకుంది. అయితే పాలస్తీనా ప్రజలు జోరుగా జోక్స్, హాస్య చతురత, కామెడీ చిత్రాలు, కార్టూన్ గీతలు చూసి భయ వాతావరణాన్ని పోగొట్టుకొని ఉల్లాసంగా జీవించడానికి శతథా ప్రయత్నిస్తున్నారట.

పుడుతూనే జవజీవాన్ని సూచిస్తూ ఏడ్చినా, అనంతర కాలంలో ఇతరుల మనసులను దోచుకోవడంలో మనిషికి ఉపయోగపడేది హాస్యమే! తోటి వాని నవ్వుతో శృతికలపడానికి సాహసిస్తాం. కానీ ఏడుపులో కాదుగా!

కడుపుబ్బా నవ్వటం వల్ల శరీరంలో 'లింఫోసైట్స్' అధికంగా ఉత్పత్తి అయి, మనిషి ఆరోగ్యంగా ఉండడానికి దోహదపడతాయని మనస్తత్వ శాస్త్రవేత్తలు అంటున్నారు. మందు కాని మందు "హాసం" పత్రిక.

నేను "హాసం" సంచికలు క్షుణ్ణంగా చదివిన పిమ్మట, వాటిని నిజామాబాద్ పట్టణంలోని ఒక గ్రంథాలయ మెమోరియల్ ట్రస్టు వారికి పాఠకుల ప్రజోపయోగంగా చిరుకానుకగా అందజే సంకల్పించాను. అందరినీ సంతోష పెట్టబోతున్నానన్న ఈ భావన ఒక అలౌకిక ఆనందాన్ని కలిగించింది.

'హాసం' ద్వారా ఈ ఆనందాన్ని కలిగించిన మీకు కృతజ్ఞతలు.

**తాళ్లూరి జయదేవ్,**
**మక్లూర్ (నిజామాబాద్ జిల్లా)**

మా కుటుంబమంతా జూన్ నుండి 'హాసం' రెగ్యులర్‌గా చదువుతున్నాము. అన్ని శీర్షికలు చాలా బాగున్నవి. ప్రస్తుత పరిస్థితులలో కుటుంబమంతా కలసి చదవగలిగిన పత్రిక 'హాసం' మాత్రమే. ఇలాగే మంచి శీర్షికలతో కొనసాగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ...

**డి.వి.ఎస్.రాజు,లింగాల, కృష్ణాజిల్లా**

'హాసం' 26 పత్రికలు కొన్నాను. రసాస్వాదన చేస్తున్నాను. కిశోర్ జీవిత ఘట్టాలు ఆశ్చర్యం కలిగించినవి. భాత్రుప్రేమకు, కొంటె చేష్టలకు అబ్బురం అనిపించింది. కిశోర్ పాటలకు హ్యాట్సాఫ్. షమ్మీకపూర్ గురించి, అతని పాటల గురించి తెలియజేసారు. ధన్యవాదములు. "హాసం" ఇతర భాషలలోకి చొచ్చుకుని వెళ్ళి అందరినీ అలరింపజేయాలని ఆశీస్సులు అందజేస్తూ...

**వి.మోహన్‌బాబు, అవనిగడ్డ**

తెలుగువారి హృదయాల్లో పీఠం వేసుకున్న మహనీయుడు శ్రీ ఘంటసాలని గురించి మధురమయిన భావాలను మనతో పంచుకున్న ఆయన సతీమణి సావిత్రి ఘంటసాల గారు అభినందనీయులు. వీణ చిట్టిబాబుని గురించిన




వ్యాసం చక్కటి విశేషాలను అందించింది. మార్క్స్ బ్రదర్స్ గురించి ముళ్ళపూడి రచన ఆయన మాటల్ని ప్రత్యక్షంగా వింటున్న అనుభూతిని కల్గించింది. చక్కటి రచనలను అందించిన మీకు కృతజ్ఞతలు.

**-వి.వి.సుబ్బారావు,విజయవాడ**

నేను సినిమా సంగీత అభిమానిని. నాదగ్గర చాలా కలెక్షన్ వుంది. ఒక్క ఘంటసాలవే సుమారు 3000 పాటలున్నాయి. హిందుస్థానీ కర్నాటక సంగీతజ్ఞుల పాటలు పేరున్న ఆర్టిస్టులవందరివీ ఉన్నాయి. 'హాసం' బ్రహ్మాండంగా ఉంది. అన్నీ శీర్షికలు అద్భుతం. 'హాసం'లో పాలు పంచుకుంటున్న ఎడిటర్, రచయితలు, అందరికీ దీపావళి శుభాకాంక్షలు.

**-జి.బి.వి.యస్.యన్.మూర్తి, బొబ్బిలి**

అందరిలాగే, నేను కూడా 'హాసం' అభిమానిని. అన్ని ఇష్యూలకు పైన నంబరు వేసుకుని జాగర్తగా ఫైల్ చేసుకుని, చిన్నపిల్లల్లాగా రోజూ చూసుకుంటుంటే కానీ మనసుండటం లేదు. నా క్లాస్‌మేట్ అమెరికాలో డాక్టర్. ఆమెకు పుస్తకాలు పంపాలి. చెక్ పంపుతున్నాను. దయచేసి మొదటి సంచిక నుండి ఇప్పటి దాకా పంపగలరు. మరొక్కసారి మీ కళాసేవకు నీరాజనాలు అర్పిస్తూ...

**-డా॥ ఎ.వి.గురువా రెడ్డి,**
**అపోలో హాస్పటల్స్,హైదరాబాద్.**

సెంటర్‌స్ప్రెడ్‌లో వేస్తున్న పాటల పుస్తకం కట్టుకోవడానికి వీలుగా ఉన్నాయి. అలాగే 'ఆ పాత(ట) మధురం' కూడా పుస్తకంలా వేస్తే బావుణ్ణు. పాఠకులు పదిలం చేసుకుని 'హాసం'ని గుర్తించుకుంటారు. ఇంకో రిక్వెస్టు-పాటల పుస్తకం కింద 'హాసం' పేరు వచ్చేట్టు చేస్తున్నారు. దానితో బాటు సంచిక తేదీ కూడా వేస్తే బావుణ్ణు.

**-కే.వీ.,జయపురం. ఒరిస్సా**

'హలో అమ్మా'హాసం' అనే ఓ సూపర్ పత్రిక వస్తోంది. ఈనాడు 'ఏజంటును అడుగు.' ఇది నా కూతురి సలహా. 'హలో అక్కా, నీ పేర 'హాసం' చందా కడదామనుకుంటున్నాను. కట్టనా? ఆల్‌రెడీ కట్టేశావా?' తమ్ముడి ఎంక్వయిరీ. ఇంతలో 'హాసం' కాంప్లిమెంటరీ అందుకున్నా. ఆణిముత్యం అంటే అతిశయోక్తి కాదు. ఇంత మంచి పుస్తకాన్ని 24 సంచికలు కొనలేనందుకు బాధపడ్డాను కానీ అంతలోనే అనిపించింది- అక్షరలక్షలు చేసే ఇంతమంచి పత్రికకు తగిన ప్రచారం చేయటం లేదని!

**-ఆయి కమలమ్మ, ఆలూరు, 518375**

జూలై నుండి'హాసం' చదువుతున్నాను. మీది ఓ సొగసైన, నాజూకు పత్రిక. గాలి కబుర్లకు తావు లేదు. ఇచ్చే సమాచారమా - నికార్సయినది, దాచుకోదగ్గది. పది రూపాయలకు చక్కటి పత్రిక లభిస్తోంది. 25 వ సంచికలో 'ఆల్బమ్' చాలా ఉపకరించింది. నా అభిమాన సంగీత దర్శకుడు ఓ.పి.నయ్యర్ ఇంటర్వ్యూ 3వ సంచికలో ప్రచురించారని తెలిసింది. ఎం.ఓ. చేస్తున్నాను. ఆ సంచిక పంపగలరు.

**-ఆర్.ఎల్.గోపాలరావు, నెల్లూరు-2**

25 వ సంచిక చదివిన తర్వాత 'అరే ఎంతమంచి పత్రికలు వదిలివేసాను' అని బాధపడ్డాను. మీరు నమ్మితే నమ్మండి -శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు గారి సీరియల్ ఆఖరుభాగంలో ఆయన కుటుంబ ఆర్థిక సమస్యలు చదివి కన్నీరు కార్చాను. ఆయన పాటలు నా దగ్గర చాలా ఉన్నాయి. ఇవియే కాక పూర్వం రోజులలో పాటల పుస్తకాలు ఉన్నాయి. పత్రికలు కొనడం అలవాటులేని నన్ను ఈ పత్రిక మాత్రం కొనిపించింది.

**-ఎం.నారాయణరావు, విజయనగరం**

సంగీత సాహిత్యాలను హాస్యంతో రంగరించి మాకందించి ఎంతో ఆనందానికి కారకులౌతున్న మీకు ధన్యవాదములు. ఎన్నో మంచి పాటలకు స్వర రచన చేసిన సంగీత దర్శకులు కీ॥శే॥ శ్రీ సత్యం గారి గూర్చిన జీవిత విశేషాలు, అనుభవాలు తెలుసుకోవాలని కుతూహలంగా ఉంది. దయచేసి మీ పత్రికలో ప్రచురిస్తారని కోరుకుంటూ...

**బెహరా తిరుమలరావు, పాత టెక్కలి.**

ఈ మధ్య గుంటూరులో ఎస్.పి.బాలు 26 అవర్స్ మ్యూజికల్‌నైట్ జరిగింది. అక్కడ 'హాసం' గురించిన చర్చ వచ్చింది. పత్రిక గురించి ప్రశంసలెన్నో వింటున్నాను. పండితులచే ప్రశంసలందుకుంటున్న పత్రిక బహుశా ఇదే కావచ్చు. 'హాసం'కు ఆశీర్వాదాక్షరాలతో

**-లక్ష్మీ గోపాలన్, బూరుగుపల్లి.**

హిందీ పాటల అర్థాలు వేస్తూ తమిళపాటలను అలక్ష్యం చేస్తున్నారేం? మంచి తమిళపాటలను కూడా పరిచయం చేయండి.

**కొత్తపల్లి సూర్యనారాయణ, పినపళ్ల**
533232

16-31 అక్టోబరు సంచికలో బాక్స్ ఐటమ్స్ అన్నీ చాలాబాగున్నాయి. కీప్ ఇట్ అప్.

**జి.ప్రభాకర్‌రావు, హైదరాబాదు**

సంపుటి : 2 సంచిక: 3

**1-15 నవంబరు 2002**

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200



మేనేజింగ్ ఎడిటర్

**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్

**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ

**డా॥ కె.వి.రావు**

**జె.మధుసూదన శర్మ**



The one and only Magazine devoted to Humour & Music




# హాసం

## హాస్య-సంగీత పత్రిక



దేశానికే కాదు, లోకానికి కూడా ఐకమత్యమే బలం. నాలో, నీలో ఉన్నది ఒకటే బ్రహ్మమని, పలికేది ఒకటే నాదమని, ఒకటే జీవనవేదమనీ గ్రహించినప్పుడే సంఘీభావం కలుగుతుంది. మనసులోని ఇరుకుపొరలు చీల్చుకుని, ఇరుకుగదులు దాటి పైకి వచ్చి విహంగావలోకనం చేసినప్పుడు మనం గీచుకున్న ఈ ఎల్లలు చెరిగిపోతాయి, అదృశ్యమైపోతాయి. సాటి మనిషిపట్ల సహానుభూతి పెరుగుతుంది. అలా కాకుండా గిరి గీచుకుని ఉండిపోతే నాది అనేది తప్ప వేరేదీ కనబడక 'నా సంస్కృతి గొప్పది, నా భాష గొప్పది, నేనుగొప్పవాడిని' అని పదేపదే వల్లెవేసుకుంటూ అహంభావంతో తోటివాడి పట్ల చులకనభావం పెంచుకుంటాం.

ఒక జోకు లాటి నిజం ఏమిటంటే - భారతసమైక్యతకు దోహదం చేసినవి రెండుట! - మసాలదోశా, హిందీ సినిమా పాటా! ఇవి దేశమంతటా ఆదరించబడతాయి. హిందీ పాటలకు సంగీతం సమకూర్చిన కంపోజర్స్ దేశం నాలుగుమూలల నుండి వచ్చిన వారని తెలుసుకున్నప్పుడు మనందరిలోనూ ఉన్న అంతస్సూత్రం ఒకటేనని ఒప్పుకున్నట్టేగా! విదేశీ సంగీతం వినబోతే ఇటు తూర్పునున్న జపాన్ నుండి అటు పశ్చిమాన ఉన్న అమెరికా దాకా అన్ని రకాల సంగీతాలు ఆత్మీయంగా అనిపిస్తాయి. వాటిలోని లయ మనను అలరిస్తుంది.

ఏతావాతా తేలిదేమిటంటే మనుష్యులందరిలోనూ -ఏ దేశానికి చెందినా, ఏ మతానికి చెందినా సరే -హార్ట్‌బీటూ ఒక్కటే, సంగీతంలో బీటూ ఒక్కటే! 'ఈ విషయాన్ని అందరూ గుర్తించేలా చేస్తే,మనలో ఐకమత్యం పెరిగి, మనమంతా కలిసి సమైక్యరాగం ఆలాపిస్తాం" అన్న ఆలోచనలోంచి పుట్టుకువచ్చినదే గతపక్షం హైద్రాబాద్‌లో ఏర్పాటుచేసిన "సమైక్య రాగాత్మ" అనే విలక్షణ కార్యక్రమం.వివరాలు లోపలి పేజీలలో చూడవచ్చు.

మనుష్యులను సమైక్యం చేయడానికి సంగీతమే కావాలా అనవచ్చు. భాష, మతం -ఇవన్నీ లేవా? అనవచ్చు కొందరు. భాష సంగతి తీసుకుంటే బైబిలులో ఒక కథ ప్రకారం అప్పటి జనులందరూ కలిసి స్వర్గాన్ని అందుకుందామని "టవర్ ఆఫ్ బాబిలోనియా" కట్టబోతే, దేవుడు అనేక భాషలు సృష్టించాడట. దెబ్బకి మనుష్యులు రకరకాల భాషలు మాట్లాడటం మొదలుపెట్టి, అంతా గందరగోళమయిపోయి, వారి మధ్య ఐకమత్యం పోయిందట. ఈ కథలో నిజానిజాలు ఎలా ఉన్నా, భాష కొందరు మనుష్యులను కలుపుతూనే వారిని మరికొందరితో విడదీస్తోందని అర్థమవుతోందిగా! అలాగే మతం. సాధారణంగా మతం మనుష్యలను కలిపి కుడుతుంది. కానీ ఒక్కోప్పుడు మరోలా కూడా కుడుతుంది. ఆ 'రెలిజియన్‌బగ్' ఉందే అది మహా రక్తపిపాసి. ఇతర మతస్తులకు వ్యతిరేకంగా ఈ మతస్తులను కూడగడుతుంది కానీ మనుషులంతా ఒక్కటే అన్న అవగాహన కలిగించదు.

కానీ సంగీతం!? సంగీతం మనుష్యులను కలుపుతుంది. అంతే కాదు మన మనోక్షేత్రాలలో పెరిగే కలుపును, మనిషికీ మనిషికీ మధ్య దూరం పెరిగితే పుట్టుకువచ్చే కలుపును తొలగించి వేస్తుంది. ఏ ప్రాంతానికి చెందిన సంగీతానికైనా సరే, మనం తలాడిస్తాం. కాళ్లు 'టాప్' చేస్తాం. ఆనాటి సభలో మనకు పరిచితమైన సంగీతధోరణులకు దీటైన స్పందన అరబిక్ పాటలకు, పాశ్చాత్య సంగీతానికి కూడా లభించిందంటేనే తెలుస్తోంది- సభ లక్ష్యం నెరవేరిందని.'హాసం' ప్రచురణకర్త శ్రీ వరప్రసాద్‌రెడ్డి సహకరించి, పాలుపంచుకున్న ఈ కార్యక్రమాన్ని రాష్ట్రప్రభుత్వ సాంస్కృత మండలి, సాంస్కృతిక శాఖ సంయుక్తంగా నిర్వహించాయి.



ఈ కార్యక్రమాన్ని వివిధపట్టణాలలో నిర్వహించి, సంగీతం ద్వారా దేశసమైక్యతను ప్రచారం చేసే విషయం ప్రభుత్వం ఆలోచిస్తే బాగుంటుంది.


HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
*email:* haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

> అదేం విచిత్రమోగానీ మా ఇంటికి వచ్చినవాళ్ళంతా లివింగ్ రూమ్‌లోకితొంగిచూసి ఆశ్చర్యంతో ముక్కుమీద వేలేసు కుంటుంటారు. బుగ్గలు నొక్కుకుంటూ వుంటారు. మమ్మల్ని అడవి మనుషులుగా, వింత మృగాలుగా చూస్తూ వుంటారు.

# బుల్లితెర పెట్టిన ఇల్లు

**డాక్టర్ (శ్రీమతి) కొరారి వాణీ చలపతిరావు**



ప్రపంచంలోని ఎనిమిదవ వండర్ ఏదో మా ఇంట్లోనే జరుగుతున్నట్లు కళ్ళు విప్పుకుని 'అదేమిట్రా' అన్నట్టు ముఖంలో విడ్డూరపు ఎక్స్‌ప్రెషన్స్ యిస్తూ వుంటారు.

అంతమంది అంతగా 'హాశ్చర్య పోవటానికి కారణం మా ఇంట్లో టీ.వి. లేకపోవడం'.

ఈ రోజుల్లో టీవీ లేని ఇల్లుందా?!

ఇంట్లో ఒక పొయ్యి... ఆ పొయ్యి మీదికి ఒక తెప్పాలా ... అందులో ... వండుకోవటానికి బియ్యం గింజలు లేని వాళ్ల ఇంట్లో కూడా ఓ టీ.వి ఉంటోంది. కలరో, బ్లాక్ అండ్ వైటో- కనీసపక్షం పోర్టబుల్ టీవీ అయినా ఉండక తప్పదు. ఇందులో ఏ ఒక్కటీ మా ఇంట్లో లేకపోవటం మమ్మల్ని అందరూ బి.సి. మనుషులుగా ట్రీట్ చేయడానికి కారణం అయింది.

నేను మాత్రం అవేవీ పట్టించుకోను. మా పద్ధతులు మావి. మా ఇష్టాయిష్టాలు మావి... పదిమంది పొయ్యేదారిన పోనంత మాత్రాన నేనెందుకు సిగ్గుపడాలి? ఉలిపికట్టెలా ఒంటరిగా నాదారిన నేను నడుస్తున్నందుకు నేను గర్వపడాలి నిజానికి. గర్వం ఎందుకంటే మా ఇంట్లో టీ.వీ. లేకపోయినా... ఏ బంధువుల ఇంటికో, స్నేహితుల ఇంటికో వెళ్ళినప్పుడు అక్కడ టీవీ వుంటుంది గనుక దాని కథాకమామీషు నాకు బాగా తెలుసు....

ఆ మధ్య ఒకసారి మా పెదనాన్నగారి అమ్మాయి ఇంటికి... ఊళ్లోనే వుంటుంది కదా ఒకసారి పలకరించి వద్దామని వెళితే కుటుంబ సభ్యులందరూ కూర్చుని టీవీ సీరియల్ చూస్తున్నారేమో మమ్మల్ని చూడగానే ఎందుకొచ్చారా అన్నట్లు విసుగ్గా ముఖాలు పెట్టారు.

"రండి, కూర్చోండి. బాగున్నారా? మంచి నీళ్ళు తాగుతారా" అంటూ పొడిపొడి మాటలు మాట్లాడుతూ చూపుల్ని మాత్రం టెలివిజన్ స్క్రీన్‌లకే అంటించి అర అంగుళం కూడా మా వైపు తిప్పలేదు. కరువుతీరా కబుర్లు చెప్పుకోవాలని వెళితే మా అక్కయ్య, బావగారు మీరు 'విధి' సీరియల్ చూస్తున్నారా ? 'పవిత్రబంధం' బాగుంటోంది కదూ. మీరు 'ఈటీవి' ఎక్కువగా చూస్తారా? 'జెమినీ'నా? అంటూ టీవీ పట్ల తమకున్న పరిజ్ఞానమంతా బయటపెట్టుకున్నారు. 'మా ఇంట్లో టీ.వీ. లేదు' అని నేను చెబితే అప్పుడు స్క్రీన్ మీద నుంచి కళ్ళు అందరూ ఒకేసారి మావైపు తిప్పి 'మీదీ ఒక బ్రతుకులేనా?' అన్నట్లు చూసారు.

నేను మాత్రం వాళ్ళని, వాళ్ళ చూపుల్ని పట్టించుకోనట్లు బుల్లితెర మీదికి దృష్టిసారించాను. అదేదో సీరియల్.... పేరు తెలియదు. నేను వెళ్ళి కూచున్నప్పటి నుంచీ ఆ హీరోయిన్ ఏడుస్తూనే వుంది. మధ్యమధ్యలో బరువైన డైలాగులు చెబుతూనే వుంది. ఇక మిగతా క్యారెక్టర్స్ అవస్థలు అన్నీ యిన్నీ కావు. ఎంచి... ఎంచి హీరోయిన్‌కి ఓ అందమైన - క్లిష్టమైన పేరు పెట్టారు... రచయిత. 'మృణాళిని' అట, నిముషానికి పదిసార్లు డైలాగుకు ఆ చివర, ఈ చివర ఆ పేరు ఉచ్చరించాలి. ఒక్కళ్ళకూ పలికి చావటం లేదు. అందులో కొందరికి నాలుక కాస్తమందం కూడానాయె. విసుగొచ్చేసింది. మా ఆవిడ మాటిమాటికీ నావంక కోపంగా చూడటం, మా పిల్లలు 'ఇక వెళ్దాం' అన్నట్లు సైగలు చేయడంతో 'ఇక వస్తామక్కయ్యా' అంటూ లేచాను.

"అయ్యో! అదేమిటి? అప్పుడే వెళతారా?" అంటూ కూర్చున్న చోటి నుంచి కదిలింది మా అక్కయ్య.

"వాళ్ళకు టీ అన్నా పెట్టి ఇవ్వవే... పాపం అంతదూరం నుంచి వచ్చారు" అన్నారు మా బావగారు.

నాకు వళ్ళు మండిపోయింది.

మా శ్రీమతి వంక చూడలేక ముఖం దించుకున్నాను.

'టీ' నీళ్లకోసమే అంతదూరం నుంచి వచ్చినట్లు వాళ్ళ ట్రీట్‌మెంట్ చూసి 'వద్దు... వద్దు... వస్తాం' అంటూ ఖంగారు పడిపోయాను.

"టీ" అయినా తీసుకోకుండా మీరు పోవటానికి వీల్లేదు. అంటూ అక్కయ్య వచ్చి చేతులు పట్టుకుని కూర్చోపెట్టింది బలవంతంగా.

మొక్కుబడి మర్యాదలు ఎంత బాధాకరంగా వుంటాయో అతిథిగా అప్పుడు మొదటిసారి నాకు అనుభవం అయింది. తప్పనిసరై కూర్చున్నాం.

పలకరింపులు, ఆదరింపు మాటలు, ఆప్యాయతలు, ఆదరణలు అన్నీ టీ.వి వాల్యూమ్‌లో కలిసి పోయాయి.

మాటలు రాని బొమ్మల్లా, గోడలకు అంటుకుని పోయిన చిత్రపటాల్లో కుర్చీలకు అంటుకుపోయాం నలుగురం.

ఒక్క క్షణం కుదురుగా ఒకచోట కూర్చోని పిల్లలిద్దరు సైతం వాళ్ళ పిల్లల పక్కన సోఫాలో అస్థిమితంగా కదులుతూ మాటిమాటికి నావంక దీనంగా చూస్తున్నారు.

'టీ'లు బిస్కట్లు వచ్చాయి.

బిస్కటు చేతిలో పట్టుకుని మా ఆవిడ 'తినొచ్చా? మనుషులు తినేవేనా? పొరపాటున...' అంటూ నా చెవిలో గొణిగింది. గుమ్మంలో అడుగు పెడుతూనే 'భౌ భౌ' అంటూ మాకు స్వాగతం పలికిన అక్కయ్యగారి పెంపుడు కుక్కను దృష్టిలో పెట్టుకుని మా ఆవిడ వేసిన ఆ జోక్ నాకు నవ్వు తెప్పించింది. అక్కడ ఆ ఇంట్లో వున్న ఆ అరగంట... జైల్లో వున్నట్లు... ఊపిరాడక ఉక్కిరిబిక్కిరై... ఆఖరికి 'బ్రతుకు జీవుడా' అని

బయటపడ్డాం. తలుపులు తీసుకుని ఇంట్లోకి అడుగు పెట్టగానే ప్రాణం లేచి వచ్చినట్లయింది.

ఆ రోజు ఆఫీసు నుంచి ఇంటికొచ్చేసరికి మా ఇంటికి చుట్టాలెవరో వచ్చారు. ఇల్లు కిష్కింధలా వుంది. మా ఆవిడ మా ఆవిడలా లేదు. అంటే నన్ను పట్టించుకోకుండా, నేను ఇంటికి వచ్చానన్నా స్పృహలేకుండా లేకుండా వంటింట్లో వచ్చినావిడతో ఒక పక్కన కబుర్లు చెబుతూనే మరోపక్క అతిథి మర్యాదలు చేస్తోంది. నాకు పొరపాటున ఏ పరాయి ఇంటికో వచ్చినట్లుగా అనిపించింది. ఇంతకూ వచ్చినవారు ఎవరా అని ఆలోచిస్తుంటే మా బావమరిది మొలకు టవల్‌తో బాత్‌రూములో నుండి ఊడి పడ్డాడు. "హలో! బావగారూ. ఎలా వున్నారు?'' అని ముఖమంతా నవ్వు పులుముకుని నన్ను పలకరించాడు.



"బాగున్నారా అన్నయ్యగారూ'' అంటూ మా బావమరిది భార్య వంటింట్లో నుండి బయటకొస్తూ కుశల ప్రశ్నలడిగింది.

"హాయ్ అంకుల్" అంటూ మా బావమరిది ఇద్దరుకొడుకులు పిల్లల బెడ్‌రూమ్‌లోంచి వచ్చారు.

వివిధ వ్యూహాలతో శత్రుసైన్యం అకస్మాత్తుగా వున్నట్టుండి నన్ను చుట్టుముట్టినట్టుగా అనిపించింది.

"ఎప్పుడొచ్చారు?'' అని అడిగాను మర్యాదపూర్వకంగా.

"పొద్దున్నే వచ్చాం. పిల్లలకు దసరా శలవులు కదా. బోర్ కొడుతోంది అలా అలా తిరిగొద్దాం అంటే బయలుదేరాం. కానీ మా పిల్లలు ఇక్కడికొచ్చాక ఒక్కరోజులోనే బోర్ కొడుతోంది అంటున్నారు''

"అదేం?"

"మీ ఇంట్లో టీవీ లేదుగా. వాళ్ళు అదిలేకుండా ఒక్క నిముషం కూడా వుండ లేరు. అవునుగానీ... అదేంటి బావగారూ. సిటీలో వుంటూ మీ ఇంట్లో టీవీ లేకపోవడం ఏమిటి? పల్లెటూరిలో వుండే మాకే ట్వంటీఫైవ్ ఇంచెస్ కలర్ టీవీ వుంది. మొన్నీ మధ్య పాతది మార్చి ముప్పయివేలు పెట్టి ఎల్.జి. టీవి కొన్నాను. మీరు చాలా జాగ్రత్తగా, కాలుక్యులేటెడ్‌గా వుంటారులా వుంది. లైఫ్ అన్నది ఎందుకు బావగారూ... ఎంజాయ్ చేయటానికేగా?'' అంటూ కృష్ణపరమాత్మ పోజులో హితబోధ మొదలుపెట్టాడు.

వళ్ళు మండిపోయింది నాకు. నోటికి అడ్డూ అదుపులేకుండా అతను అలా వాగుతూ నన్నో పిసినారిగా బిల్డప్ ఇవ్వటం నాకు నచ్చలేదు. ఆపద సమయంలో నా పక్కన నిల్చి కాస్త నాకు సపోర్ట్ చేస్తుందేమోనని మా ఆవిడ వంక ఆశగా చూసాను.

కానీ ఆవిడా "మా వదినా అదే అంటోందండీ. ఇక టీవీ అలవాటయిన పిల్లలు 'అత్తయ్యా, టీ.వీ లేకుంటే ఎలా? పోనీ మీ పక్కింటికి వెళ్ళి చూసి రామా?' అని దీనంగా అడుగుతూ కాలుకాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతున్నారు'' అంది. ఆ మాటలకు ఆశ్చర్యంతో నోరెళ్ళబెట్టి అలాగే చూస్తుండి పోయాను.

"ఏ నాడూ నోరు తెరిచి... కనీసం పెళ్ళయిన కొత్తలోనయినా టీవీ కొనిపెట్టమని అడగని మా ఆవిడ, పోయిన ఆదివారం అక్కయ్య వాళ్ళింటికి వెళ్ళినప్పుడు వాళ్ళు 'టీవి పెట్టుకుని కూర్చుని మనల్ని పట్టించుకోలేదు. అలాంటి ఇళ్ళకు నన్ను మరోసారి రమ్మని పిలవకండి'' అని నాలుగు రోజుల వరకు నన్ను సాధించిన నా ఉత్తమ ఇల్లాలు.. ఒక్క రోజులో ప్లేట్ మార్చేయటం, వచ్చిన అతిథులకు టీవీ మర్యాద చేయలేక పోతున్నందుకు అంతగా బాధపడటం నాకు అబ్బురమనిపించింది.

"మనకోసం కాకపోయినా ఇంటికి వచ్చి వెళ్ళే వాళ్ళకోసమయినా టి.వి. కొనక తప్పేలా లేదు.'' స్వగతంలా అనుకుంటున్నట్లు పెద్దగానే అనేసింది నేను వినాలని.

మెదడులో ఒకసారి ఈ 'టీవీ' పురుగు జొరబడనే కూడదు. జొరబడిందంటే ఇక అంతే! కుమ్మరి పురుగులా తొలిచేస్తూ వుంటుంది.

'మా బావమరిది భార్య చూడటానికి అలా బక్కపీచులా, పెద్ద గాలివస్తే కొట్టుకుపోయే దానిలా వుంటుంది గానీ అఖండురాలు. ఎంత వాక్చాతుర్యం లేకపోతే మా ఆవిడను అలా ఒక్క రోజులో మార్చేయగలిగింది!? సంవత్సరాల తరబడిగా టీ.వి. మీద ఏర్పరుచుకున్న ఆరోగ్యవంతమైన ఓ మంచి అభిప్రాయాన్ని క్షణంలో బూడిదలో పోసిన పన్నీరులా చేసేసింది. ప్చ్!' అని నేను తీరుబడిగా కూర్చుని వేడినిట్టూర్పులు విడుస్తూ వుంటే మా పిల్లలిద్దరూ పరుగు పరుగున నా దగ్గరికి వచ్చి నా మూడ్ చూసి కాబోలు ఠక్కున ఆగిపోయి 'నువ్వడుగు అంటే నువ్వడుగు' అని ఒకర్నొకరు సైగలు చేసుకుంటూవుండటం కనిపించింది.

ఏమిటన్నట్టుగా చూసాను.

'డాడీ! మనం కూడా టి.వి. కొందాం. చాలా మంచి మంచి ప్రోగ్రాములు వస్తాయని... బోలెడు కొత్త కొత్త విషయాలు కూడా తెలుస్తాయని సుధీర్, కిషోర్ చెబుతున్నారు. ఇప్పుడొచ్చే టీవీల్లో ఇరవై, ఇరవై ఒకటి ఛానల్స్ వస్తాయట... ఒకటి

నచ్చకపోతే ఇంకొకటి కూర్చున్నచోట నుంచే రిమోట్‌తో మార్చుకుని చూడొచ్చట" అన్నారు కోరస్‌గా.

నాకు పుండు మీద కారం చల్లినట్లుగా వున్నాయి ఆ మాటలు. దానికి తోడు మా బావమరిది "మీరెంత చెప్పినా మీ డాడీ వినడ్రా. ఆయన ఒక కూపస్థమండూకం. ఈ రోజుల్లో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఒక చక్కటి మీడియాటీవీ. అదొకటి కొనుక్కొచ్చి ఇంట్లో పెట్టి పిల్లలకు జ్ఞానాభివృద్ధిని కలిగించాలన్న జ్ఞానం లేని మనిషి... కొంతమంది జీవితాలు అంతే... ఎవరెంత చెప్పినా మారవు" అన్నాడు.

నాకు మరింత మండింది.

"టీవీ లేదు ... ఏం లేదు... పొండి అవతలికి.... బాగుపడుదామని లేదా మీకు?" అని ఒక్క కసురు కసిరాను. పిల్లలు భయపడి అవతలికి వెళ్ళిపోయారు. ఇంకా కోపం తగ్గక మా ఆవిడవైపు తిరిగి "నీకయినా బుద్ధి వుండక్కర్లా. ఎవరి మాటలో విని పిల్లల్ని అలా రాయబారం పంపిస్తావా?" అన్నాను చిరాకుగా ముఖం పెట్టి. దాంతో మా ఆవిడకు గిర్రున కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నేను అన్నందుకు కాదు ఆ రోషం.... నేనలా కసురుకోవడం వల్ల తన అన్న ముందు, వదిన ముందు తన పరువు పోయిందని నేను మాత్రం ఏం చేయను? ఇంతకు ముందు ఎప్పుడన్నా ఆవిడను నేను పన్నెత్తు మాటయినా అన్నానా? నా భార్యాపిల్లల ముందు నా బావమరిది నన్నో పురుగులా అలా... బావగారన్నా గౌరవం లేకుండా దులిపేస్తుంటే నేనూరుకుంటానా? బావమరిది మీది కోపం వాని చెల్లెలు మీద చూపించాను. తిక్కకుదిరింది. మరోసారి ఇక నోరెత్తడే" అనుకున్నా ఆనందంగా.

కానీ నా ఆనందం ఎంతో సేపు నిలవలేదు. నా బావమరిది నాకన్నా తెలివిగలవాడని, మాటలతోనే కాక చేతలతోనూ నన్ను దెబ్బతియ్యగలడని ఆ మర్నాడు కానీ నాకు తెలియలేదు.

ఉదయం ఆఫీసుకెళ్ళాలని నేను తయారవుతూ వుంటే మా బావమరిది నా దగ్గరికి వచ్చి మెల్లగా "ఈ రోజు మధ్యాహ్నం ట్రయిన్‌కు మేము మా అన్నయ్యగారి వూరికి వెళుతున్నాం బావగారూ. మీరు ఆఫీసునుంచి వచ్చేసరికి మేము ఉండమని ఇప్పుడు చెబుతున్నాను" అన్నాడు.

"హమ్మయ్య" అనుకున్నాను మనసులోనే.

"పిల్లలకు సెలవులని వచ్చావు గదా... అన్నయ్యా. అప్పుడే ఈ ప్రయాణం ఏమిటి?" అంది మా ఆవిడ పానకంలో పుడకలా ఆనందదాయకమైన ఆయన ప్రయాణానికి అడ్డుతగులుతూ.

"అన్నయ్య దగ్గర రెండు రోజులుండి అటునుంచి తమ్ముడి దగ్గరకి వెళ్ళి ఆ పైన మెల్లిగా ఇల్లు చేరుకుంటాం" అన్నాడు మా బావమరిది.

'నన్ను బతికించారు. మరెవరో బలికాబోతున్నారు పాపం' అని మనసులోనే అనుకున్నాను. చుట్టాలు వెళ్ళిపోయారన్న సంతోషంతో ఆ సాయంత్రం అందమైన కుటీరంలాంటి మా ఇంటిని మనసులోనే తలచుకుంటూ ఆ ప్రశాంతతను, ఆ మనశ్శాంతిని అనుభవించటం కోస ఆరాటంగా ఇంటికి వచ్చాను.

లోపలినుంచి గందరగోళంగా ఏవో మాటలు వినబడుతుంటే, 'కొంపముంచి వచ్చిన చుట్టాలు ఇంకా వెంచేయలేదా ఏంటి?' అనుకుంటూ బితుకుమంటున్న గుండెలతో లోపలి అడుగుపెట్టాను. మా ఆవిడ ఆనందంగా ఎదురొచ్చి నా చేతిలో బ్రీఫ్‌కేస్ అందుకుంది.

"వచ్చారా? మీరు ఎప్పుడెప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నాం" అంది ముఖం హారతి పళ్లెంలా వెలిగిపోతుండగా.

"ఎందుకు?" అడిగాను ఆసక్తిగా.

"మనకు టీవీ వచ్చిందండీ. వెళుతూ ... వెళుతూ మా అన్నయ్య నాకోసం ఇది కొనిచ్చి వెళ్ళాడు. ఎలా వుందో చూడండి" అంది.

"అమ్మ బామ్మర్దీ. నన్ను ఇలా కొట్టావా?" అని మనసులో అనుకుని "సిగ్గులేదూ నీకు. అలా ఎవరు ఏదిస్తే అది తీసుకోవటమేనా? నీ మొగుడి పరువు పోతుందన్న ఆలోచనే రాలేదా నీకు?" అన్నాను పిచ్చి కోపంతో ఊగిపోతూ.

"నేను వద్దనే అన్నానండీ. అంతగా అవసరం అనిపిస్తే మీ బావగారు తెస్తార్లే అన్నయ్యా' అని కూడా అన్నాను. కానీ ఒక్కతీరుగా బలవంతం చేసాడు. 'ఆడపిల్లవు' నీకు ఆ మాత్రం నేను కొని పెట్టకూడదా? పసుపు కుంకుమల కింద పట్టు చీర బదులు ఈ టెలివిజన్ కొనిస్తున్నాననుకో' అన్నారు. అసలు బజారుకు వెళ్లి కొని ఆటోలో పెట్టించుకుని వచ్చే వరకూ కూడా నాకు ముందు తెలియదు. "తీరా వచ్చాక వద్దనటం 'అతి'గా వుంటుందని నేను మరీ ఎక్కువగా మొహమాట పడలేదు" అంది శ్రీమతి టి.వి వచ్చినందుకు ఒక పక్కన లోలోపల సంతోషపడుతూ, 'కాసేపు అరిచి వాడే నోరు మూసుకుంటాడులే' అన్న ధోరణికి ఆమె ముందుగానే ప్రిపేర్ అయి వున్నట్లు అనిపించింది. నానుండి తప్పించుకోవడం కోసం



'టీ' వంకతో కిచెన్ లోపలికి వెళ్లిపోయింది. పిల్లలు కొత్తగా పట్టిన టీ.వీ. పిచ్చిలో కేరింతలు కొడుతూ నేను వచ్చిన విషయాన్ని కూడా పట్టించుకునే స్థితిలో లేరు.

****

టీ.వి. వచ్చినప్పటి నుంచీ నట్టింట్లో తద్దినంలా వుంది నా పని. మా ఇల్లు బుల్లితెర పట్టిన ఇల్లయిపోయింది. బావమరిది కొనిచ్చిన బాపతు గనుక పొరపాటున కూడా నేను కన్ను అటు వెయ్యడానికి వీల్లేదు.

వార్తల సమయంలో కూడా నన్ను నేను కంట్రోల్ చేసుకుంటున్నాను. ఆ విషయం కనిపెట్టినదానిలా మా ఆవిడ డైరెక్టుగానో, ఇన్‌డైరెక్ట్ గానో నన్ను బుజ్జగించి, లాలించి చెయ్యి పట్టుకుని బుల్లితెర ముందు కూర్చోబెడుతోంది.

పిల్లలయితే స్క్రీన్ కతుక్కుపోయి కదలడం లేదు.

ఒక్క స్కూలుకు మాత్రం తప్పనిసరి అన్నట్లు ముఖాలు మాడ్చుకుని వెళ్లి వస్తున్నారు.

అదేం టీ.వీనో.... అదేం భాగోతమో....

న్యూసులో న్యూసుండవు... ఎడ్వర్టయిజ్‌మెంట్లు తప్ప..

సీరియల్స్‌లో కథ వుండదు సీరియస్ నెస్ తప్ప..

క్విజ్ ప్రోగ్రాముల్లో క్వశ్చన్స్ వుండవు. గిఫ్ట్ హేంపర్ల గొడవ తప్ప.

కండోమ్స్‌లు, కమ్‌ఫిట్‌లు గుట్టువిడిచి పెట్టి స్క్రీన్ అంతా వ్యాపిస్తుంటాయి.

సిగ్గుతో పెద్దలూ, సిగ్గులేకుండా కుర్రలూ - చూస్తుంటే అర్థంగాక పిల్లలు ఫేసులు అయోమయంగా పెట్టేస్తుంటారు. ప్రేక్షకుల సహనానికి పరీక్ష పెడుతున్నట్లుగా రోజా వచ్చే మెగా సీరియల్స్‌నే మళ్ళీ మళ్ళీ రిమైండ్ చేస్తూ ప్రకటనలతో విసిగించే నిర్మాతలు.

సినిమా క్విజ్‌లు -

సినిమా పాటలు -

సి ని వ ా

ప్రకటనలు - మిడ్‌నైట్ మసాలాలూ, మూడు డబ్బాలు 'ష్..' లు. అష్‌లు... అంతా ఒక మాయాజాలం. నట్టింట్లో నలుగురి ముందు జరుగుతున్న మోసం ఇది.

'గురూ' - అంటూ ఆడ యాంకర్లు వేసే ఈలలు... డింభకా! అంటూ సాహసం పేరిట చెట్లు, పుట్టలు యెక్కించడాలు, పురుగులు, పెంకులు తినిపించడాలు.

ఆఖరికి హెల్త్ ప్రోగ్రాంలో కూడా బాబ్డ్‌కట్ యాంకర్ భామల చిరునవ్వులు, కులుకులు, ఊగుడులు తప్పవాయే మరి.

వినే వాళ్ళుంటే చెప్పే వాళ్ళుంటారు.

ఫూల్ అయ్యే వాళ్ళుంటే ఫూల్ చేసే వాళ్ళు వుంటారు.

'టీవి ఇంట్లో వుంటే ఎన్నో గొప్ప గొప్ప విషయాలు తెలుస్తాయి' అన్నాడు బామ్మర్ది. చేతబడి, బాణామతి ఎలా చేయాలో సీరియల్స్‌లో చూపిస్తున్నారు. అది చూసి నిజమనుకొని నమ్మి పల్లెటూరి జనాలు వాళ్ళ ఊళ్ళో ఏ అమాయకుడ్నో అనుమానించి సజీవ దహనాలు, చెట్టు కట్టేసి కొట్టడాలూ చేస్తున్నారు. ఫైటింగుల పేరుతో ఎదుటి వాడి ముఖం పచ్చడి చేసి హింస ఎలా చేయాలో, దొంగతనాలు, దోపిడీలు ఎలా చేయాలో సినిమాల్లో ప్రాక్టికల్‌గా పాఠాలు చెప్పేస్తున్నారు కుర్రకారుకు.

ఇవన్నీ పిల్లలు కళ్ళప్పగించుకుని చూస్తూ వుంటారు.

తమకు తాము స్పైడర్‌మ్యాన్లగా, సూపర్ మ్యాన్లగా ఊహించుకుని అపార్ట్‌మెంట్ల మీద నుండి దూకి ప్రాణాల మీదికి తెచ్చుకుంటూ వుంటారు. అదొక ఫ్యాంటసీ ప్రపంచం అని తెలియక.



"ఏంటి అంతగా ఆలోచిస్తున్నారు? చూడండి. చూడండి. మంచి ప్రోగ్రాం" మోచేత్తో పొడుస్తూ తిరిగి నన్ను టీ.వీ. ప్రపంచంలోకి తీసుకొచ్చింది మా ఆవిడ.

నిన్న డ్యాన్స్ బేబీ డ్యాన్స్.

ఇవాళ డ్యాన్స్ 2002.

ఏ ప్రోగ్రాం చూసినా అంతా సినిమామయం.

"మా చిన్నతనంలో మా పల్లెటూర్లో రికార్డ్ డ్యాన్స్‌లని వేసే వాళ్ళు. జనం ఒకటే ఈలలు - కేకలు - దద్దరిల్లి పోయేది. అలాంటిదేగా ఇది. ఓల్డ్ వైన్ ఇన్ న్యూ బాటిల్" అన్నాను ప్రోగ్రాం చూస్తూ.

"చాల్లెండి. మీ జోకులు. ఏదయినా నచ్చకపోతే అలాగే వుంటుంది. ఇదంతా టీవి మీద కోపమేగా..." అంది మా ఆవిడ సాధింపుగా.

టీవి వచ్చి రెండు నెలలు అవుతోంది. మా పిల్లలకు జ్ఞానమేమోగానీ కళ్ళ జోళ్ళు మాత్రం వచ్చేసాయి.

పిల్లలు ఇదివరకటిలా చదవటం లేదనీ, నా భయం కొద్దీ పుస్తకాలు ముందేసుకున్నా చూపులు మాత్రం టెలివిజన్ మీద వుంటున్నాయని గ్రహించాను.

మా ఆవిడలో కూడా మార్పు వచ్చింది. ఇదివరకటిలా వంట రుచిగా చెయ్యడం లేదు. కూర మాడబెట్టడమో, పప్పులో ఉప్పువేయడం మర్చి పోవటమో చేస్తున్నది.

ఇదివరకటిలా నా పక్కన కూర్చుని కబుర్లు చెప్పటం లేదు. ప్రేమగా పలకరించటం లేదు. కొసరికొసరి ఆప్యాయంగా వడ్డించడం లేదు. పైగా పలకరిస్తే కసురుకోవడం, పని చెబితే మొరాయించడం చేస్తున్నది.

ఇది ఎంతదూరం పోతుందోనని నా గుండెలు పీచుపీచుమంటున్నాయి. అలా అంటూ వుండగా ఒక ఆదివారం మా అక్కయ్య,



బావగారు పిల్లలతో సహా ఆటో దిగేసారు.

"ఇదేమిటీ! ఈ చెప్పా పెట్టకుండా రాక..." అని ఆశ్చర్యపోతూ వుండగా "మా టీవి పాడయిపోయిందిరా తమ్ముడూ, ఇంట్లో ఏమీ తోచడం లేదు. అందుకే ఇలా వచ్చాం" అంది.

"మాకు ఆ అదృష్టం ఎప్పుడు పడుతుందో కదా!" అని మనసులో అనుకుని పైకి మాత్రం "మంచి పని చేసారు. రండి. రండి." అని ఆహ్వానించాను. వాళ్ళను చూడగానే మా ఆవిడ, మా పిల్లలు ముఖాల్లో రంగులు మారాయి. కృత్రిమపు పలకరింపులు, తెచ్చిపెట్టుకున్న నవ్వులతో తప్పనిసరి అన్నట్లు వాళ్ళని ఆహ్వానించారు. నాకు బాధ అనిపించింది. కోపం కూడా వచ్చింది. తొందరగా అయిపోతుందన్న ఉద్దేశ్యంతో కాబోలు మా ఆవిడ ఇంటికొచ్చిన అతిథులకు ఇంత ఉప్మా చేసి పెట్టేసింది. అదీ పోపు మాడి, రవ్వ వుండలుగట్టి పరమఛండాలంగా వుంది.

మేము కుటుంబ సమేతంగా అక్కయ్యగారి ఇంటికి వెళ్ళినప్పుడు టీవి పిచ్చిలో వాళ్ళు మాకెలాంటి మర్యాదలు చేసారో అచ్చం మేమూ అలాంటి మర్యాదలే చేసి అవమానించినట్లు అనిపించింది. ఆ రోజు మేమెంత బాధపడ్డామో ఈ రోజు వాళ్ళూ అంతే బాధపడివుంటారని అనిపించి చిన్నతన మనిపించింది. వాళ్ళు వెళ్ళిపోయాక అందరికీ ఒక క్లాసు తీసుకున్నాను. మరోసారి ఇంట్లో ఇలా జరగటానికి వీల్లేదని వార్నింగ్ ఇచ్చాను.

"మీ అక్కయ్యా వాళ్ళు కూడా మాతో మాట్లాడకుంగా టీవి చూస్తూనే వున్నారుగా. వాళ్ళకూ టి.వి పిచ్చే.." ఎదురు సమాధానం ఇచ్చింది మా ఆవిడ రోషంగా.

"అయినా... వాళ్ళు వచ్చింది మన ఇంటికి... అతిథులుగా " అంటూ ఇంక ఆ విషయాన్ని పొడిగించటం ఇష్టం లేక అక్కడినుండి వెళ్ళిపోయాను. ఏదయినా జాడ్యం అంటుకోనే కూడదు. అంటుకుంటే అది అంత త్వరగా వదలదు.

ఆ రోజు మా అబ్బాయి వణికే చేతులతో ప్రోగ్రెస్‌కార్డ్ తెచ్చి నాచేతికందించాడు. ఆశ్చర్యపోయాను. ఒక్క నెలలో ఎంత మార్పు!? 'ఎ' గ్రేడ్ నుంచి 'సి' గ్రేడ్‌కు దిగిపోయాడు. కళ్ళల్లో నీళ్ళు తిరిగినంత పనయింది నాకు.



'లాభం లేదు. ఏదో చెయ్యాలి. పరిస్థితులు ఇంకా విషమించకముందే ఏదో ఒకటి చేసేయాలి. ఏం చెయ్యను? ఎవరికీ తెలియకుండా టీవి వెనక నుండి ఏదయినా వైర్ కత్తిరించేయానా? లేక ఏ సుత్తో తెచ్చి నెత్తిన ఒక్కటేసి బద్దలు కొట్టేయ్యనా - 'ఆలోచించాను. తీవ్రంగా ఆలోచించాను. మొదటి పని చేస్తే టీ.వీ. రిపేరయి మళ్ళీ ఇంటికొచ్చేస్తుంది. రెండో పని చేస్తే రేపీపాటికీ మా ఆవిడ మరో కొత్త టీ.వి ఇంకా లేటెస్ట్ మోడల్‌ది కొన్నా కొనేస్తుంది. ముగ్గురన్నల ముద్దుల చెల్లెలు... ఒక్కఫోన్ కొట్టిందంటే ఏ అన్నో దిగబడి ఆడపడుచు లాంఛనం కింద మరో టీ.వి సెట్ కొనిచ్చి వెళ్ళినా వెళతాడు' అనుకున్నాను.

"ఏదో చేయాలి - ఏదో చేయాలి. శాశ్వత పరిష్కారం ఏదో కనుక్కోవాలి ' అని ఆలోచిస్తుండగా మా ఆవిడ ఏదో కొంప మునిగిపోయినట్లు ఒక్క కేక పెట్టింది.

'ఏమిటా?' అని పరుగుపెట్టాను.

"మీకో ప్లజంట్ సర్‌ప్రయిజ్. అలా చూడండి." అంది టీ.వీ. స్క్రీన్ వంక చూపిస్తూ చూసాను. చూసి డంగ్ అయిపోయాను. 'డాన్స్ బేబీ డాన్స్ ప్రోగ్రాంలో మా అమ్మాయి మరో అబ్బాయితో కలిసి డ్యూయెట్ డాన్స్ చేస్తోంది. షార్ట్, స్లీవ్‌లెస్ వేసుకుని వయసుకు తగని వయ్యారాలు ప్రదర్శిస్తూ రికార్డ్ డ్యాన్స్ చేస్తోంది.

మా ఆవిడ చప్పట్లు కొడుతూ తెగ మురిసి పోతోంది. మా పిల్లలు కేరింతలు కొడుతున్నారు. పాట అయిపోగానే ఫోన్ల మీద ఫోన్లు. ఎంతమందికి చెప్పి వుంచిందో మా ఆవిడ. అందరూ కంగ్రాచ్యులేషన్స్ చెబుతున్నారు. ఆనందం పట్టలేకపోతున్న ఆవిడని చూసి.

"స్టూపిట్" అని పెద్దగా అరిచాను. ఆవేశంతో ఊగిపోతూ. ఆ తరువాత ఆ సాయంత్రమే సీరియస్‌గా నేను బట్టలు సర్దుకోవటం చూసి ఖంగారుగా "ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగింది మా ఆవిడ.

"కాశీకి".

"కాశీకా. అదేంటి?"

"సన్యాసుల్లో కలవటానికి"

"దానికి అంతదూరం ఎందుకు?" అనుకోకుండా నోటినుంచి వచ్చిన ఆ మాటలకు నొచ్చుకుని -- నాకు మరింత కోపం వస్తుందేమోనని ఖంగారు పడి -- తడబడి "ఇప్పుడు అకస్మాత్తుగా కాశీ ప్రయాణం ఎందుకండీ" అంది.

"పని వుందిలే" అని చెప్పి బయటపడ్డాను.

మూడు రోజుల తర్వాత మా ఆవిడకు ఒక యస్.టి.డి. కొట్టి "నేను కాశీ నుంచి మాట్లాడుతున్నాను. నేను ఒక ముఖ్యవిషయం చెబుతున్నాను. జాగ్రత్తగా విను. కాశీ యాత్రకు వచ్చిన వాళ్ళు ఇష్టమైన వస్తువును దేన్నయినా వదిలేయాలని... మళ్ళీ జీవితంలో దాన్ని ముట్టుకోకూడదని అంటారు కదా. నేను కాశీలో టీవీని వదిలేసాను. మన కుటుంబ సభ్యుల అందరిపేర్లూ చెప్పి వదిలేసాను."

"టి.వి. వదిలేసారా?" ఆవిడ షాక్ తిన్నట్టు తెలుస్తోంది.

"అవును. మాట తప్పితే బెడిసికొడుతుందిట... అరిష్టం."

"ఆ మాట నిజమే గానీ, కూరలూ అవీ వదిలేస్తారు గానీ..టీవీ వదిలేయడం..అదేంటండి?"

"అదంతే" అని ఠపీమని ఫోన్ పెట్టేశాను.

మా ఫ్రెండ్ ఊరి నుంచి బయలుదేరి రెండో రోజు ఇంటికొచ్చేసరికి ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. బుల్లి తెర భూతం వదిలిన ఇల్లులా ఉంది. పిల్లలు చేతుల్లో పుస్తకాలతో కుర్చీలకంటుకొని పోయి కూర్చున్నారు. వంటింట్లో నుంచి ఘుమఘుమల వాసనలు వీధి వరకు వస్తున్నాయి. సౌండ్ రాకుండా మనసులోనే పగలబడి నవ్వుకున్నాను. సెంటిమెంట్‌తో ఎంత క్లిష్టమైన పనినయినా ఎంత అవలీలగా సాధించవచ్చో అనుభవపూర్వకంగా తెలుసుకున్నందుకే ఆ ఆనందం!

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

## ఓ తెనుగుదేశమా

ఓ తెనుగుదేశమా నా అనుగు దేశమా
కదలు నా బంగారు కలల వెలిగే తల్లి

1. ఆకు పచ్చ పొలాలు రేకువిచ్చిన పూలు
ప్రాకుతీయని నదుల నాకు దరిశెనమిచ్చు ॥ఓ తెనుగు॥
2. ఏమి తీయందనము లీగాలి పొరల
త్యాగయ్య పలుకు క్షేత్రయ్య గానము లొలుకు ॥ఓ తెనుగు॥
3. గౌతమీపెన్న తుంగాభద్ర కెరటాలు
వినుచు చక్కని కవిత మనసులూచే నమ్మ ॥ ఓ తెనుగు॥

రచన : కీ॥ శే॥ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
సంగీతం : కీ॥ శే॥ మంచాళ జగన్నాథరావు
- బృందగానం
రాగం : దేశ్ (హిందుస్తాని సంగీతం) తాళం : జంపె (కర్ణాటక సంగీతం)
ఆరోహణ : స రి మ ప ని స -ఝప్‌తాల్: (హిందుస్తాని సంగీతం)
అవరోహణ : స ని[1] ద ప మ గ రి గ ని[2] స

-షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధ మధ్యమం, పంచమం, కాకలి నిషాదం ఆరోహణలోను, కైశికి నిషాదం, చతుశృతి దైవతం, పంచమం, శుద్ధమధ్యమం, అంతర గాంధారం, చతుశృతి రిషభం అవరోహణలోను పలికే స్వరాల.

పైన తెలిపిన రీతిలో యీ స్వరాల సంచారం సాగుతుంది.

ని[1]= కైశికి నిషాదం, ని[2] = కాకలి నిషాదం

హిందుస్తాని సంగీతంలో బాగా ప్రచారానికి నోచుకున్న రాగాలలో దేశ్ కూడా ఒకటి. కర్ణాటక సంగీతంలో యీ మూర్చన గల రాగం లేదు. లలిత సంగీతంలో యీ రాగం దేశంలోని అనేక ప్రాంతీయ భాషా గీతాలలో వాడబడింది. ఆకాశవాణిలోను, చలన చిత్రాలలోను చాలా మంది స్వరకర్తలు యీ రాగాన్ని ఉపయోగించి మధురమైన బాణీలు మనకు అందించారు. బంకిం చంద్ర చటర్జీ రచించిన "వందేమాతరం - సుజలాం సుఫలాం మలయజ శీతలాం" అనే అజరామరమైన బెంగాలీ దేశభక్తి గీతానికి ఎంతో మంది వేర్వేరు బాణీలు కూర్చినా, అర్ధశతాబ్దికి పైగా ప్రాచుర్యాన్ని పొంది మనం సంప్రదాయంగా పాడుకుంటున్న బాణీ దేశ్‌రాగంలో కూర్చబడినదే. అదే బాణీగల యీ గీతం దాదాపు ప్రతి ప్రముఖ సభలోను ప్రార్థనా గీతంగా (దేశమాతస్తుతి గీతంగా) పాడడం మనకు అనుమానంగా వస్తున్న ఆచారం. ఇటీవల కొన్ని సంవత్సరాల క్రితం ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారమైన "బజేసర్‌గమ్‌హర్ తరఫ్ గూంజ్ బన్‌కర్ దేశ్‌రాగ్" అనే దేశభక్తిని ప్రభోదించే గీతం దేశ్‌రాగంలో కూర్చబడినదే. ఇందులో ప్రముఖ హిందుస్తాని, కర్ణాటక సంగీత విద్వాంసులు సర్వశ్రీ భీమ్‌సేన్ జోషి, డాక్టర్ బాలమురళీకృష్ణ, హరిప్రసాద్ చౌరాసియా, ఎస్.బాలచందర్, పండిట్ రవిశంకర్ మున్నగువారి గాత్ర, వాద్య స్వరఝురులు దేశ్‌రాగం యొక్క విశిష్టతను చాటాయి. "సృష్టిలో తీయనది స్నేహమేనోయి" అనే ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి గీతానికి 1949లో హెచ్.ఎం.వి. కంపెనీ వారు నిర్వహించిన "ఉత్తమ గీత రచనల" పోటీలో



ప॥ సా రిప దప | మగ రిగరి | సా రిమగ | రిస ని సా |
ఓ తెనుగు. | దే. శమా. | నా అనుగు | దే. శమా |
; రిమాప నిరిసస | నిద పాప | ; పదాప మగ | రిమగా రిస |
. కదలు నా. . . | బం. గారు | . కలల వెలి | గే. తల్లి. |
॥ ఓ తెనుగు॥

1.చ॥ ; మరిమ పా | నిని సాస | ; రిమాగ సా | రి ని సాస |
. ఆ. కు ప | చ్చ పొలాలు | . రే. కు వి | చ్చి న పూలు |
; పసాని సా | నిసరిస నిదప | ; పసాప పనిదప | మగరిగస |
. ప్రా. కు లో | యి. ని. నదుల | . నా. కు ద. . రి. | శని మి. చ్చ |
॥ ఓ తెనుగు॥

1వ చరణం మాదిరిగానే మిగిలిన చరణాలను పాడాలి.

ని = కైశికి నిషాదం
ని = కాకలి నిషాదం



ప్రథమ బహుమతి లభించింది. ఆ తరువాత ఆ పాటకు దేశ్‌రాగంలో ప్రఖ్యాత స్వరకర్త పెండ్యాల నాగేశ్వరరావు సంగీతం కూర్చి శ్రీమతి రావుబాలసరస్వతి చేత పాడించారు. హెచ్.ఎం.వి. వారు విడుదల చేసిన యీ ప్రైవేటు రికార్డు బాగా పాప్యులర్ అయింది.

అన్నపూర్ణగా పేరుగాంచిన సస్యశ్యామలమైన తెలుగునేల, పవిత్ర గౌతమి పెన్నా, తుంగభద్రాది నదులతో పునీతమై, త్యాగయ్య క్షేత్రయ్యల సంగీత సుధలతో కళకళలాడే తెలుగుతల్లిని ఇంద్రగంటి వారు ఎంతో హృద్యంగా కీర్తించారు. "ఓ తెనుగుదేశమా" అనే యీ గీతంలో మంచాళ జగన్నాథరావు గారి దేశ్‌రాగంలో స్వరపరచిన యీ పాట బృందగానంగా ఆకాశవాణిలో ప్రసారమైనది.

## కీ॥శే॥ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

సుప్రసిద్ధ కవి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు విశాఖ జిల్లా మాడుగుల గ్రామంలో 29 ఆగష్టు 1911 నాడు జన్మించారు. ఉభయ భాషా ప్రవీణ (ఆంధ్రా యూనివర్శిటీ)లో ఉత్తీర్ణులై సంస్కృతాంధ్ర భాషలలో ప్రావీణ్యాన్ని గడించారు. బోధనారంగంలో స్థిరపడి రామచంద్రపురం (తూర్పుగోదావరి జిల్లా) హైస్కూల్లో అధ్యాపకులుగాను, నెల్లూరు జిల్లా కావలి జవహర్ భారత కళాశాలలో ఉపన్యాసకులుగాను పని చేశారు.

పండిత కవియైన శ్రీ శాస్త్రిగారు అనేక పద్యకావ్యాలు, విమర్శన గ్రంథాలు, పాటలు వ్రాశారు. వారి రచనల్లో "కీర్తి తోరణం" అనే పద్య కావ్యానికి, "కాళిదాసకళామందిరం" అనే విమర్శనాగ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పురస్కారాలు లభించాయి.



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి గౌరవ సభ్యత్వం, కావలి కళాశాల నిర్వాహక మండలి సభ్యత్వం, భారత ప్రభుత్వ సాంస్కృతి శాఖ, పరిశోధక ప్రణాళిక సీనియర్ ఫెలోషిప్ వంటి పదవులు ఆయనను వరించాయి.

ఆకాశవాణిలో ఇంద్రగంటి వారి గీతాలు ఎన్నో ప్రసారమైనాయి.

1947లో ప్రథమ స్వాతంత్ర దినోత్సవాన్ని పురస్కరించుకుని శాస్త్రిగారు రచించిన

"పూలదోసిళ్ళెత్తరా మన పుణ్యవీరుల పాడరా
- భారతము స్వేచ్ఛావరమ్మును
బడసినట్టి దినమ్మురా" అనే పాటను ఆకాశవాణి మద్రాసు కేంద్రం ప్రసారం చేసింది. ఆ తరువాత 1950 ప్రాంతంలో "హేమమాలి" అనే నాటకం ద్వారా ఇంద్రగంటి వారి "సృష్టిలో తీయనది స్నేహమే నోయి" గీతాన్ని శ్రీమతి రావుబాలసరస్వతి గానం చేయగా మద్రాసు కేంద్రం ప్రసారం చేసింది. ఇదే పాటను పెండ్యాల

సంగీత నిర్వహణలో బాల సరస్వతి గానం చేయగా, హెచ్.ఎం.వి. కంపెనీ వారు రికార్డుగా వెలయించారు. శాస్త్రిగారు రచించిన ప్రసిద్ధ గేయాలలో

"నాదు జన్మభూమికంటె నాకమెక్కడుంది సురలోకమెక్కడుంది"

"ఏ పూవు పూచినా ఏ పాట పాడినా - ఎందుకోయీ హృదయమింత కళవళపడును"

"చక్కని చుక్కల నఖ్యము మరగిన చందమామ రావోయి", "భరత మాతా నీ స్వప్న లోకములు ఫలియించినవోయి" వంటివి మచ్చుకు కొన్ని. వక్కలంక సరళ, ఎ.పి.కోమల మొదలుగా పలువురు గాయనీగాయకులు ఆ గేయాలను గానం చేశారు. సుప్రసిద్ధ స్వరకర్తలెందరూ వీరి గీతాలను స్వరపరిచారు.

చక్కని కవిగా, సునిశిత విమర్శకుడుగా, గొప్ప భావుకుడుగా హనుమచ్ఛాస్త్రి గారు ఆధునికాంధ్ర కవులలో విశిష్టమైన స్థానాన్ని పొందారు.



## దేశ్‌రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు



### తెలుగు

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | అలిగిన వేళనే చూడాలి | గుండమ్మ కథ | పి.సుశీల | ఘంటసాల |
| 2. | మురళీధరా హరే మోహన కృష్ణా | భలేరాముడు | పి.లీల | ఎస్.రాజేశ్వరరావు |
| 3. | వేణు గానలోలుని గన వేయికనులు చాలవులే | రెండు కుటుంబాల కథ | పి.సుశీల | ఘంటసాల |
| 4. | సృష్టిలో తీయనిది స్నేహమేనోయి | ప్రైవేటు రికార్డు | రావుబాలసరస్వతి | పెండ్యాల |
| 5. | ఊపరే ఊపరే ఉయ్యాల | ప్రైవేటు రికార్డు | ఎస్.వరలక్ష్మి | డా॥ బాలమురళీకృష్ణ |

## హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలు

**1937**

టాకీ శకంలో పాటల్లేని మొట్టమొదటి సినిమా 'నౌజవాన్' విడుదలయింది. మాస్టర్ మొహమ్మద్ నేపథ్య సంగీతం మాత్రం ఇచ్చారు.

మూకీ శకంలో(1931 నుండి 1931 వరకు) 1300 సైలెంట్ సినిమాలు తయారయ్యాయి. ఆ సినిమాలు ప్రదర్శించేటప్పుడు తబలా, హార్మోనియం వాయించేవారు. 1929లో'ఎ త్రో ఆఫ్ డైస్' సినిమాకై హిమాంశురాయ్ సౌండ్ ఎఫెక్టులు రికార్డు చేసి సినిమాతోబాటు ప్లే చేసే



'ఆలం అరా'(1931)లో ఓ దృశ్యం

పద్ధతి మొదలుపెట్టారు. 1931లో మొదటి టాకీ'ఆలం అరా' వచ్చింది. ఫిరోజ్‌షామిస్త్రీ బి.ఇరానీ సంగీతం ఇచ్చారు. తొలి గాయకుడు వజీర్ మొహమ్మద్ ఖాన్. తొలిసారిగా రికార్డయిన హిందీ పాట 'దే దే ఖుదా కే నామ్ పే ప్యారే' తొలి గాయని గౌరవం జుబేదాకు దక్కింది. ఈ సినిమా రికార్డులు విడుదల కాలేదు. 1932లో 69 పాటలతో 'ఇంద్రసభ' రిలీజ్‌కాగా ఐదేళ్ళ తర్వాత అస్సలు పాటల్లేకుండా సినిమా తీయడం సాహసమే కదూ!

**1938**

స్టార్ - సింగర్ మీనాక్షి శిరోద్కర్ 'బ్రహ్మచారి' సినిమా ద్వారా సినిమా రంగంలోకి అడుగు పెట్టారు. నేటి శిల్పా శిరోద్కర్, నమ్రతా శిరోద్కర్ ఈమె మనుమరాళ్లే.



'బ్రహ్మచారి'లో మాస్టర్ వినాయక్,మీనాక్షి

గాయని జోహ్రా బాయి అంబాలే వాలీ సినీ ప్రవేశం - 'గ్రామఫోన్ సింగర్' సినిమా ద్వారా.

**1939**

వి.శాంతారాం తీసిన "ఆద్మీ" సినిమాకై శాంతా హుబ్లీకర్ ఒక పాటను(హిందీలో 'అబ్ కిస్‌లియే కల్‌కి బాత్') ఏడు భాషల్లో (ప్రతీ పాటకు వేర్వేరు గీత రచయితలు, వేర్వేరు సంగీత దర్శకులు) పాడింది.




కవి ప్రదీప్ సినిమారంగ ప్రవేశం. చిత్రం "కంగన్"తో. ఇటీవల ఈయనకు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు వచ్చింది.



ప్రదీప్

సంగీత దర్శకుడు ఖేమ్‌చంద్‌ప్రకాశ్ ప్రవేశం -"ఘాజీ సలావుద్దీన్"తో.

**1940**

నౌషద్ అలీ కంపోజర్‌గా ప్రవేశం -"ప్రేమ్‌నగర్"తో



నౌషద్

**1941**

నౌషద్ రికార్డు చేసిన మొదటిపాట వున్న చిత్రం కంగన్ రిలీజయింది - "బతా దో కోయీ కౌన్ గలీ మోరే శ్యామ్". పాడినది, తెరపై ఆడినది లీలా చిట్నీస్.



లీలా చిట్నీస్

డాక్టర్ సినిమాతో పంకజ్ మల్లిక్ పేరు మారుమ్రోగింది. నటుడిగా, గాయకుడిగా, కంపోజర్‌గా ఆయనకు అన్ని విధాలా పేరు తెచ్చిపెట్టింది. 36 సం॥ల తర్వాత అదే కథను శక్తి సామంత "ఆనంద్ ఆశ్రమ్" పేర ఉత్తమ్ కుమార్‌తో తిరిగి నిర్మించారు.



పంకజ్ మల్లిక్

ఈ సంవత్సరంలో రిలీజయిన "ఖజాంచీ" గొప్ప మ్యూజికల్‌హిట్. షంషాద్‌బేగమ్ గొప్ప స్టార్ అయిపోయింది.



షంషాద్‌బేగమ్

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన శైలిలో
తెలిపే




# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల

# పదాల్లో పరభాషా విన్యాసాలు

కవిత్వం శబ్దవిద్య. శబ్దం మీద అధికారం సాధించిన కవికి, పదాన్ని కదం త్రొక్కించగల కవికి, ఛందస్సుల గుర్రాల మీద స్వారీ చేయగల కవికి భాష అడ్డుపడదు.. సరిగదా సహకరిస్తుంది. ప్రతిభావంతుడైన కవి సాధించలేని దేముంటుంది? జుట్టంటూ వుండాలి గానీ కొప్పెటుపెట్టినా అందంగానే వుంటుంది కదా! కవులు తమ బహుభాషా పరిజ్ఞానాన్ని ప్రదర్శిస్తూ చెప్పిన పద్యాలు కొన్ని మీకు పరిచయం చేస్తాను. వాటిలోని గడుసుదనాన్ని, చమత్కారాన్ని గమనించండి. అల్లసాని పెద్దన ఉర్దూ భాషతో చెప్పిన యీ చాటువు చూడండి.

**సమరక్షోణిని కృష్ణరాయల భుజాశాలతాసి చే బద్ధదు**
**ర్దమదోర్దండ పుళింద కోట యవన వ్రాతంబు సప్తాశ్వ మా**
**ర్గమునన్ గాంచి "సెబాసహో హరిహరంగా ఖూబు ఘోడాకితే**
**తుముకీ బాయిల బాయిదే ములికి" యందుర్మింటికిన్ బోవుచున్!!**

రాయల కాలంలోనే ఓ సాహెబు కవి గారు ఓ పల్లెటూరిలో వుండవలసి వచ్చి నానా కష్టాలూ పడ్డాడుట! ఆయన నోటి వెంట వచ్చిన యీ భుజంగ ప్రయాత వృత్తాన్ని చూడండి:-

**ఫలం లేదు మజ్కూర్ కలం బందు హల్‌సాల్**
**అలం మోదు గాకుల్ క్వచిత్ టేకుమాకుల్**
**అవుర్ కోయకొంపల్ మరీమాల కొంపల్**
**హేయే ముండ్ల కంపల్ హమారే గ్రహారే!!**

ఈ పద్యాన్ని చూస్తే - కష్టం దాని భాషని అది వెదుక్కుంటుంది కాబోలు అనిపిస్తుంది. ఒకసారి బాసర క్షేత్రంలో నా అధ్యక్షతన జరిగిన శతావధాని శ్యామలానంద ప్రసాద్ గారి అష్టావధాన కార్యక్రమంలో ఒకామె "కౌను బనేగా కరోడుపతి" ఉపయోగించి గాయత్రీ దేవి మీద శ్లోకం చెప్పమనగానే ఆయన:-




**లాక్షాం కౌ నుత రూపా**
**దక్షా దీనావలంబనే గాయత్రీ చరణౌ తవ**
**వందేహం హే మాతః దిన కరోడుపతి నేత్రే!!**

అంటూ ఓ అద్భుతమైన శ్లోకం చెప్పి సభను రంజింపజేశారు. ఇక్కడ దినకర+ఉడుపతి అని విడదీసి చూడాలి. (దినకర = సూర్యుడు; ఉడుపతి = చంద్రుడు) అంటే సూర్యచంద్రులు కన్నులుగా గల ఓ తల్లీ! అని అర్థం.

ఉర్దూ బాగా మాట్లాడే బ్రాహ్మడొకడు పదిహేనురోజుల తర్వాత సంధ్యావందనం చేసుకోటానికి కూర్చుని "పంద్రా యామ్ కా సంధ్యా వందన్ ఏక్ దమ్ కరిష్యే" అన్నాడట!

సంస్కృతాంధ్రాలతో కవ్వించే యీ చమత్కారాలు చూడండి:-

**"అన్నం కళపళాయతే, చిటపటాయతే మిమ్ములను సాయంకాలే చూడగలను. కానీ తస్మిన్ సమయే స్కూలు ఆవరణే బాలాః ఫుట్‌బాల్ క్రీడయంతి" అంటూ ఒక సంస్కృత భాషాభిమాని తన పాండిత్యాన్ని ప్రదర్శిస్తే మరో మేధావి-**

**క్షుధాతురాణాం న ఉడికిర్న ఉడకః**
**అర్థాతురాణాం న చెల్లిర్న చెల్లకః**
**నిద్రాతురాణం న మెట్టర్న పల్లః**
**కామా తురాణాం న ముసలి ర్న పిల్లః!!**

అంటూ "క్షుధాతురాణాం న రుచిఃన పక్వమ్" అనే సుప్రసిద్ధ సంస్కృత శ్లోకానికి ప్యారేడీ రాశాడు. ఇలాటి బాపతువాడే మరో కవి తన దరిద్ర వాతావరణానికి వొళ్లు మండిపోయి-

**తిండికైతే పదిమంది వసంతి**
**తండులాలు గృహమందు నసంతి**

కుండ బొచ్చెలు పరం విలసంతి

రండ నా కొడుకువెల్ల హసంతి!!

అంటూ వాపోయాడు. మల్లినాథ సూరి సోదరుడైన పెద్దిభట్టు గొప్ప పండిత కవి. కానీ చాలా పేదవాడు. ఒకసారి ఆయన చిరిగిన పంచతో, వంకర చేతి కర్రతో సింగభూపాలుణ్ని సహాయం కోరదామని వెళ్తుంటే - ఎవరో ఎదురుపడి "రాజుని చూడటానికి వెళ్లేటప్పుడు ఏమిటండీ యీ వేషం?" అని అడిగారట. వెంటనే ఆయన:-

**కిం వాససా చీకిరి బాకిరేణ**
**కిం దారుణా వంకర టింకరేణ**
**శ్రీ సింగభూపాల విలోక నార్థం**
**వైదుష్య మేకం విదుషాం సహాయః!!**

అని జవాబు చెప్పారట. రాజుని చూడటానికి పాండిత్యం ఒక్కటే చాలునని భావం.

ఇంక, ఆంధ్రాంగ్ల భాషా నవేమ్మేళనంతో పుట్టిన కొన్ని చమత్కారాలు చూడండి:- మృత్యుంజయ శతకం వంటి అపూర్వ రచనలందించిన మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి గారు మనకు గల మహా కవుల్లో ఒకరు. ఆయన -

**కనులంజూడదు భార్యయేనియును**
**నీకాల స్థితింబట్టి జ**
**ర్మను తైలమ్ము జపాను సబ్బమెరికా**
**క్రాపున్ వియన్నాసులో**
**చనముల్ స్వీడను చేతి బెత్తమును**
**స్విడ్జర్లాండు రిస్ట్ వాచి ఫా**
**రెను డ్రెస్ ఫ్రెంచి కటింగు మీసలును ఫారిన్ ఫ్యాషనే లేనిచోన్!!**

అంటూ ఆధునిక భూగోళ మనిషికి రూపు దిద్దారు. మానవుడే యిలా వుంటే వాడి భాషని గురించి వేరే చెప్పాలా? తల దిమ్మెక్కిపోదూ! అలా దిమ్మెక్కిన వాడెవడో - "The sky is మబ్బీ! The rood is దుమ్మీ, My mind is దిమ్మీ" అన్నాట్ట! ఈ రకం కుర్రకారుని ఎవరు మీరని ఓ పెద్ద మనిషి అడిగితే "ఇస్పేటు జాకీలం. ఎగేసిన బాకీలం. మృత్యు సినిమాలలో టాకీలం. భగవంతుని టోపీలం. కవిత్రయపు కాపీలం -" అని గోలచేస్తూ వెళ్లి పోయారట! వాళ్ల క్వాలిఫికేషన్స్‌కి శిరసొంచి దణ్నం పెట్టటం తప్ప మనం మాత్రం ఏం చేయగలం?!?




ఇలపావులూరి సుబ్బారావు గారు ఇన్సూరెన్స్ కంపెనీ మీద ఇంగ్లీషుతో తెలుగు పద్యాలు చెప్పి అభినందించారు. ఆ పద్యాల్లో రెండు పద్యాలు మీ ముందుంచుతున్నాను. చూడండి:-

**ఇన్సూరు లేని లైఫును**
**సెన్సార్ కానట్టి ఫిల్ము సీక్రెట్ ట్రూతున్**
**వైన్సర్వు కాని ఫీస్టును**
**విన్సే లేనట్టి టీము వేస్టుర బ్రదరూ!**

**లైఫన నౌవెడే ససలు రైటని చెప్పగలేము బెడ్డులో**
**నైఫును బోలెడెత్తు ప్రతి నైటును డేయును ఫాలొయవ్వగా**
**వైఫును సన్సు డాటరుల ప్రాపరు రక్షణ నిల్లు దేరు ఫోర్**
**లైఫుకు ఇన్సురెన్సు బహుళంబుగ ప్రాంప్టు ప్రొటెక్షనిచ్చెడిన్!!**

సుబ్బారావు గారి కంటె రెండాకులెక్కువ చదివిన విశ్వనాథ కవిరాజు గారు 1945లోనే ఆనందవాణి పత్రికలో రామాయణ విషయాన్ని ఆంగ్ల పదాలతో ఉత్పలమాల పద్యంగా రాశారు. ఆ చమత్కార విన్యాసాన్ని చూడండి:-

**రామ ది కింగ్సు సన్ను వితు లక్ష్మణ ఎండ్ వితుసీత క్రాస్డు దీ**
**ఫేమసు దండకాసు బిగు ఫీల్డుసు మోస్టు లెబోరియస్లి దెన్**
**కేము విరాధ విత్తు హిజుక్రూయలు వర్డ్సు - బివేరు ఫూల్సు నో**
**టైము టు లూ జయాము వెరిటైర్డయి వాంట్సయి బ్రేకు ఫాస్టు సూన్**

ఈ పద్యాన్ని యింగ్లీషులో రాసుకుని చదివితే త్వరగా అర్థమవుతుంది. కానీ అది పద్యం కాదు. ప్రయత్నించండి.

ఆచార్య ఎస్వీ జోగారావు గారు తమ 'అపూర్వ కాకలి' కావ్యంలో సమాజాన్ని చాలా ఆటలు పట్టించారు.

ఈ సందర్భానికి యీ పద్యం చూడండి.

**బోర్డు కట్టె "టు లె"ట్టని బోడిదొకతె**
**ఎంత అద్దెయడుగునొ మీ కెరుక గలదె?**
**ఇంటినే గా దదొంటిని నీయగలదు**
**రెంటికిని బేరమాడుకో రేటు తగ్గు!!**

ఇలాంటి ఉపాయాలిలాంటి గురువులే చెప్పగలరు. ఆ రసికతే వేరు. మాతృభాషని మర్చిపోకుండా ఎన్ని భాషలతో బేరమాడుకుంటేనేం? సరదాలు వేరు భేషజాలు వేరు. అవసరాలు వేరు కదా!




**జరిగిన కథ**

అజయ్ అనే శ్రీమంతుడికి విజయ్ అనే నిరుద్యోగి తారసిల్లుతాడు. విజయ్‌కి తల్లిలేదు, తండ్రి అప్పలు చేసాడు, చెల్లెలి కాపురం చిక్కుల్లోపడింది. డబ్బుంటేఉండే కష్టాలగురించి అజయ్ చెప్తాడు. అతనికి బాల్యం లోనే తల్లిపోయింది. మేనత్త సాకింది. చదువుకై విదేశాలు వెళ్లినపుడు తండ్రిపోయాడని తెలిసితిరిగివచ్చాడు. ఎస్టేట్ మానేజర్ భానోజీయే పెత్తనం చలాయిస్తున్నాడు.... పైగా ఎవరు విషం పెడ్తారోనని, ఎవరేమిచ్చినా తినొద్దని మేనత్త చెబుతుంది. ఇలా ఒకరి కథలు ఇంకొకరు చెప్పుకున్నాక, ఒక సంవత్సరంపాటు ఇద్దరూ తమ తమ స్థానాలను మార్చుకుని, పరిస్థితులను ఎదుర్కొనాలని నిశ్చయించుకుంటారు...

(ఇక చదవండి)



# అన్నపూర్ణావారి ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నవల 4

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

'గృహప్రవేశ మహోత్సవాల సమస్య త్వరగానే తేలిపోయింది. అజయ్‌బాబు ప్రతిరాత్రి ఇల్లుచేరే పద్ధతి ఒకటే... ఒళ్లు తెలిసీ తెలియని స్థితిలో కారు అతన్ని కాంపౌండ్‌లోకి తెస్తుంది. హారన్ వినగానే, ఈ మధు సేవకుడిని, ఆ యింటి సేవకులు జాగ్రత్తగా ఇంట్లోకి తీసుకెళ్లి పక్కమీద పడుకోబెడతారు. అజయ్ అవతారమెత్తిన విజయ్ కూడా ఇంచుమించు అదే పద్ధతి అవలంబించాడు, మిత్రుడి సలహాపై. అజయ్ దగ్గరుండి తన ఇంటి కాంపౌండు గేటుదాకా తీసుకువచ్చాడు. తను దిగి కారును లోనికి సాగనంపాడు. పథకం ప్రకారం, విజయ్‌కుమార్ కారును పోర్టికో ఇవతల ఆపి, డాష్‌బోర్డుపక్క అరలోంచి బ్రాందీకాయ తీశాడు. మూతతీసి వాసన చూడబోయాడు. వెలపరం వచ్చింది. కళ్లూ, ముక్కూ మూసుకుని ఓ పురిషెడు చేతిలో ఒంపుకుని ఊపిరి బిగబట్టి మూతికీ, కోటుకీ, భుజాలకీ పూసుకున్నాడు, సీసామూత బిగించిపడేశాడు. అటూ ఇటూ చూసి, జుట్టురేపుకుని, సై అనుకుని, స్టీరింగ్ మీద హారన్ బొయ్‌మనేలా పడి అలాగే పడుకున్నాడు. అరనిముషంలో, ఆ హారన్ మోత భవంతిలో సంచలనం రేపింది. నౌకర్లు నలుగురు ఆదరా బాదరా వచ్చారు. రివాజు ప్రకారం 'అజయ్'ని మోసుకుని లోపలకు తీసుకొనివెళ్లి, అతని గదిలో పరుపుమీద పడుకోబెట్టి తలుపుమూసి వెళ్లారు. వారు వెళ్లగానే విజయ్ మంచంమీంచి దూకి, తలుపు లోపలివేపు గడియపెట్టాడు. బ్రాంది కంపుకొడుతున్న బట్టలు విప్పిపారేశాడు పక్కమీద పడుకున్నాడు. కాని, అది సరిపడలేదు. అలవాటులేని ప్రాణానికి హఠాత్తుగా అంతసుఖం అయితే ఎలా? సుఖం కూడా దుఃఖంలాగే దుర్భరం అవుతుందా?... ఒక రొజాయిలాటిది తీసి కిందపడేసి దానిమీద పడుకున్నాడు. ఇంకో నిముషంలో అతనికి నిద్రపట్టేసింది...





×---×---×

విజయ్‌కుమార్ జీవితాన్ని ధరించిన అజయ్‌బాబు పని, అంతసులువుగా తెమిలేదికాదు. కారు లోపలికి వెళ్తూండగా, అతనికేసి చూస్తూ పరాకున గేటుదాటి లోపలికి అడుగుపెట్టాడు. 'కోన్‌హై బాహర్ జావ్' అంటూ గూర్ఖా గసరడంతో వెనక్కి తగ్గాడు. విజయ్‌కుమార్ నిరుపేద జీవితంవేపు, కొత్త అనుభవాలవేపు, తాను ఎంతో ఆశతో ఎదురుచూస్తున్న అనుభూతుల వేపు, తనకు లభించబోయే చెల్లెలువేపు, ఆయింటి ఆపేక్షలవేపు నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ, ఆలోచించుకుంటూ సాగిపోయాడు అజయ్‌బాబు. విజయ్ ఇచ్చిన చిరునామా సులువుగానే తెలిసింది. ఊరు సద్దుమణిగినా, ఆ వీధిమాత్రం చాలా సందడిగా కనబడింది. వీధిమధ్య రామమందిరం ఉంది. మండపంలో భక్తులు చాలమంది కూర్చుని, ఆ వైకుంఠవాసుడికి వినపడాలన్న ఉత్సాహంతో శాయశక్తులా గొంతెత్తి పాడుతున్నాడు.

అజయ్ ఒక క్షణంసేపు ఆగి ఆ భక్త బృందాన్ని చూస్తూ నిలబడ్డాడు. ఎంత నిశ్చితంగా, ఎంతటి తన్మయానందంతో పాడుకొంటున్నారు! విజయ్‌కుమార్ చెప్పింది నిజమైతే, వీళ్లంతా ఈదురోమని ఏ మూలో



పడుండాలి. కాని మరి ఇంత ఆనందంగా ఉన్నారే...

'శ్రీరామ నీ నామ మెంత రుచిరా - ఎంత రుచిరా' అని పాడుతున్నారు భక్తులు.

రామనామామృతం రుచి అజయ్‌కి బాగా తెలీదు. చిన్నప్పుడు అత్తయ్య వళ్లో కూర్చుని కథలు విన్నపుడు, పాడినపుడు తెలుసేమో కాని, గుర్తులేదు. ఇపుడు రుచి బాగా తెలిసిన 'అమృతం' ఒకటే వుంది. అది పుచ్చుకుంటే తనకీ ఆనందంతో ఒళ్లు తెలీదు. క్లబ్బుల్లో అందరికీ అంతే, మరి క్లబ్బులో అమృతం తాగి ఆనందంగా వున్నవాళ్ల ఇంట్లో చీకూ, చింతా లేవట్లేనా? కాదు అవి వుండబట్టే ఈ దారిబట్టారు. అయితే, ఈ భక్తులూ అంతే అయివుండాలి. జీవితంలో చీకూ చింతా మరిచిపోవడానికి ఈ రామనామామృతం సేవిస్తున్నారు. 'దేవుడు' అనే భావాన్ని మొట్టమొదట కనిపెట్టినవాడెవడో గొప్పవాడు. గొప్పేమిటి వాడే దేవుడయుండాలి... ఇలా దిగుల్లోవున్నవాళ్లకి ఈ భక్తిసుధ మప్పి... అజయ్‌కి ఎందుకో చిరాకేసింది. తన ఆలోచనల ధోరణి, తను సామ్యాలు ఊహించిన పద్ధతీ నచ్చలేదు. అతను దేవుడిగురించి, ఈ మధ్య ఎన్నడూ తీరిగ్గా ఆలోచించలేదు, పట్టించుకోలేదు. ఇవాళ అనవసరంగా ఇలాటి ఆలోచన వచ్చింది. తను ప్రవేశిస్తున్నది - దేవుడిని నమ్ముకొని, ఆ నమ్మకం చుట్టూరావుండే



పాపపుణ్యాలనూ, నీతి నియమాలనూ, భక్తి విశ్వాసాలనూ, అనురాగాలనూ మేళవించుకుని, అవే డబ్బుకన్నా మిన్నగా మన్నించుకొని జీవితాలు సాగించే ప్రపంచంలోకి. తను వాటి నన్నిటినీ శిరసా వహించకపోతే, కనీసం తిరస్కరించకుండా వుండాలి... అజయ్‌బాబు తన ఆలోచనలకు ఆనకట్టవేసి, భజనకేసి చూస్తూ నిలబడ్డాడు.



**శ్రీరామ నీ నామ మెంతో రుచిరా!**
**ఓ రామ నీ నామ మెంతో రుచిరా!**
**ఎంతో రుచి - ఎంతో రుచి**
**ఎంతో రుచిరా ॥శ్రీరామ॥**
**పాలు మీగడలకన్న**
**పంచదార చిలకల కన్న ॥శ్రీరామ॥**
**తప్పులు చేయుట మావంతు**
**దండన పొందుట మావంతు**
**తప్పులు చేయుట మావంతు**
**యమదండన పొందుట మావంతు**
**పాపం చేయుట మావంతు-దయ చూపించడమే నీవంతు ॥శ్రీరామ॥**
**రాతినే యిల నాతిగమార్చి - కోతికే పలు నీతులు నేర్పి**
**మహిమలెన్నో చూపిన దేవా - మము బ్రోవ రాలేవా ॥శ్రీరామ॥**



కొంతసేపు పాటవిన్నాక, తనకు కావలసిన ఇల్లు సంగతి గుర్తుకొచ్చింది. వెదకబోయాడు అజయ్. నలభైమూడో నంబరు అని చెప్పాడు విజయ్‌కుమార్. ఇల్లు కనబడింది దగ్గిరే. మండపానికి దాదాపు ఎదురుగా ఉంది. పెంకుటిల్లు. హైక్లాసు హోటల్లో కాటేజిలా వుంది...

ఓసారి అటూయిటూ చూసి తలుపు నెమ్మదిగా తోశాడు. ఓరగా వేసి ఉంది కాబోలు, తెరచుకుంది. లోపల్నుంచి ఓ పడుచు పళ్లెంలో ప్రసాదం కాబోలు పట్టుకు వస్తోంది. ఎవరో ఊహించబోయే లోగానే 'అన్నయ్యా! అన్నయ్యా! వచ్చావా?' అంటూ దగ్గిరకు వచ్చింది. 'మూడు రోజుల్నుంచి కనిపించకపోతే, నేనూ, నాన్న ఎంత కంగారు పడ్డామనుకున్నావ్?' అంది.



అజయ్ ఆమెను పరీక్షగా చూశాడు తలవంచుకునే. ఈమె తన చెల్లెలన్నమాట. ఆ కంఠంలో ఎంత ఆప్యాయత తొణికిస లాడుతోంది! అజయ్‌కి ప్రాణం లేచొచ్చింది. ఇలా అన్నయ్యా అని పిలిపించుకునే అదృష్టానికి ఎంతటి సంపదలైనా ఒడ్డవచ్చు...



'ఈ మాత్రానికే కంగారెందుకు మీనా. వచ్చేశాగా'' అన్నాడు తలవంచుకునే.

భజన మంటపంలో భక్తకోటి ముక్తకంఠంతో, "శ్రీ మద్రమారమణ గోవిందో హరి'' అంటూంది.

'అదిగో భజన అయిపోయింది. ఈ ప్రసాదం తీసుకెళ్లి నాన్నకియ్యి'' అంది చెల్లెలు, పళ్లెం అందిస్తూ.

తప్పించుకొంది కేం చెప్పాలో తోచక, పళ్లెంఅందుకొని వీధిలోకి వచ్చాడు. కాని, అజయ్‌కి పెద్ద సమస్య పట్టుకొంది - మంటపంలోని మహానుభావులందరిలో విజయ్ తండ్రిని ఎలా గుర్తుపట్టటం? మంటపానికి కొంచెం దూరంలో నీడలా నిలిచి, అందరినీ పరిశీలనగా చూశాడు. అందరికీ నామాలున్నాయి. అంతా నడివయసువాళ్లే, దమయంతీ స్వయంవరంలా వుంది వరస.

"అమ్మాయ్ మీనా ఏదీ ప్రసాదం. అబ్బ అబ్బ. ఈ ఆడవాళ్లు...'' అంటూ ఒక పెద్దాయన, పంచె పైకితీసుకుని మంటపం దిగి ఇంటివేపు వెళ్లాడు.

'అమ్మాయ్ మీనా' అన్నంత మాత్రాన, తండ్రి అని తేల్చుకోవడం తప్పేమో: మావయ్యో, తాతయ్యో కావచ్చు...

'అదేమిటి నాన్నా అన్నయ్యకిచ్చి పంపించాగా' అంది మీనా వీధిగుమ్మంలో నిల్చుని.

అజయ్ ప్రాణం తెరిపిన పడింది. 'నాన్నా ఇదిగో' అంటూ నీడలోంచి ముందుకు అడుగేశాడు.

'వచ్చావ్వూ...' అంటూ పళ్లెం అందుకుని ఒక భక్తుడికి అందించి నైవేద్యం కానియ్యండని పురమాయించి, కొడుకువంక తిరిగాడు రామదాసుగారు.

'ఏరా ఇప్పటికిల్లు గుర్తుకొచ్చిందా? ఏదో సామెత చెప్పినట్టు మూడ్రోజుల్నించి ఊరంతా బలాదూరు తిరిగి ప్రసాదం వేళకు తయారయ్యావా' అన్నాడాయన.



'ఏదో ఉద్యోగం ఉంటేనూ...'

'ఉందా?'

'లేదు' అన్నాడు అజయ్ తలవంచుకుని.

'ఆ రాములవారి దయలేందే... అంతేమరి. ఉఁ ఇంద. భక్తి ఎల్లాగూ లేదు ప్రసాదమయినా అఘోరించు' అంటూ రెండు కొబ్బరి ముక్కలూ, రెండు అరటిపండు ముక్కలూ దోసిట్లో ఎత్తిపడేసి మండపంవేపు వెళ్లాడు రామదాసుగారు.



అజయ్ అవి అందుకుని, 'తండ్రి' కేసి చూశాడు.

అంతలోనే ఆయన ఏమనుకున్నాడో గిరుక్కున వెనుతిరిగివచ్చి 'ఈ మూడు రోజుల్లోనూ ఎక్కడన్నా ఇంత తిండి తిన్నావా?' అన్నాడు గదమాయిస్తున్నట్టు.

నిండైన, హుందాగావున్న ఆ ఆపేక్ష, ఆ స్వరం... అజయ్‌కి ఒళ్లు పులకరించింది.

'లేదు నాన్నా' అన్నాడు గోముగా. నాన్నా అన్నమాట నొక్కి అన్నాడు. మనసారా అన్నాడు.

'ఊఁ, ఇంద' అంటూ 'నాన్నగారు' పట్టెడు ప్రసాదం తీసి కొడుకు చేతిలో పెట్టారు.

'దేవుడి ప్రసాదం కళ్లకద్దుకు మరీ అఘోరించు' అంటూ మంటపంకేసి వెళ్లిపోయాడాయన హడావుడిగా.

అజయ్ గుండె ఝల్లుమంది. ఇలాటి వాత్సల్యం తాను ఎన్నడూ రుచిచూడలేదు. ఈ అనుభూతిని ఇలాగే శాశ్వతంగా తన హృదయంలో పదిలపరచుకోవాలి...

కాని, రాత్రి 'తన గది'లో కుక్కిమంచం మీద రాయిలాటి పరుపుమీద మేను వాల్చినప్పుడు, మధురానుభూతి కలగలేదు. లేచి కూర్చున్నాడు. ఏమీ పాలుపోలేదు. తిరిగి పడుకున్నాడు. లేచాడు. పడుకున్నాడు. నల్లులు చురచుర కుట్టేస్తున్నాయి... విజయ్ ఏం చేస్తున్నాడో... పెద్ద ఎలక వచ్చింది గదిలోకి. అప్పుడే కిందికి దిగిన అజయ్ కెవ్వుమని. పైకెగిరి కూర్చున్నాడు. కొత్త ముఖంలా వుందే అన్నట్టు ఓ చూపుచూసి వెళ్లిపోయింది ఎలక.



రాత్రి జరిగిన కథ బొత్తిగా ఎరగని సూర్యుడు రివాజైన మొహంతోనే మేలుకుని, అందరినీ లేపి పలకరించాడు. బంగళామేడమీద గదిలో పడుకున్న విజయ్‌కుమార్‌కి, సూర్యోదయం ఇంత అర్జెంటుగా వచ్చిపడడం నచ్చలేదు. ఎవరో తలుపుకొట్టేస్తున్నారు.

అజయ్‌బాబు పెందరాళే లేస్తాడుగాబోలు... తనేం చెయ్యాలో, ఎలా మెలగాలో తేల్చుకోందే, తనూ హడావుడిగాలేచి కొత్త జీవితానికి తలుపులు తెరవడం ఎలా? అజయ్‌బాబుని మరికొన్ని వివరాలు కనుక్కోవలసింది... విజయ్‌కుమార్ తలుపు చప్పుడు భరించలేక లేచి, కింద వేసుకున్న రొజాయి తిరిగి పరుపుమీదవేసి, పక్కసర్దాడు. నైట్ గౌను తొడుక్కున్నాడు. ఏమీ ఎరగనట్టు, ముఖాని కింత గొప్పవాళ్ల బద్ధకం, మార్నింగు చిరాకు పులుముకుని, వెళ్లి తలుపు తీశాడు. నౌకరు కాఫీట్రే అమర్చిన బండి తోసుకుని లోపలికి వచ్చాడు. విజయ్‌కి ప్రాణం లేచొచ్చింది. మూడు రోజుల ఆకలి ఆవలించి మేలు కుంది. బల్లమీద ఫలహారాలతో కలియబడ బోయాడు. నౌకరు వెంకన్న అదిరిపడ్డాడు. చేతిలోది లాక్కుని బల్లమీద ఉంచి, సిగరెట్టు టిన్ను అందించాడు. పరగడుపున ధూమపాన మేమిటని ధుమధుమలాడుతూ, టిన్ను ఓ పక్కన పడేశాడు విజయ్. మళ్లీ టిఫిను అందుకోబోయాడు. వెంకన్నకు కోపం వచ్చింది. చిన్నబాబుగారివాళేదో కొత్తగా ఉన్నారని అతను తికమక పడ్డాడు. పేపర్ అందివ్వబోయాడు. విజయ్ అది విసిరికొట్టాడు.



అజయ్ అలవాట్లేమిటో తను కనుక్కోలేదు. ఇప్పుడు వీడితో ఏం మాట్లాడితే ఏం పేచీయో తెలీదు. 'అదలాపడేసి నువ్వెళ్లు' అని గసిరాడు విజయ్.

వెంకన్న ఉలికిపడి, చినబాబుగారికేసి అదోలా చూసి, తలవంచుకుని నెమ్మదిగా బయటకు వెళ్లిపోయాడు.

విజయ్‌కుమార్ పాత్ర భరిస్తున్న అజయ్ పరిస్థితికూడా ఇంచుమించు ఇలాగేవుంది. కొత్త జీవితంలో తొలి ఇంటర్వ్యూ అతనికీ అద్భుతంగా సాగలేదు.

చెల్లెలు మీనా తలుపుతట్టి 'అన్నా' అంది. పిలుపు లీలగా వినబడింది. 'బేరర్ కమిన్' అన్నాడు విజయ్.

ఇంగ్లీషు కలవరింతలు మీనాకి కొత్తకాదు, లోపలికొచ్చి 'లే అన్నయ్యా ఎంత పొద్దెక్కిందో తెలుసా? లే' అంటూ కుదిపింది. బద్ధకంగా లేచాడు అజయ్. గతుక్కున్నాడు కొత్త ఇల్లు చూసి, కథ గుర్తుకొచ్చింది. తమాయించుకున్నాడు నడుం పట్టేసింది - ఈ శిలాతల్పం మీద నిద్రతో. అలా కూర్చోబడిపోయాడు. జీవన్నాటకంలో కొత్తరంగం ఎలా ఆరంభించాలి. ఎలా నవ్వాలి, ఎప్పుడేడవాలీ అన్న వైనాలు ఆలోచించసాగాడు. లే అన్నయ్యా లే అని సతాయిస్తోంది చెల్లెలు. అలా ఆపేక్షగా ఓ మనిషి అధికారం చెలాయిస్తూవుంటే చాలా హాయిగా వుంటుందని అజయ్‌బాబుకి ఆ ముహూర్తంలోనే బోధపడింది. ఇంటిదగ్గర తనువస్తే అంతా భయపడతారు అక్కడి సంబంధాలు వేరు.



'రామనామ తారకం భక్తి ముక్తిదాయకం' అంటూ రామ సంకీర్తన వినబడి తలఎత్తి సావిట్లోకి చూశాడు అజయ్.

రామదాసుగారు సందడిగా వచ్చేశారు. చేతిలో కొబ్బరికాయలు, భుజాన అరిటిగెల ఉన్నాయి.

'... జానకీ మనోహరం సర్వలోక నాయకం' అంటూ, గదిలోకి తొంగిచూశాడు.

'ఏమిటీ! దొరగారికి మేలుకొలుపు పాడుతున్నావా? పడుకోనియ్యమ్మా. పడుకోనీ పడుకోనీ. వాడికేం, జమీందారు బిడ్డ' అన్నాడాయన వెటకారంగా.

జమీందారు బిడ్డ అజయ్‌కి అందులో కారం చుర్రున తగల్లేదు. మరే అన్నట్టు కూర్చున్నాడు.

'వెళ్లన్నయ్యా. నువ్వెళ్లి స్నానం చేసిరా' అంటూ తువ్వాలందించింది మీనా.

సావిట్లో సందడిచూసి విస్తుపోయింది మీనా. ఇంత సామాగ్రి

ఒక్కసారిలా వచ్చిపడింది అని.



'ఏముందమ్మా. రామకోటికి పుస్తకాలూ, ప్రసాదానికి అరటి గెలా, కొబ్బరికాయలూ, పానకానికి బెల్లం, మంగళారతికి కర్పూరం... ఈ వేళ రాములవారికి అఖండ జ్యోతి... రామా రక్షకా!' అంటూ పైనున్న వాడికి చేతులెత్తి నమస్కరించాడు రామదాసుగారు. ఆయన ఎవరితో మాట్లాడినా మరు నిముషంలో రామభద్రుడి దగ్గరకు వెళ్లి పోతాడు. ఆయన ఎప్పుడూ రాముడి సన్నిధినే ఆ లోకంలోనే వుంటాడు. ప్రసాదాలకోసంమటుకు ఈ లోకానికి దిగివస్తాడు.

'రామదాసుగారో!'' అన్నా రెవరో.

'ఆహా, ఆ రాములవారే పిలుస్తున్నట్లుంది... వస్తున్నా స్వామీ' అన్నారు రామదాసుగారు తన్మయానందంతో.

పిలుపుకి జవాబు వినగానే పిలచినాయన స్వరంలో ఆప్యాయత మాయమైంది. ఒక్కసారిగా సెట్టిగారు లోపలికి దయచేశారు.

'ఏవయ్యా, రావయ్యా అరువైతే నా కొట్టో, రొఖ్ఖమైతే ఆ నాయుడు కొట్టోనా? అయ్యన్నీ ఆడ కొంటూంటే, మేవు సూడలేదనుకున్నావా? ఏం పెద్దమనిషివయ్యా నువ్వూ. తీర్పు ముందు, ముందు నా అప్పు తీర్పు' అన్నాడు షావుకారు చిందులుతొక్కుతూ.

రామదాసు గారు కించిత్తయినా చలించలేదు. 'సామెత జెప్పినట్టూ, అప్పు చేయించేదెవరు? అప్పు ఇచ్చిందెవరు? అప్పు తెచ్చిందెవరు? అంథా ఆ రాములవారిలీల. మనం నిమిత్తమాత్రులం అంతే' అన్నారాయన కన్నులరమోడ్చి.



'చాల్లేవయ్యా నీ వేదాంతం. ముందు నా డబ్బక్కడ పెట్టు' వేదాంతాని కంతెక్కడ. చాలినంత వంటబడితే షావుకారా మాట అనేవాడే కాడు. అందుకని రామదాసుగారు ఉపదేశం కొనసాగించారు 'మీరు డబ్బో డబ్బోఅని ఈ కాకిగోలమాని, 'రామా, రామా!' అని ఒక్కసారి జపించండి. మీ ఆర్తనాదం విని, నేను చేసిన అప్పు ఆ శ్రీరామచంద్రుడే తీరుస్తాడు' అన్నాడు - భారం పైవాడిపైన పడేస్తూ.

'తీరుస్తాడు, తీరుస్తాడు... ఇదిగో నువ్వు శ్రీ భద్రాద్రిరామదాసు ననుకున్నావేమో!...'

'అపచారం' అంటూ లెంపలేసుకున్నారు రామదాసుగారు. 'అపచారం, అపచారం ఆ భద్రాద్రి రామదాసు భక్తుడై జైలుకెళ్లాడు, ఈ రాంభజన రామదాసు జెయిలుకెళ్లి భక్తుడయ్యాడు. ఆ తేడా ఎప్పుడూ వుంది'.

షావుకారు రెచ్చిపోయాడు. 'చాల్లేవయ్యా కబుర్లు. ఏదో భక్తుడివి గదాని ఆర్నెల్లు అద్దె బాకీ వున్నా, ఇల్లు బాగుచేయించి యిస్తే, ఇటు అద్దె, అటు అప్పు, రెండూ యగ్గొడతావా? మర్యాదగా తక్షణం యిల్లు ఖాళీచేయి. లేదా బయటకు గెంటిస్తాను' అన్నాడు కోపంతో వణికిపోతూ.

స్నానం చేసి వస్తున్న అజయ్ ఈ రభస విన్నాడు,

జాగీర్దారీ పౌరుషం విజృంభించింది.

—— ఇంకావుంది

---

'దొంగరాముడు' తరువాత నాగేశ్వరరావును. ఆయన ఇమేజ్‌ని దృష్టిలో ఉంచుకొని రూపొందదించిన చిత్రం 'ఇద్దరు మిత్రులు'.

ద్విపాత్రాభినయాన్ని తొలిసారిగా తెలుగు ప్రేక్షకులకు చూపిన చిత్రం 'ఇద్దరు మిత్రులు'.

వెలుగునీడలు శతదినోత్సవ వేడుకలు నిమిత్తం విశాఖపట్నం వెళ్లిన మధుసూదనరావు మిత్రులు నవయుగ చంద్రశేఖరరావు, నవయుగ మేనేజర్ డి. విశ్వనాథ శర్మ, ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత ఎ.వి.సుబ్బారావులతో కలసి కలకత్తా వెళ్లారు. కలకత్తాలో కొన్ని చిత్రాలు చూసారు. వాటిలో ప్రముఖ బెంగాలీ హీరో ఉత్తమకుమార్ ద్విపాత్రాభినయం చేసిన 'తాషేర్‌ఘర్' మధుసూదనరావుకు నచ్చింది. పి.ఎ.పి. సుబ్బారావు గారికి ఆచిత్రం రైట్స్ తీసుకునే ఉద్దేశం ఉందేమోనని ఆయనని అడిగాడు. ఈ చిత్రంలో డ్యుయెల్ తప్ప ఏమీ లేదని ఆయన వద్దన్నారు. కథలో పెద్ద విశేషమేమీ లేకపోయినప్పటికీ నాగేశ్వరరావు గారితో ద్విపాత్రాభినయం చేయించాలనేదృష్టితో 'తాషేర్‌ఘర్' రైట్స్ కొని మద్రాస్ చేరారు మధుసూదనరావు. ఆదుర్తి సుబ్బారావుతో కథ చర్చలు ప్రారంభించారు. అయితే తెలుగులో చాలా మార్పులు చేయవలసి వచ్చింది. మూలమైన 'తాషేర్‌ఘర్' చిత్రంనుండి మూడే మూడు సన్నివేశాలను తీసుకొని మిగిలిన కథ మొత్తాన్ని అన్నపూర్ణ సంస్థ రూపొందించింది. తెలుగులో చాలా కొత్త పాత్రలు చేరాయి. శారద, రేలంగి, రమణారెడ్డి, పద్మనాభం, సూర్యకాంతం, ఇ.వి.సరోజ పాత్రలు ఒరిజినల్‌లో లేవు. తొలిసారిగా అన్నపూర్ణ సంస్థ ట్రీట్‌మెంట్ ఓరియెంటెడ్ సబ్జెక్టును చేపట్టింది. మా అన్ని చిత్రాలకథలను నేను ఇప్పటికి చెప్పగలను గానీ ఎన్నిసార్లు చూసినా ఇద్దరు మిత్రులు కథను మాత్రం వివరంగా చెప్పలేనంటారు మధుసూదనరావు. ఈ చిత్రం నుండే ద్విభాషా చిత్రాల నిర్మాణాన్ని విరమించుకుంది అన్నపూర్ణా సంస్థ. రెండు భాషల్లో చిత్రాన్ని నిర్మిస్తే ఖర్చులు కలిసివస్తాయనే రోజులు పోయాయి. అన్నపూర్ణ సంస్థ వరుసగా సాధిస్తున్న విజయాలను చూసి, రెమ్యూనరేషన్స్ విపరీతంగా పెంచారు కొందరు తమిళ ఆర్టిస్టులు. దానికి తోడు మరికొన్ని ప్రతికూల పరిస్థితులు కూడా తోడు కాగా 'ఇద్దరు మిత్రులు' చిత్రాన్ని తెలుగు వరకే పరిమితం చేశారు.



తెలుగు అడాప్షన్ లో పుట్టుకొచ్చిన కొత్త పాత్రల్లో హీరో చెల్లెలు పాత్ర ముఖ్యమైనది. ఈ పాత్ర ఎవరితో చేయించాలి అన్నది ప్రశ్న. దీనికి ఎస్టాబ్లిష్‌డ్ ఆర్టిస్టుల కన్నా కొత్త అమ్మాయి బాగుంటుంది అనుకున్నారు. అన్వేషణ ప్రారంభమైంది. పత్రికల్లో ప్రకటనలు ఇచ్చారు. చాలామంది అమ్మాయిలు ఫోటోలు పంపించారు. ఒక్కరూ నచ్చలేదు.

ఒకరోజు ఎల్.వి.ప్రసాద్ గారిని "ఎవరైనా కొత్త అమ్మాయి ఉంటే చెప్పండి" అని అడిగారు మధుసూదనరావు. అపుడే చిత్రాల్లో వేషం కోసం తెనాలినుండి ఒక కొత్త అమ్మాయి ప్రసాద్‌గారికి ఫోటోలు పంపింది. ఆ ఫోటోలను చూపించారు ఎల్.వి.ప్రసాద్ గారు. బాగుంది అనుకుని వెంటనే ఆ అమ్మాయిని పిలిపించి చూశారు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు ఓ.కె. అన్నారు. అలా ఆ చిత్రంలో హీరో చెల్లెలు పాత్ర ద్వారా తెలుగు తెరకు మరో గొప్పనటి పరిచయమైంది. ఆమె శారద.

సీరియల్

7

# సినీ తీ చంద్రిక

రావి కొండలరావు



"అది సర్లేవయ్యా - అస్పెం లేదు గదా - ఇదిగోనబ్బాయ్, రేలంగుండాల! ఆఁ!" అన్నాడు నిర్మాత.

"రేలంగి ఎట్లాగూ వుంటాడనుకోండి. అతను లేకుండా పిక్చరేం తీస్తాం గాని! అదే. హ్యూమరు బాగా డెవలప్ చెయ్యండి. చివరి సీనులో బాగా కార్లు పరుగెత్తటం, యుద్దాలూ, కొండలూ, పోలీసులు రావటం ఇవన్నీ బాగా రావాలి. కథ ఇంకా పేలవంగా వుంది. దాన్ని ఇంకా మోతగా చెయ్యండి. చేసి, రేపు రాసుకురా. వుయ్ విల్ సీ" అన్నాడు సలహా లేస్తూ.

"లేస్తున్నావేందయ్యా?" అన్నాడు నిర్మాత ఆత్రుతగా.

"నాకు పనిలేదూ మరీ, రేపు కలుద్దాం. లేకపోతే ఆ డైరెక్టరూ కవీ కూచుంటారు. ఇద్దరూ కలిసి ఆలోచించడయ్యా. రేపటికి ఓ షేపుకు తీసుకురాండి. నేనొచ్చి ఫైనలైజ్ చేసేస్తాను. ఆఁ! చూడండి. మహాశయ్ - మంచి కథగా చెయ్యండి. లేకపోతే, పాతది ఏదన్నా కలపండి. ఇబ్బందేం లేదు. వెనక బాగా పోయిన ఏ 'మళ్ళీ పెళ్ళో' 'మాలపిల్లో' కొట్టేసినా ఏం పర్వాలేదు. టైటిలు మార్చేస్తాంగా. స్టార్సూ మారిపోతారు అంచేత, రెండు మూడు త్యాగాలు పెట్టుకుని, చిన్న ఫ్యామిలీ డ్రామాతో, మంచి కామెడీ నడుస్తూ, మళ్ళీ సీరియస్‌గా వుంటూ సస్పెన్స్ వుంటూ, స్టంట్లూ, కుస్తీలకు తావిస్తూ, మ్యూజిక్‌కు మంచి స్కోపిస్తూ, ఎమోషనల్ సీన్లు బాగా డెవలప్ చేస్తూ, శృంగార ఘట్టాలు మోతాదు మీరినా పర్వాలేదు. వాటిని మీరిస్తూ హాస్యం సీన్లు మధ్యమధ్య ఇరికిస్తూ, చివరకు హేపీ ఎండింగ్ వచ్చేట్లు కథ తయారుచెయ్యండి. మీకెందుకు, ఇరవై కేంద్రాలలో రజతోత్సవాలేమిటి, శతదినోత్సవాలు జరిపిస్తాను. మనం అందరం అన్ని సెంటర్లకూ వెళ్ళాలి. అంతేగాని, నాలుగేసి సెంటర్లను కలిపి ఓ సెంటర్లో చెయ్యవద్దు" అన్నాడు సలహా హుటుగా, పిడికిలి బిగించి వూపుతూ.

**జరిగిన కథ**

**ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించ సాగాం....**

**(ఇక చదవండి)**

"జనం మూగరటయ్యా?" అన్నాడు ఆశ్చర్యంగా నిర్మాత.

"మూగనీ! వాళ్ళకోసం కాకపోతే మనకోసమా ఇవి! ఈ పిక్చర్సూ వాళ్ళకోసమే - ఈ వుత్సవాలూ వాళ్ళకోసమే. ఓయ్. ఫలానా - నువ్వు ముందెళ్ళి సీట్సు రిజర్వు చేసెయ్యి -- అర్జంటు"

ఫలానా చట్టున లేచి తుర్రుమని వెళ్ళాడు.

"నేను వస్తాబ్రదర్ - మనం అంతా అక్కడ కలుద్దాం. అంచాత, ఆ ప్రకారంగా ఏర్పాటు చెయ్యండి. రేపు నే వచ్చేటప్పుడు మ్యూజిక్ డైరెక్టర్ని కొట్టుకొస్తాను. అన్నట్టు. కవీ నీ యింటికి ఫోనుందా?" అడిగాడు సలహా.

"లేదు, ఏం?"

"అయితే ఇబ్బందే. మ్యూజిక్ డైరెక్టరు రిహార్సల్సుకు ఇక్కడికి రాడు, అతనికి మాటల్ని ఫోన్‌లో చెబుతూ వుండాలి. అతనట్లాగే ట్యూన్ చేస్తూ ప్లేబాకు వాళ్ళకు ట్యూనంతా ఫోన్ చేస్తాడు".

"వాట్!" అన్నాను నేను.

"వాట్ అనగానేమి. వస్తా!" అని చరచరా వెళ్ళిపోయాడు సలహా. మేమంతా ఒకరి మొహంలో వుండే రియాక్షన్‌ను ఇంకొకరు పరిశీలిస్తున్నాం. ఇంతలో బయటకు పోతున్నవాడు - మళ్ళీ పెద్ద కేక వేశాడు -- "కవోయ్! ఆ హీరోయిన్ సెంటిమెంట్సును పాడు చెయ్యకు. అవే చిత్రానికి



జీవాలు, ఈ సంగతి రహస్యం! ఎవరికీ తెలియనివ్వకండి" అని పబ్లిక్ హోటల్లో అరుస్తూ వెళ్ళిపోయాడు.

"అడావుడోడు!" అన్నాడు నిర్మాత.

"సరే -- నాకు అండర్ గ్రౌండు తవ్వించండి -- ఈ హోటలు క్రింది" అన్నాడు కవి.

"ఏం దది?"

"అండర్ గ్రౌండులోకి పోవలసిందే నేనింక! తవ్వించండి గొయ్యి".

"ఇదేందయ్యా -- సలహా లేదుగదా -- ఇదేంది తవ్వించమంటావు?'' అని బిత్తరపోయాడు నిర్మాత.

"అదేం కాదులెండి" ఆయన ఇంకో మూడ్‌లోకి పోయే టయిమయింది. బహుశా పోయే వుంటాడు -- అందుకనే తవ్వించమంటున్నాడు," అని నవ్వాను నేను. మా యిద్దరికీ పిచ్చెత్తిందేమోనని, వెర్రిగా చూశాడు నిర్మాత.

''అండర్ గ్రౌండంటే, మామూలుగా ఏదన్నా హోటలన్న మాటండి. ఆయన ఒంటరిగా అక్కడ కూచుని రాస్తాడు. రాత అయ్యేదాక బయటకు రాడు. అంతే?" అన్నాను నేను.

''అదా -- నా కొంపతవ్వినారు గదయ్యా" అన్నాడు నిట్టూరుస్తూ నిర్మాత. ఇంతలో ఫలానా వచ్చాడు.

"ఎటుపోయినావురా -- రిసర్వుకా?" అన్నాడు నిర్మాత.

"రిసర్వుకే గురూగారూ! ఇప్పట్నుంచే రిజర్వేషన్ చేసుకోవాలి. లేకపోతే టిక్కెట్లు దొరకవు. అందుకనే వెళ్లాను. ఇంకో సంవత్సరం పోయాక కనిపించమన్నారు, రైల్వే వాళ్లు. చూశారా ఇప్పటికే లేవట" అన్నాడు ఫలానా.

"నువ్వొకడివిరా, సలాలోడికి తగినోడివి!" అన్నాడు నిర్మాత నవ్వుతూ.

"సలహామాత్రం సర్వజ్ఞుడులెండి!" అన్నాను నేను అతన్ని మెచ్చుకుంటూ. లేకపోతే నిర్మాతకు కోపం వస్తుందేమోనని,

"సర్వజ్ఞత ఆపాయము డేర్రటుగారూ, సర్వజ్ఞుడనని గర్వించి తొల్లి ఒక నిర్మాత నశించిన తీరు సవిస్తరముగా వినిపించెద. వినుడు" అని ప్రారంభించాడు ఫలానా.

చదువూ సంస్కారమూ బోలెడంతా, ధనమూ దస్కమ్మూ మరో అంతా గల ఒక నిర్మాత చిత్రం ప్రారంభించాడు. ఆయన ఉద్దేశాలు చాలా గొప్పవి. తెలుగు చిత్రాలు




ఎప్పుడూ ఏడుస్తూ ఉంటాయనీ, లేకపోతే నవ్వుకోనిస్తాయనీ ఆయన అభిప్రాయం. విదేశాలలో తెలుగుచిత్రం ప్రదర్శింపబడాలని, అదీ ఆయన చిత్రమే కావాలని ఆయన పట్టు. శాంతారామూ, సత్యజిత్‌రాయీ లాంటి దర్శకులు తెలుగునాట కూడా ఉన్నారని అతని విశ్వాసం. కాని, ఈ నిర్మాతకు ఒక దారుణపు ఐడియా కూడా ఉంది. అదేమిటంటే, తాను 'సర్వజ్ఞుడి'నని! సినిమా పరిశ్రమలో తనకు తెలియనదంటూ లేదని వారి అభిప్రాయం. కథ, పాటలూ, మాటలూ, దర్శకత్వం, కెమెరా మొదలైన అన్ని శాఖలలోనూ ఆరితేరిన వాడినని రోజూ రెండు పూటలా అనుకునేవాడు. అతనో చిత్రం తియ్యబోయాడు. పెద్ద రచయితనీ, పెద్ద దర్శకుణ్ణి ఏర్పాటు చేసుకున్నాడు. మంచి కథను ఎన్నుకున్నాడు. తారలను ఎన్నుకున్నాడు. తీరా స్క్రిప్టు పూర్తయేసరికి, ఇది అలాక్కాదనీ, అది ఇలాక్కాదనీ అనటం ప్రారంభించాడు. సంభాషణలన్నీ తానే దిద్దసాగాడు - సీను ఎట్టా తియ్యాలో దర్శకుడికి చెప్పసాగాడు - పాటల్లోని మాటలన్నీ మార్చసాగాడు. ఇది ఎవరికి కిట్టలేదు. రచయితకూ, దర్శకుడికీ కోపం వచ్చింది. మీ యిష్టం ఎలొచ్చినట్టు చేసుకోవటానికి మధ్య మేమెందుకు?'' అని అడిగాడు.

"పేరుకోసం" అన్నాడు నిర్మాత, అని-

''సినిమాల్లో నావల్టీ కావాలి, ఎంతసేపూ మీరు పాత పద్ధతులే ఆలోచిస్తున్నారు. ఆ పద్ధతులు మారాలి".

"మీరొచ్చి మా వర్కులో చెయ్యి పెట్టటం కొత్త పద్ధతా?" అని అడిగాడు దర్శకుడు.

''అదికాదు, ఈనాడు శాంతారామ్ చిత్రాలు గొప్పవని అందరు అనటానికి కారణం ఏమిటి - అన్ని శాఖలూ అతనే స్వయంగా చూచుకుంటాడు. తెలుసా?" అన్నాడు నిర్మాత.

"చూస్తాడు - అతనికి అన్నీ తెలుసు కాబట్టి!" అన్నాడు రచయిత.

"అంటే నాకు తెలీదనా?" అన్నాడు నిర్మాత. ఎవరూ మాట్లాడలేదు.

"నేనే దర్శకత్వం వహిద్దామనుకున్నాను. కాని, మీరంతా జీవించేదెట్లా? మీకోసమే నేను మానుకున్నాను. ఈ దర్శకత్వం, రచన అన్నీ నాకు తెలునును. చార్లిచాప్లిన్ అన్నీ తనే చూసుకుంటాడు - ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ అన్నీ తనే చూసుకుంటాడు - తెలుసా?''

"అయితే సరే! అన్నీ మీరే చూసుకోండి! రేప్పొద్దున చిత్రం కూడా!" అని కోపంగా అనేసి రచయిత వెళ్ళిపోయాడు.

"వెళ్ళనివ్వండి, మీకెందుకు - ఏవన్ రైటర్‌ని తెస్తాను" అన్నాడు నిర్మాత.

"తెచ్చుకోండి" అని ఇంకా కోపంగా అనేసి దర్శకుడు కూడా నిష్క్రమించాడు దూకుడుగా.

"వెళ్ళండి, మీ రోగం నేను కుదురుస్తాను. నాకు

తెలీదూ - మరో డైరక్టరుని తెస్తాను. లేదా అసిస్టెంటుచేతే దగ్గరుండి చేయిస్తాను. వాడిని ఉద్ధరించినట్టూ అవుతుంది. స్క్రిప్టుకేమిటి - రాసి వున్నదే కదా! అక్కడా అక్కడా మార్చిపారేస్తే సరి!" అని తాపీగా స్వగతంతో సంభాషణ చెప్పుకుని - కాఫీ తాగాడు. అటూ ఇటూ చూసి అసిస్టెంటును కేకేసి - "నీ పేరు వేస్తాను. నేనే నీ చేత చేయిస్తాను" అన్నాడు.

"ఒద్దు. నాకు నా అసిస్టెంటు డైరెక్టరే కావాలి. ఎంచేతంటే ఇవాళ ఇది మీరు యిచ్చారని సంతోషించినా రేపు పొద్దున్న నా అవస్థ కుక్కకూడా పడదు. కావాలంటే చిన్న కథ చెబుతాను వినండి.

"నా వంటి అసిస్టెంటు డైరెక్టరు ఒకడుండేవాడు - నాలాగే జీనియస్. అదే మీలాగే... నాలాగే ననుకుందాం. ఆ జీనియస్‌ని ఒక నిర్మాత గుర్తించి చిత్రం డైరెక్టు చేయించాడు. కాని, అతని అదృష్టం బాగులేదు. ఆ చిత్రం పోలేదు. చిత్రం మాత్రం 'మోత' అన్నారు. రెండు పాత్రలతో అర్ధసెట్టు మీద ఆరుముప్పావు రోజుల్లో తీసిన చిత్రమది. చిత్రంలో చాలా చోట్ల మాటలుండవు. అంతా సింబాలిక్‌గా వుంటుంది. ఇటువంటి మహత్తర చిత్రం ఎవరికీ అర్థం కాలేదు. కానీ రాబడి లేదు. రెండో రోజే తీసేశారు కొన్ని ఊళ్ళల్లో. ఈ ఘోరవార్త విని, నిర్మాత ఆ ఉత్తరం చదువుతూనే గుండె ఆగిపోయి మరణించాడు. జీనియస్ జనసంచారంలేని చోట్లల్లో ముచ్చటైన మూడు వారాలూ కాలం గడిపి నాణ్యమయిన నాలుగో వారంలో జనంలో కాలు పెట్టాడు. అందరూ జీనియస్ జీనియస్ అన్నారు. 'యస్ యస్' అన్నాడితను. అయితే ఏ నిర్మాతా మళ్ళీ అతనికి దర్శకత్వపు ఛాన్సు ఇవ్వలేదు. ఏం చేస్తారు? నాలుగేళ్ళు అట్లాగే గడిపాడు. 'జీనియస్‌లుగా పుట్టడం తప్పు' అనుకున్నాడు. అతని అవస్థ చాలాదూరం వెళ్ళింది. ఎవరూ దర్శకత్వానికి పిలవరు - తాను తిరిగి సహాయ దర్శకుడుగా ఎలా వెళ్తాడు? ఈ కాన్‌ఫ్లిక్టులో కొట్టుమిట్టాడి ఆఖరుకు ఇట్లా అనుకున్నాడు. "ఆహా నాడు సహాయ దర్శకునిగా ఉన్నా బాగుండిపోయేది గదా! జీవితం వెళ్ళేది. ఇవాళ గౌరవం అడ్డొస్తున్నది. ఒకసారి దర్శకుడినై మళ్ళీ 'సహాయ'గా ఏ ముఖం పెట్టుకుని చెయ్యను? ఎన్నాళ్ళు నాకీ కష్టాలు? ఎన్నాళ్ళు నాకీకష్టాలు" అని రెండేసిసార్లు తలపోసి తలపోసి, చివరకు గత్యంతరం లేక సినిమా పొలం విడిచి పెట్టేసి, సొంతవూరెళ్ళి పాతపొలం దున్నకో సాగాడు. విన్నారా! అందువల్ల వెనకాల బాగా మద్దత్తు వుంటేనే గాని దర్శకుడు కాకూడదు. ఒకవేళ ప్రథమ చిత్రం హిట్టయితే పర్వాలేదు. మట్టైతే! ఎవరన్నా మళ్ళీ పెట్టుకోగలిగే వాళ్ళు వుండాలి. ఈ పరిశ్రమలో అటువంటి వాళ్ళు ఎక్కడా వుండరు" అన్నాడు సహాయదర్శకుడు.

"అయితే చూడు, నేనే డైరెక్షన్ చేస్తున్నాను" అన్నాడు నిర్మాత. స.ద. ఆరు నిమిషాల పాటు నిర్మాతకేసే చూశాడు. కాని ఆ నిర్మాత ఖాతరు చెయ్యలేదు.

"నన్నేం చెయ్యమంటారు?" అనడిగాడు స.ద.

"అసిస్టెంటు డైరెక్షన్ చెయ్యి"

"కాదు... ఇప్పుడు?"

"ఆ స్క్రిప్టు అంతా వేరేగా రాయి. అదంతా ఆ పాత రచయిత చేతిరాతతో ఉంది! అదంటే నాకు ఒళ్ళుమంట!" అని నిర్మాత కారెక్కాడు. అసిస్టెంటు డైరెక్టరు ఉద్యోగంలో ప్రప్రథమ డ్యూటీ - కాపీ చెయ్యటం! ఆ పనే చెయ్యసాగాడు స.ద.

సర్వజ్ఞుని డైరెక్షను అర్థం కావటం లేదు. ఏవేవో టెక్నిక్‌లన్నీ పెట్టాడు. హీరో ఒక దృశ్యంలో కోపంగా వెళ్ళిపోతూ టేబుల్‌మీద ఉన్న ఫానును తిప్పేసి వెళ్ళిపోతాడు. అయిదు నిమిషాలు పాటు ఆ ఫానుషాటు కనిపిస్తుంది! ఎందుకో... అట్లాగే, చెట్లమించి గంటల తరబడి ఆకులన్నీ రాలిపోతూ ఉంటాయి. విలన్ పారేసిన సిగరెట్ పూర్తిగా కాలినదాకా కనిపిస్తుంది. ఇట్లాగే చాలా ఉన్నాయి. ఇవన్నీ ఎందుకంటే 'డైరెక్షను' అన్నాడు. 'సింబాలిజమ్' అన్నాడు. 'శాంతారామ్, సత్యజిత్, చార్లిన్, హిచ్‌కాక్' అన్నాడు చిత్రం రిలీజయింది.

ఆయన స్క్రిప్టు ఆయనకే అర్థం కాలేదు. డైరెక్షన్ మాత్రం ప్రజలకు అర్థం కాదుట! కాకూడదనే ఆయన ఊహలు కూడాను. కెమెరామెన్ ఈ చిత్రంలో ఒక్కషాటయినా నేను తీస్తే ఒట్టు!" అన్నాడు. చిత్రం దివ్యంగా ఏకదినోత్సవం చేసుకుని, కంచికి వెళ్ళిపోయింది. నిర్మాత యింటికి వెళ్లి పోయాడు. వింటిరా - సర్వజ్ఞుడనని గర్వించిన యా నిర్మాత తుదకేమైనాడో! అంచేత, గురూగారూ, మీరూ మీరూ - ఈ ఫీల్డులో 'సర్వజ్ఞత' పనికి రాదు - సర్వజ్ఞుడనని అనుకోవటం అంతకన్నా అపాయం!" అని పూర్తిచేశాడు ఫలానా.

"అది సరేగాని, సిన్నోడా - ఎవుడయ్యా మాటిమాటికీ సత్తెజిత్‌రాయి అంటా వుంటివి?"

"సత్యజిత్‌రాయి -గురూగారూ, విదేశాలలో కూడా భారత చిత్రాలను ప్రదర్శించి, వారి చిత్రాల కన్నా వాని చిత్రాలు మేటియని నిరూపించిన ఏకైక భారత దర్శకనిర్మాత - వంగవ్యక్తి. అన్నట్టు గురూజీ - ఏ తోటదగ్గరయినా బావగాని, వంగతోట దగ్గర మాత్రం బావగాడు. వాళ్ళ తోటలు అంత గొప్పవి".

"ఏడిసినట్టుంది" అన్నాడు రచయిత.

"ఏది -వంగతోటా?" అన్నాడు ఫలానా.

ఎవరూ నవ్వలేదు.

"విన్నారా గురూగారూ - సత్యజిత్‌రాయీ, బిమల్‌రాయీ గొప్పాతిగొప్ప దర్శకులు".

"హతవిధీ!" అన్నాడు రచయిత. చెవులు మూసుకుంటూ.

"మీరు రాసే స్క్రిప్టు కన్నా నయం కాదా - మీ పాటలలోని మాటలకన్నా గొప్ప కాదా!" అని అడిగాడు ఫలానా.

"సర్లేరా - ఎవరెవరన్నావూ ఆళ్లు?" అన్నాడు నిర్మాత.

"అబ్బ చెప్పినప్పుడు వినరుగదా - సత్యజిత్ రాయీ, బిమల్‌రాయీ".

"మరి బీనారాయి?" అని అడిగాడు నిర్మాత.

"అమ్మ గురూ - మీకూ తెలిసిందే! బీనారాయి ఆడదికాబట్టే హీరోయిన్ వేషాలు వేసుకుంటోంది, స్త్రీ, గురూగారూ"

"అదేందిరా - "ఆళ్లూ రాళ్ళే, ఈమే



రాయేగదా, ఆడదెట్టారా?"

"ఆఁ- అక్కడే ఉంది గురూ! ఇది చిత్రభేదం గురూ, చిత్రభేదం! చూశారా - చిన్నపేరుతోనే ఎంతభేదం ఉందో!" అన్నాడు ఫలానా లేస్తూ.

"ఎక్కడికోయ్?"అనడిగాను నేను.

"వస్తా. మా ఫ్రెండొకడికి నేను నాలుగు మీల్సు టిక్కెట్లు బాకీ. వాడు కనిపిస్తే మరోటి కూడా తీసుకుంటే, అక్కడికి ఐదూ బాకీ ఉంటాను. వీలుచూసుకుని ఐదూ ఒక్కసారే తీర్చవచ్చును. వస్తా" అని వెళ్ళిపోయాడు ఫలానా.

నిర్మాత ఘొల్లుననవ్వి "అసాధ్యుడు" అన్నాడు.

"ఐతే నేనూ వస్తానండి. కథ కాస్త మార్చి. 'రుచి' కోసం రెండు సీన్లు కూడా రాసి రేపు తీసుకొస్తాను. ఈ లోపల మీరు కూడా ఆలోచించండి" అని రచయిత కూడా వెళ్ళిపోయాడు. నేనూ లేవబోతే, "నువ్వుండయ్యా - ఇక్కడే తిందువులే. ఈ లోపల మనం కత కడదాం" అన్నాడు నిర్మాత. ఇష్టం లేకపోయినా "ఊఁ" అనవలసి వచ్చింది!

"ఆ మర్నాడు సలహా, రచయితా వచ్చారు. ఫలానే ఇక్కడే ఉన్నాడు. మేం ముగ్గురం వాళ్ళకోసమే చూస్తు వుండగా, వాళ్ళొచ్చారు. వస్తూనే సలహా" "అసలు ఇండస్ట్రీ మారాలి బ్రదర్. లేకపోతే ఏముంది - ఈ కాకమ్మ కథలతో చస్తున్నాం. కాకపోతే సోషలైతే ప్రేమలూ, త్యాగాలూ, మిల్లులూ, కూలీలూ, స్ట్రయికులునూ! ఇవేనా నేటి మన సమస్యలు? అసలు ఇంకా ఎన్నిలేవు? విద్య, బర్తు కంట్రోలు, రాఫిల్ము ట్రబులు, స్టార్సు ట్రబులు, నిరుద్యోగాలు - చెప్పాలంటే లక్ష ఉన్నై, బట్ నోబడీ డేర్స్ టు -- అంటూ వచ్చి కూచున్నాడు.

"సలహాలోడు ఏదో ఆలోచిస్తానే ఉంటాడు. మా గట్టోడు!" అని మెచ్చుకున్నాడు నిర్మాత.

"ఆలోచన కాదు బ్రదర్! మతే పోతూ ఉంటుంది. యాక్చువల్‌గా ఒక్కో సమయంలో. అసలు మనం చేస్తున్నదేమిటి? ఎందుకీ ఇండస్ట్రీ డిజనరేట్ ఐపోతోంది? మన పిక్చర్సేమిటి? మనం ఏమిటి -- ఇదంతా ఆలోచిస్తూవుంటే ఏ దండకారణ్యానికో పోయి తపస్సు చేసుకోవడం బెటరనిపిస్తుంది".

"నువ్వు తపస్సు ఏం చేస్తావు లేవయ్యా - రెండ్రోల్లో ఇంటికి రాకపోయినా!" అన్నాడు నిర్మాత నవ్వుతూ.

"అయ్యా! రాసింది చదువుతాను. వింటారా?" అన్నాడు వినయంగా రచయిత.

"కానీ, గానీ! ఈటికేముంది ఎప్పుడూ వున్నయ్యే, నువ్వు కతగానీ"

రాసిందేదో రచయిత చదివి, రెండు సీన్లలోని సంభాషణలూ చదివాడు.

"బరూలేదే" అన్నాడు నిర్మాత.

"సంభాషణల్లో జిగిలేదు, సొండు యొక మాదిరిగానున్నది" అన్నాడు ఫలానా.

"మొత్తం కథ ఫైనలైజ్ ఐతే, డైలాగ్సు చూడవచ్చునేమో?" అన్నాను నేను.

"చూసుకోవచ్చును దానికేం గానీండి - బట్. వేరీజ్ ది నావెల్టీ? అంతా ఓల్డు..... ఓల్డు...." అన్నాడు సలహా.

"అయ్యా, మీరంతా నన్ను క్షమించాలి, చేతకాక, కొత్త పద్ధతిలో రాయలేక కాదు. మనకు కొన్ని పద్ధతులు - ముఖ్యంగా సీన్లలో. సంభాషణలు వస్తున్నాయి. దాన్ని మనం ఈనాడు మార్చలేము. అది మన సాంప్రదాయం. మీరు రెండు నిమిషాలు టైమిస్తే అవన్నీ ఏమిటో వివరిస్తాను" అన్నాడు రచయిత.

"ఇచ్చాం, వివరించు" అన్నాడు సలహా.

**(ఇంకా వుంది)**

# కోడి రామకృష్ణ చెప్పిన బ్యాండు మేళం కథ





ఏ ప్రశ్నకైనా తడుముకోకుండా వెంటనే సమాధానం చెప్పగలగటం - ఆ సమాధానం ఎంతో కన్విన్సింగ్‌గా ఉండటం - కొండొకచో కొంత నవ్వు కూడా పుట్టించటం - చాలా కాలం వరకు గుర్తుండి పోయేలా ఉండటం - ఈ విద్యలనీ కొందరి అబ్బుతాయి అటువం అద్భుతమైన వరం గల వ్యక్తుల్లో దర్శకుడు కోడి రామకృష్ణ ఒకరు.

"ఈ రెండు నెలల్లో మీ చిత్రాలన్నీ ఒకేసారి రిలీజయిపోతున్నాయి కదా. అలా అయితే మీ సినిమాకి మీ సినిమాయే కాంపిటీషన్ అయ్యే ప్రమాదం లేదా!?" అని ఒక పాత్రికేయుడు ఓ సినిమా షూటింగ్ గ్యాప్‌లో అడిగాడాయన్ని.

"అవన్నీ ఎప్పుడెప్పుడో ఒప్పుకుని పూర్తి చేసిన చిత్రాలండీ... ప్రొడ్యూసర్ వీలుని బట్టి రిలీజవుతూ ఉంటాయి. అందుకే దర్శకుడు తన సినిమాల్లో వెరైటీ ఉండేట్టు చూసుకోవాలి" అని సమాధానం ఇచ్చి అందుకు ఉదాహరణగా ఓ కథ చెప్పారు కోడి రామకృష్ణ.

"మేం చదువుకొనే రోజుల్లో ఓ నలుగురు ఫ్రెండ్స్ కలిసి అడపాదడపా వీలున్నప్పడల్లా ఒకే షాప్‌లో క్లాత్ తీసుకుని బట్టలు కుట్టించుకుంటూ ఉండే వాళ్లం. ఓసారి ఓ ఫ్రెండింట్లో పెళ్ళిలో కలుద్దాం అనుకున్నాం. అందరం మేం కుట్టించుకొని దాచుకున్న బట్టల్లో కొత్త డ్రెస్సుల్ని వేసుకోవాలని తీర్మానించుకున్నాం. అలాగే మీటయ్యాం.

తీరా చూసుకుంటే మేం అందరం వేసుకున్నది ఒకే రంగు, ఒకే డిజైను ఉన్న క్లాత్ కుట్టించిన ఫ్యాషన్ కూడా ఒకటే! ఇక చూస్కోండి మా బాధ.... 'ఎవర్రా వీళ్ళు బ్యాండు మేళంలా ఉన్నారు' అని ఎవరు కామెంట్ చేస్తారో అని సిగ్గుతో చచ్చిపోయాం. వీలయినంత వరకు నలుగురం కలిసి ఒకేచోట కనిపించకూడదని ఆ పెళ్ళి అయినంత సేపు రకరకాల పద్ధతుల్లో దాక్కుంటూ గడిపాం. అంచేత దర్శకుడన్నవాడు తాను చేసే సినిమాలు వెరైటీగా ఉండేట్టు చూసుకుంటే ఒకేసారి రిలీజయినా సరే ఒక దాని కొకటి కాంపిటీషన్ అయ్యే ప్రమాదం ఉండదు" అంటూ ముగించారాయన పాత్రికేయుల నవ్వుల మధ్య.

-రాజా

3

# హాస్యవల్లరి సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి

- ఎమ్మెస్ స్వాతి



అక్టోబరు 13, 1987.

పొద్దుటినుండీ కిశోర్ వర్రీడ్‌గానే ఉన్నాడు. సాయంత్రం అన్నగారు అశోక్‌కుమార్‌ను కలిసేదాకా ఆ వర్రీ పోదు.

"ఇవాళ నా పుట్టినరోజని మా ఇంటికి వస్తానన్నావు కదా, ఈ లోగా నీ తరఫున రూమాతో మాట్లాడి, ఏ విషయం చెబుతానులే!" అన్నాడు దాదామొని. రూమా ఏమందో కనుక్కోవాలని కిశోర్ ఆరాటంగా ఉన్నాడు.

అసలు రూమా వచ్చి అమిత్ వివాహం విషయం మాట్లాడిన నాటినుండీ కిశోర్ వర్రీ అవుతూనే ఉన్నాడు. ఆ వర్రీయే ఆనాటి గుండెనొప్పికి కూడా దారితీసింది.

రూమా కిశోర్ మొదటిభార్య. అమిత్ వాళ్లిద్దరికీ పుట్టిన బిడ్డ. అమిత్‌పై కిశోర్‌కెంత హక్కుందో. తల్లిగా తనకూ అంత హక్కుంది అనుకుంది రూమా. కొడుక్కి పెళ్లి చేయాలని నిశ్చయించుకుని ఓ సంబంధం తెచ్చింది వారం రోజుల క్రితం.

కిశోర్‌కా సంబంధమూ నచ్చలేదు, అమిత్ విషయంలో రూమా అంతలా కలగజేసుకోవడమూ నచ్చలేదు... 15 ఏళ్లగా అమిత్ తనవద్దే ఉంటున్నాడు. రూమా నీడ అతని మీద పడదనుకుంటున్నప్పుడు తల్లి హోదాలో ఆమె రావడం కిశోర్‌ను వర్రీకి గురిచేసింది. పెద్దన్నగారు అశోక్‌కుమార్‌తో చెప్పుకుని బాధపడ్డాడు.

అశోక్ మందలించాడు - "నువ్వు అంత ఇదవ్వకు. నీ ఆరోగ్యం గురించి కాస్త ఆలోచించుకో. రూమాతో నేను మాట్లాడతానులే. నువ్వు చాలా ఫీలవుతున్నావని చెప్పి తనను నిదానించమంటాను. నువ్వీ లోపల దాని గురించి ఆలోచించి బుర్రబద్దలు కొట్టుకోకు. మనం మళ్లీ కలిసినప్పుడు రూమా సమాధానం ఏమిటో చెబుతాను" అన్నాడు.

సాయంత్రం అశోక్‌కుమార్ ఇంటికి వెళ్లినప్పుడు ఆయనేం చెబుతాడో, రూమా సమాధానం ఏమిటో అని ఆలోచించిన కొద్దీ కిశోర్ మరింత గాభరాగా ఫీలవసాగాడు. రూమా సంగతి అతనికి బాగా తెలుసు.

**తొలిప్రేమ**

రూమా అతనికి పరిచయం కావడం సినిమా నాటకరంగం లోనే! అశోక్‌కుమార్ బాంబే టాకీస్

## విచిత్ర దాంపత్య జీవితం

దాంపత్యం విషయంలో కిశోర్ చాదస్తాలు రూమాకు ఒళ్లు మండించాయి. తొలిరాత్రే అతను అన్నాడు - "మనం ప్రేమించి పెళ్ళి చేసుకున్నాంకదా. నీకిప్పుడే గర్భం వస్తే పెళ్ళికి ముందే కలిసి తిరిగారు, శారీరకంగా కలిసివుంటారు అని అందరూ అనుకుంటారు. అది చాలా అసహ్యంగా ఉంటుంది. అందుకని ఏడాదిదాకా మనం సంసారం చేయవద్దు. అప్పుడు పిల్లల్ని కన్నా ఎవరూ తప్పుగా అనుకోరు."

" మన నిజాయితీ గురించి లోకాన్ని నమ్మించటానికి తాపత్రయ పడటం ఎందుకు? వాళ్లేమైనా అనుకోని, ఐ డోంట్ కేర్. దీని గురించి మనం దూరంగా ఉండటం ఎందుకు? పెళ్లి చేసుకున్నది కలిసివుండటానికా ?విడివిడిగా పక్కలు వేసుకోవడానికా? "అని వాదించింది రూమా.

కానీ కిశోర్ వినలేదు."మనం ఎన్నో ఏళ్లు కలిసివుండబోతున్నాం. ఒక్క ఏడాది పాటు, అదీ సెక్స్ విషయంలో మాత్రం దూరంగా ఉంటే నష్టమేముంది? ఖర్మకాలి నీకు గర్భం వచ్చిందనుకో, అప్పుడేమంటారో తెలుసా? రూమాకు కిశోర్ కడుపు చేసేశాడు. అందుకనే, కెరియర్‌లో స్థిరపడకుండానే, తాడూ బొంగరం లేకుండానే పెళ్లి చేసుకోవలసి వచ్చింది అంటారు. వాళ్లకలా మాట్లాడే అవకాశం ఇవ్వడం నాకిష్టం లేదు. ఆ కార్యకలాపాలు ఏడాదిపాటు వాయిదా వేస్తే కొంపమునిగిపోతుందా?" అన్నాడు.

కానీ రూమా కన్విన్స్ కాలేదు. భర్త చేత బలవంతపు కాపురం చేయించలేదు కాబట్టి ముభావంగా ఉండసాగింది. వీలు చూసుకుని ఓ రోజు అత్తగారితో చెప్పింది కూడా. కానీ ఇటువంటి విషయాలలో బయటివాళ్లు ఏం చేయగలరు కనుక!

పెళ్ళయిన రెండేళ్లకు వాళ్లకు అమిత్ పుట్టాడు. కానీ తొలినాళ్ల అపశృతి రూమాను బాగా ప్రభావితం చేసిందనే చెప్పాలి. 1958లో ఆమె కిశోర్‌ను విడిచి వెళ్ళినప్పుడు అతనికి తెలియకుండా డబ్బూ, నగలూతో పాటు ఓ బెంగాలీ సంగీత దర్శకుడితో కలిసి కలకత్తా పారిపోయిందని చెప్పుకున్నారు.



'పెళ్లయినా దూరంగా ఉండాలా?' అని అడిగింది రూమా.
"బేగునాహ్" (1957)లో కిశోర్, షకీలా నటించిన ఓ దృశ్యం...

నిర్వహణ చేపట్టిన తర్వాత నితిన్‌బోస్ దర్శకత్వంలో "సమర్" అనే బెంగాలీ సినిమా మొదలుపెట్టడం జరిగింది. బంకించంద్ రాసిన కథ ఆధారంగా తయారయిన ఈ సినిమాలో రూమా ఒక పాత్ర వేయటానికి సెలక్టయింది. శాంతినికేతన్‌లో డాన్సు నేర్చుకున్న రూమా అప్పట్లో తండ్రి మాంటీ ఘోష్‌తో బొంబాయిలో ఉండేది. సునీల్ బిశ్వాస్ ఇంట్లో 'అడ్డా' కు హాజరయ్యేది.

సునీల్‌బిశ్వాస్ ప్రముఖ సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్ సోదరుడు. సోదరులిద్దరినీ ప్రోత్సహించి తల్లి సంగీతం నేర్పించినా అనిల్ మాత్రమే సినిమాలలోకి వెళ్లాడు. సునీల్ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించేవాడు. యువ కళాకారులను తన ఇంటికి ఆహ్వానించేవాడు. అందరూ సరదాగా కూచుని కబుర్లు చెప్పుకోవడం, పాటలు పాడటం అనే 'అడ్డా' సాంప్రదాయం బెంగాలీలకు మహా ప్రీతిపాత్రమైనది.



## కిశోర్ గీతావళి

ఆ చల్ కే తుఝే మై లేకే చలూ
ఇక్ ఐసే గగన్ కే తలే
జహా గమ్ భీ నహో ఆసూ భీ న హో బస్ ప్యార్ హీ ప్యార్ పలే ॥ఆ చల్॥
సూరజ్ కీ పహలీ కిరన్ సే
ఆశా కా సవేరా జాగే 2
చందా కీ కిరన్ సే ధుల్‌కర్
ఘన్‌ఘోర్ అంధేరా భాగే 2
కభీ ధూప్ ఖిలే కభీ ఛావ్ మిలే
లంబీసీ డగర్ న ఖలే ॥జహా॥ ॥ఇక్ ఐసే॥
జహా దూర్ నజర్ దౌడాయే
ఆజాద్ గగన్ లహరాయే
జహా రంగ్ బిరంగే పంఛీ
ఆశా కా సందేశా లాయే ॥2॥
సపనోం మే పలీ హసతీ హో కలీ
జహా శామ్ సుహానీ ఢలే ॥జహా॥ ॥ఇక్ ఐసే॥

శైలేంద్ర రాసిన ఈ గీతానికి కిశోర్ కుమారే సంగీతం సమకూర్చి పాడేడు. తెర మీద అభినయించినది- కిశోర్, అతని కుమారుడు అమిత్. చిత్రం - 'దూర్ గగన్ కీ ఛావ్ మే'. ఆర్ట్ సినిమాగా ముద్రపడి హిందీలో పెద్దగా ఆడని ఈ సినిమాకథను ఆధారంగా చేసుకుని తెలుగులో, తమిళంలో నిర్మించిన 'రాము" మాత్రం సూపర్ హిట్ అయింది. శాస్త్రీయసంగీతం అభ్యసించకపోయినా కిశోర్ ఇటువంటి ఆణిముత్యాలవంటి పాటల కెన్నిటికో సంగీతం ఇవ్వగలిగేడు. ఇదే సినిమాలోని 'జిన్ రాతోంకో భోర్ నహీ', 'కోయీ లౌటా దే మేరీ బీతే హుయే దిన్' పాటలు కూడా ఎన్నటికీ మరుపురాని పాటలే!

సునీల్ ఇంట్లో జరిగే అడ్డాలకు తర్వాతికాలంలో ప్రముఖులైన చాలామంది యువతీయువకులు వచ్చేవారు. మాన్నా దే, పన్నాలాల్‌ఘోష్ (సునీల్ చెల్లెలు పరుల్ భర్త), గీతారాయ్(తర్వాత గీతాదత్ అయింది)... ఇలా ఎంతోమంది వచ్చే వారు. అక్కడికి కిశోర్ కూడా వచ్చేవాడు. అక్కడే రూమా అతనికి పరిచయమయింది. వీళ్లంతా చేరి పాటలు పాడేవారు. కిశోర్ రవీంద్రసంగీతం పాడితే రూమా డాన్సు చేసేది.

కిశోర్ లైవ్లీనెస్ చూసి రూమా చాలా ముచ్చటపడింది. ఇద్దరూ క్రమంగా ప్రేమలో పడ్డారు. పెద్దలతో చెబితే ఒప్పుకోరని భయం. ఎవరికీ తెలియకుండా రిజిస్ట్రారు ఆఫీసులో పెళ్ళి చేసుకుందామని అనుకుని వెళ్ళి అప్లికేషన్ పెట్టుకున్నారు. వాళ్ళు నోటీస్ బోర్డులో 'పేర్లుపెట్టి నెలరోజులు పోయిన తర్వాత రండి. ఎవరికీ ఏ అభ్యంతరం లేకపోతే పెళ్ళి చేసుకోవచ్చు' అన్నారు.

### టు మ్యారీ ఆర్ నాట్ టు మ్యారీ?

పనిగట్టుకుని రిజిస్ట్రారు ఆఫీసుకెళ్ళి నోటీసు బోర్డు ఎవరు చూస్తారులే అని వీళ్లనుకున్నారు కానీ అది అశోక్‌కుమార్ కంటపడింది. బొంబాయిలోని బాంద్రాలో ఏదో ఆస్తుల విషయమై రిజిస్ట్రార్ ఆఫ్ ప్రాపర్టీస్ ఆఫీసుకి అతను వెళ్ళాడు. మేరేజి ఆఫీసు పక్కనే ఉంది. యాదాలాపంగా చూడబోతే అక్కడ నోటీస్‌బోర్డులో వీళ్ళ పేర్లు కనబడ్డాయి.

ఇంటికి రాగానే(అప్పుడు కిశోర్ అన్నగారింట్లో ఉంటున్నాడు) అడిగాడు -"ఏమిటీ, నువ్వు పెళ్ళి చేసుకుంటున్నావా?" అని.

కిశోర్ తెల్లబోయాడు. విషయం బయటకు ఎలా పొక్కిందో అర్థం కాలేదు. అన్నగారు ఏమంటాడో సులభంగా ఊహించగలిగాడు. తనకు 21 ఏళ్లు. సినిమా ఫీల్డులో ఇంకా నిలదొక్కుకోలేదు. అప్పుడే పెళ్లెందుకు అంటాడు. రూమా సినీ నటి. అది కూడా ఒక అభ్యంతరం కావచ్చు. అందుకని నీళ్ల నమిలి, "అబ్బే, పెళ్ళేమిటి?" అనేశాడు.

"చాల్లే, బుకాయించకు. నాకళ్ళతో నేను చూశాను. - నోటీసు బోర్డు మీద మీ మారేజి నోటీసు అంటించి పెట్టారు." అన్నాడు అశోక్ కోపంగా.

"ఏమో మరి, ఎవరు పెట్టారో, ఎందుకు పెట్టారో నాకు తెలియదు." అని అడ్డంగా డబాయించాడు కిశోర్.కానీ అందరికీ తెలిసిపోయింది. ఇది ఒట్టి బుకాయింపేనని. ఇంట్లో చర్చ జరిగింది. తల్లితండ్రులిద్దరూ కిశోర్‌ను సమర్థించారు."పోన్లే, వాడికి ఇష్టమైన అమ్మాయిని చేసుకోనియ్యి. ఎలాగైనా బెంగాలీ అమ్మాయే కదా!" అన్నారు. దాంతో అశోక్ ఏమీ మాట్లాడలేక ఊరుకున్నాడు.

అన్నగారు సరేననకపోవడంతో కిశోర్‌కి జంకు పుట్టింది. పెళ్ళి చేసుకుందామా, మానేద్దామా అన్న మీమాంసలో పడ్డాడు. ఏం చేయాలో తేల్చుకోలేక పెళ్ళిరోజున మద్రాసులో సినిమా షూటింగుకి ఒప్పుకున్నాడు. డైరక్టరు సీను రీషూట్ చేయాలంటే మాట్లాడకుండా మళ్ళీ చేసాడు. అయినా టైము మిగిలిపోయింది. ఇక విమానంలో తిరిగివచ్చాడు. బొంబాయి చేరేసరికి సాయంత్రం అయింది. కుటుంబ సభ్యులెవరైనా ఎయిర్‌పోర్టుకి వస్తారేమోనని ఎదురుచూసాడు. ఎవరూ రాలేదు. ఇంటికి వెళ్లాలా? రిజిస్ట్రార్ ఆఫీసుకి వెళ్లాలా? "టు మ్యారీ ఆర్ నాట్ టు మ్యారీ?"

టాక్సీ ఎక్కి వోర్లీలోని ఇంటికి పొమ్మన మన్నాడు. దాదర్ దాకా వచ్చేసరికి మనసు మార్చుకుని బాంద్రాకు వెళ్ళమన్నాడు. అక్కడ రూమా వెయిట్ చేస్తోంది. లీగల్ ఫార్మాలిటీస్ పూర్తిచేసుకుని పెళ్ళి కానిచ్చేడు. ఇంత ఊగిసలాడుతూ చేసుకున్న పెళ్లి భవిష్యత్తు కూడా ఊగిసలాటలోనే పడింది.

### ఎమోషనల్ వెర్సెస్ రేషనల్

కిశోర్ తల్లితండ్రులు ఈ రకం పెళ్లికి ఒప్పుకోలేదు. శాస్త్రోక్తంగా పెళ్ళి చేసుకోమన్నారు. కిశోర్ చేసుకున్నాడు. చేసుకుని అన్నగారి ఇంటి నుండి విడిగా వచ్చి కాపురం పెట్టాడు. దహీశర్ అని బాంబే సబర్బ్, అక్కడ చిన్న ఇల్లు తీసుకుని రూమాతో కలిసి ఉండేవాడు. సంపాదన పెరగగానే

# కిశోర్ తీసిన సీరియస్ సినిమా

## దూర్ గగన్ కీ ఛావోం మేం...

నటుడిగా కిశోర్ నటించిన సినిమాలు ఎంత బాగున్నా, ఎంత హిట్ అయినా అవి ప్రధానంగా మసాలా సినిమాలే, వాటిల్లో అతను బఫూనరీ చేసి ప్రజలను నవ్వించాడు. అవాంత్ గార్డ్ అనే కొత్తరకం సినిమాలు ప్రపంచవ్యాప్తంగా ప్రేక్షకామోదాన్ని పొందుతున్న రోజుల్లో సత్యజిత్‌రాయ్ 'పథేర్ పాంచాలీ' తీసి భారతీయులు ఆ రకం సినిమాలు కూడా తీయగలరని అంతర్జాతీయ సినీరంగానికి నిరూపించాడు. ఆ సినిమా తీయడానికి సత్యజిత్ రాయ్ ఆర్థికంగా చాలా ఇక్కట్లు పడవలసి వచ్చింది. ఆ సినిమా నిర్మాణంలో ఉండగా కిశోర్, కేవలం రాయ్ మీద గౌరవంతో, 5 వేల రూపాయలు విరాళంగా ఇచ్చాడు. సినిమా పూర్తవగానే 1962 లో కలకత్తా వచ్చి చూసాడు. అంతకుముందు అలాటి సినిమాలు చూసి ఎరగకపోవడంతో కిశోర్ 'పథేర్ పాంచాలీ' చూసి వెర్రెక్కిపోయాడు.

తక్షణం బొంబాయి వచ్చి ఓ కెమెరాను చేతబట్టి, తన ఫ్రెండు ఇఫ్తికర్‌ను వెంటబెట్టుకుని బొంబాయి బయట వున్న బోరివిల్లి పార్క్‌కి వెళ్లి అక్కడ ఆకాశాన్ని, పక్షులను కెమెరాలో బంధించాడు. గ్లామర్‌తో సంబంధం లేకుండా చక్కటి కథా చిత్రాలు తీయవచ్చని అతనికి నమ్మకం చిక్కగానే తయారయిన చిత్రం - 'దూర్ గగన్ కి ఛావోం మే'. తన అభిరుచి ఇంకోరి నెత్తిన రుద్దకుండా స్వంతడబ్బుతో ఆ సినిమా తీశాడు. దర్శకత్వం, సంగీతం కూడా అతనివే. 1963లో మొదలుపెట్టి 1964లో విడుదల చేశాడు. కథకు కేంద్రబిందువు ఒక మూగ పిల్లవాడు. తల్లి మంటల్లో కాలిపోవడం చూసి మూగవాడైపోతాడు. తండ్రి ఆర్మీ నుండి తిరిగివచ్చి కుర్రవాడికి మాట తెప్పించే ప్రయత్నంలో ఊరూరూ తిరుగుతాడు. చివరికి విలన్ కారణంగా మరో అగ్నిప్రమాదం చూసి అరవడంతో కుర్రవాడికి మాట వస్తుంది.

సినిమాలో మనసును కదిలించే సంఘటనలు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా తండ్రీ కొడుకుల మధ్య ఉన్న ఎమోషనల్ ఎటాచ్‌మెంట్ కిశోర్ ఎంతో సమర్థవంతంగా తెరకు అనువదించ గలిగాడు. అవిటివాడయిన కొడుకును చూసి బాధపడే తండ్రి పాత్ర ఎంతో గొప్పగా పోషించాడు. ఈ రియలిస్టిక్ సినిమాకు అతనే స్వయంగా అందించిన సంగీతం చాలా చక్కగా జతపడింది.

కిశోర్ కుమార్ సరసన సుప్రియా చౌధురీ, విలన్‌గా ఇఫ్తికర్ నటించిన ఈ సినిమాలో ముఖ్యపాత్రధారి అయిన పదేళ్ల మూగబాలుడి పాత్ర వేయడానికి కిశోర్ తన తనయుడు అమిత్‌ను రప్పించుకున్నాడు. అతనూ అనితరసాధ్యంగా నటించాడు. సినిమా పూర్తి చేశాక తనను ఇన్స్పయిర్ చేసిన సత్యజిత్‌రాయ్‌కై ఒక ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేశాడు కిశోర్. సతీసమేతంగా వచ్చిన రాయ్ సినిమా చూసి కిశోర్‌ను అభినందించాడు. 'ఒక కమెడియన్ అంతరంగంలో ఇంతటి విషాద హృదయం ఉంటుందని నేనూహించలేదు. యూ హేవ్ డన్ ఎ గ్రేట్ జాబ్. ఈ లైన్ వదిలిపెట్టవద్దు. గో ఆన్.' అని అంటే కిశోర్ పొంగిపోయాడు.

ఆ తరువాత ప్రెస్ షో ఏర్పాటయింది. "నా సినిమా ఎలా వుందంటారు?" అని ఎంతో ఉబలాటంగా అడిగిన కిశోర్‌కు పాత్రికేయుల మౌనం నిరాశ కలగజేసింది. మర్నాడు ప్రెస్‌లో వచ్చిన రిపోర్టులు చూస్తే మరింత నిరాశ కలిగింది. జర్నలిస్టులంటే ఉదాసీనత కలిగింది. ఇబ్బంది ఏమిటంటే 'దూర్ గగన్ కీ ఛావోం మే' పూర్తిగా ఆర్ట్ సినిమా కాదు, పూర్తిగా కమ్మర్షియల్ సినిమా కాదు. రెండింటికీ మధ్యస్తంగా ఉంది. అటువంటి దాన్ని రిసీవ్ చేసుకోవడానికి ఆనాటి ప్రేక్షకులు గానీ, విమర్శకులు గానీ సిద్ధంగా లేరు.

సినిమా రిలీజవగానే కొడుకుని వెంటబెట్టుకుని కిశోర్ ఊళ్లో హాల్స్ చూడబోయాడు . కిశోర్ పేరు చూసి కామెడీ ఎక్స్‌పెక్ట్ చేసి వచ్చిన ప్రేక్షకులు సినిమా చూసి నిరుత్సాహపడ్డారు. రెండు వారాల తర్వాత గానీ సినిమా పికప్ కాలేదు. చివరకు పెట్టిన పెట్టుబడి తిరిగివచ్చేటంత సక్సెస్ మాత్రం అయింది. కిశోర్ అంతకుముందు తీసిన మూడు కమ్మర్షియల్ సినిమాలతో పోలిస్తే ఈ సినిమా మీద వచ్చిన ఆదాయం ఏ మాత్రం పోలదు.

తమాషా ఏమిటంటే అదే కథను ఎ.వి.ఎమ్. వాళ్లు కొని (కథ - జావర్ సీతారామన్ అని వేశారు) అనవసరమైన హాస్యసన్నివేశాలు చొప్పించి "రాము" అని తమిళంలో జెమినీగణేశ్‌ను, తెలుగులో ఎన్.టి.రామారావుతోనూ సినిమా తీస్తే ఆ రెండూ సూపర్, డూపర్ హిట్స్ అయ్యాయి.

అక్కణ్నుంచి జుహూ చర్చి దగ్గర చిన్న షెడ్ లాటిది తీసుకుని అక్కడికి మారిపోయాడు. అక్కడ ఉండగానే అతనికి సినిమాలలో సక్సెస్ వచ్చింది- 'బాప్ రే బాప్'(1954) హిట్ కావటంతో! 1955లో దగ్గరలో ఉన్న ఓ స్థలం తీసుకుని డబ్బు వచ్చినప్పుడల్లా కాస్త, కాస్త పెట్టుబడి పెడుతూ అక్కడ బంగళా కట్టుకున్నాడు.

ఆ విధంగా హౌస్ అమిరింది కానీ హోమ్ అమరలేదు. రుమాకు, అతనికి మధ్య పొసగలేదు. ఇద్దరి మెంటాలిటీలు పూర్తిగా విరుద్ధమయినవి కావడమే దానికి కారణం. కిశోర్ చాలా వింత



కిశోర్‌ను ఆర్ట్ సినిమా వైపు మళ్లించిన 'పథేర్ పాంచాలీ'. కిశోర్ ఈ సినిమాకు ఆర్థికసాయం చేసాడు.

మనిషి. అతను ఇంట్లో అందరికంటే చాలా చిన్నవాడు. తల్లితండ్రులకు ముదిమి వయసులో పుట్టినవాడు కావడం వల్ల చాలా గారాబంగా పెరిగాడు. భార్య కూడా తల్లిలాగే తనను అల్లారుముద్దుగా చూస్తుందని, తన అల్లరి భరిస్తుందని ఆశించాడు.

ఈలక్షణం ఆర్టిస్టులలో చాలా మందికి సహజ గుణం. వాళ్ళందరికీ అంతర్గతంగా ఇన్ సెక్యూరిటీఫీలింగు ఎక్కువ. లోకంలో అందరూ తమ గురించి పట్టించుకుని, తమ ఇష్టాయిష్టాలు, సమయా సమయాలు తెలుసుకుని వాటి ప్రకారం మెలగాలని, తమను అస్తమానూ మెచ్చుకుంటూ ఉండాలని, తప్పులు చేసినా అర్థం చేసుకుని తమను బుజ్జగించాలని అనుకుంటారు. అలా జరగకపోతే అలుగుతారు. లోకంపై కోపాన్ని చూపడం సాధ్యం కాదు కాబట్టి, అది ఇంట్లో వాళ్ళ మీద చూపుతారు. అందుకే చాలా మంది కళాకారుల వైవాహిక జీవితాలు భగ్నమవడం చూస్తుంటాం.



ప్రేరణ నిచ్చిన సత్యజిత్‌రాయ్

రూమా కూడా ఆర్టిస్టే కానీ కిశోర్‌స్థాయి ఆర్టిస్టు కాదు. పైగా సిటీలో పెరిగిన మనిషి కాబట్టి చాలా ప్రాక్టికల్ కూడా. గంభీర ప్రవృత్తికల ఆమెకు

కిశోర్ మోటు పద్ధతులు అసహ్యాన్ని కలిగించేవి. 'ఖాండ్వా నుండి వచ్చిన పల్లెటూరి గబ్బిలాయిరా వీడు' అనుకుందామె. అనుకుని అతన్ని 'సంస్కరించ'బోయింది.

ఆ సంస్కరించటం కూడా సున్నితంగా చేసివుంటే బాగుండేదేమో! "నీకు సరిగా మాట్లాడటం రాదు, ఎలా బిహేవ్ చేయాలో రాదు, నేను నేర్పుతాను, నేర్చుకో" అనేది. అది కిశోర్‌ను మరింత మండించింది. ఇంకా ఎదురు తిరిగాడు. 'నేనంటే ఇష్టంలేదు, నా బాధ పట్టించుకోదు, అర్థం చేసుకోదు.' అని తీర్మానించుకున్నాడు. సినిమాలలో అతని కెరియర్ అప్పటికి ఎగుడుదిగుడులుగా ఉంది. ఇంటికి వచ్చి కష్టం, సుఖం చెప్పుకునేందుకు భార్య కావాలి కానీ టీచరమ్మ ఎందుకు? అనుకున్నాడు అతను. అనుకుని దూరం దూరంగా మసలసాగేడు. రూమా కూడా కిశోర్ బాధ్యతారాహిత్యం, ప్రాక్టికల్ జోక్స్ నచ్చేవి కావు. పెళ్ళికి ముందు హుషారుగా అనిపించిన ప్రియుడు, మొగుడుగా ఇప్పుడు బోరు కొట్టేశాడు. "అస్సలు సీరియస్‌నెస్ లేదు. చిన్న పిల్లాడి రకం. మానసికంగా ఎదగలేదు. ఎరక్కపోయి కట్టుకున్నానురా వీణ్ని" అనుకునేది.

**విడాకులవైపు...**

1956-57 లో వాళ్లు బంగళాలోకి మారేరు. కిశోర్ తన తల్లితండ్రులను వచ్చి తమతో ఉండమన్నాడు. అప్పటివరకూ వాళ్లు పెద్దకొడుకు అశోక్ వద్ద ఉండేవాళ్లు. అప్పటినుండీ చచ్చిపోయేవరకూ వాళ్లు కిశోర్‌తోనే ఉన్నారు. ఆర్థికంగా బాగుపడ్డా, ఇంట్లో పెద్ద వాళ్లున్నా భార్యాభర్తల మధ్య పరిస్థితి మెరుగుపడలేదు. సాధారణంగా సినిమా హీరోలు వివాహేతర సంబంధాలు పెట్టుకుంటారు. కిశోర్ విషయంలో అటువంటి సమస్య రాలేదు. కానీ తాము 'కంపాటిబుల్' కాదన్న విషయం వాళ్లిద్దరికీ తెలిసిపోయింది. 'కిశోర్ లాటి ఇమ్మెచ్యూర్, ఫ్రివోలస్ ఫెలోతో కాపురం చేయడం అసాధ్యం'



తెరమీదనే కాదు నిజ జీవితంలో కూడా... కిశోర్ తిక్కవేషాలు భరించలేక అతని భార్య రూమా విడిచి వెళ్లిపోయింది. 'షరారత్' (1959) సినిమాలో ఓ దృశ్యం.

అని రూమా అనేది.

నిజమే, కిశోర్ తరహా చిన్నపిల్లవాడి తంతులా వుండేది. సమస్య వస్తే ఎదుర్కోవడం కంటె దాని నుండి పారిపోవడమే అతనికి వచ్చు. అందువల్ల వైవాహిక సమస్యను ఎలా పరిష్కరించాలో, భార్యతో ఎలా వ్యవహరించాలో అతనికి తెలిసేది కాదు. కానీ అతను ఎమోషనల్ టైప్. రూమా మూతి బిగించుకున్న కొద్దీ అతను మరింత ఆగడం చేసేవాడు. రూమా ఏమీ రియాక్ట్ కాకుండా ఉండి, పిచ్చాడితో ఓరిమి వహిస్తున్నాను అనుకునేది. నన్ను పట్టించుకోవడం మానేసింది అని కిశోర్ ఇంకా డిప్రెస్ అయిపోయేవాడు.

చివరికి పెళ్లయిన ఏడేళ్లకు రూమా ఇంటిని, భర్తను విడిచిపెట్టి కలకత్తా వెళ్లిపోయింది. బెంగాలీ సినిమాల్లో వేషాలకై ప్రయత్నించింది. ఇంకో అతన్ని పెళ్లి చేసుకుని రూమా గుహాఠాకుర్తా అయింది. ఇప్పటికీ సంగీతకచేరీలు నిర్వహిస్తూంటుంది. వెళుతూ, వెళుతూ రూమా అమిత్‌ను వెంటబెట్టుకు వెళ్లింది. కలకత్తాలోనే చదివించింది. అమిత్ సెలవల్లో తండ్రి దగ్గరకు వచ్చేవాడు. 19వ ఏట నుండి తండ్రి దగ్గరే పూర్తిగా ఉండిపోయాడు. కిశోర్‌కు, కొడుక్కు గట్టిబంధం ఏర్పడటానికి ఉపయోగపడినది - సినిమాయే! ఆ సినిమా పేరు - 'దూర్ గగన్ కి ఛావోం మే'.

అలా తన దగ్గరకి వచ్చేసిన కొడుకును ఇన్నేళ్ల తర్వాత పెళ్లి పేరుతో తనవైపు లాక్కోవడానికి రూమా ప్రయత్నిస్తోందని కిశోర్ భావించడమే ఆ రోజు అతను అంత వర్రీ కావడానికి కారణం. నిజానికి కిశోర్ వివాహమాడిన నలుగురు వనితలలో లీనా ఒకరే అతన్ని బాగా అర్థం చేసుకుని అతన్ని సుఖపెట్టినది. ఆమె అమిత్‌ను కూడా చాలా ఆదరంగా చూసింది. కిశోర్ మరణం తర్వాత కూడా అమిత్ తన సవతితల్లిని విడిచి తల్లి వద్దకు వెళ్లలేదంటేనే తెలుస్తోంది వారిద్దరి మధ్యా ఎంత అవగాహన ఉందో!

అమిత్‌ను నటుడిగా, గాయకుడిగా పైకి తీసుకువద్దామని ఓ పక్క తను ప్రయత్నిస్తూండగా తల్లిహోదాలో రూమా వచ్చి పెళ్లి సంబంధం పేరుతో అతన్ని ఎగరేసుకుపోతుందేమోనన్న చింత కిశోర్ గుండెనొప్పిని పెంచింది. ఆ రోజున అతని ప్రాణాన్ని హరించింది.

**-(ఇంకా వుంది)**

# పద్మనాభం



# ఆత్మకథ

**'తుకారాం' నాటకంలో నా మహదేవుని పాత్ర మధ్యలో చనిపోతుంది. మంచం మీద నుంచి స్టేజి మధ్యలో కింద పడుకోబెడతారు తుకారాం, జిజియాబాయి. శవంలా పడుకోవడంలో నాకు విషమ పరీక్ష ఏమిటంటే చిన్న పురుగులు కుట్టేవి. కదలకుండా వుండాలి. కదిలితే నాటకం అభాసుపాల వుతుంది. దుఃఖరస సీనులు నటిస్తూన్న సి.ఎస్.ఆర్. గారి దృష్టిని ఆకర్షించాలి. ప్రేక్షకుల దృష్టిని ఆకర్షించకూడదు. పెదాలు పెద్దగా కదలకుండా "మాస్టరుగారూ, పురుగు" అనేవాణ్ణి. ఆయన బాధ నటిస్తూ నా దగ్గరకు వచ్చి "కుమారా" అంటూ ఏవో డైలాగులు చెబుతూ పురుగును తీసిపారేసే వారు. ఆడియన్స్‌కి అది స్క్రిప్టులో భాగమే ననిపించేది. 'అయ్యో ఎంత బాధపడుతున్నాడు' అనిపించేది.**

## సీరియల్ 4



**సి.ఎస్.ఆర్.** గారితో నాకు పరిచయమవడంతో వారి లలిత కళామండలి వేసే నాటకం -'భక్త తుకారాం'లో తుకారాం కొడుకు మహదేవుడు పాత్రకు నన్ను తీసుకొన్నారు. ఆయనే ముఖ్యపాత్రధారి. వారి నాటకంలో నటవర్గం. బుచ్చన్న శాస్త్రి, మద్దాలి కృష్ణమూర్తి, ఎద్దు నాగేశ్వరరావు, పాదిలి కృష్ణమూర్తి, బండారు వెంకటేశ్వరులు, బాలకృష్ణ తుకారాం పాత్రలో లీనమై నటిస్తూ తన గానామృతంలో అలరించేవారు సి.ఎస్.ఆర్ గారు.

నేను పద్యాలు కూడా పాడాలి. గురువును వెక్కిరిస్తూ మోహనరాగంలో ఓ పద్యం పాడేవాణ్ని.

'అవని తిరి పెంపు తింటి
సౌఖ్యము మరగి హాయిగా భుజించి
సోమరులై మనంగా,
చదువు కలవారు సేయు
మోసంబుకాని ద్విజుల శూద్రుల
వారియే కల్పింపలేదే -

వారి ప్రతి నాటకాన్నీ తీక్షణంగా చూస్తూ భావయుక్తంగా, పట, పద్యం, డైలాగ్ ఏ విధంగా చెప్పి నటించాలి అన్నది మా గురువు సి.ఎస్.ఆర్ గారి దగ్గర నేర్చుకున్నాను.

భావయుక్తంగా పద్యం ఎలా పాడాలో నేర్పిన మహనీయుడు శ్రీ సి.ఎస్.ఆర్ గారు. నటన సి.ఎస్.ఆర్. గారు నేర్పితే ఆరోగ్య విధానం రఘురామయ్య గారు నేర్పారు. కోటిరత్నం గారి ఇంట్లో వున్నప్పుడు రఘురామయ్య గారికి శిష్యరికం చేశాను. ఆయన యోగాసనం, కసరత్తు చేశేవారు. శీర్షాసనం వేశేవారు. ఆయనకు మాలీసు చేశేవాణ్ణి! వారిని చూసి నేను కసరత్తు, శీర్షాసనం చేసేవాణ్ణి. ఆరోగ్యం కాపాడుకొనే విధానం వీరిని చూసి నేర్చుకున్నాను.

డ్రామాప్రదర్శన ఉన్నప్పుడు 5 రూపాయలు ఇచ్చేవారు. ఈ నాటకం ధర్మమాని ఆంధ్రదేశాన్ని పూర్తిగా చూసే భాగ్యం కలిగింది. మొదట ప్రదర్శన నెల్లూరు జిల్లా కొవ్వూరులో! నాటకం కాగానే నన్ను స్టేజిమీదకు వచ్చి పాడమన్నారు. వాల్మీకి రఘురామయ్య గారి 'పాదుకా పట్టాభిషేకం'లో పాట -' శ్రీహరి విలాసమేగా' పాడాను. చప్పట్లు మోగాయి.

తరువాత సి.యస్.ఆర్.గారి పద్యం - 'భీష్మ'లో కృష్ణుని పద్యం 'తేరి నిద్రించు కుంతీనందనుల లక్కయింట వసించి దహించునాడు.' పాడేరు. ఈ పద్యానికి ప్రజల స్పందన అమోఘం. వారి ఆనందానికి అంతులేదు. ఆ రోజుల్లో ప్రదర్శనంతా పెట్రోమాక్స్ లైట్ల వెలుగులోనే! నో ఎలక్ట్రిక్ లైట్స్, నో మైక్స్. అయినా, స్టేజి మీద నటుల హావభావాలు వెయ్యి మంది ప్రేక్షకులకు స్వచ్ఛంగా వ్యక్తమయ్యేవి.

ఈ విధంగా వారితో 50, 60 డ్రామాప్రదర్శనలు జరిగాయి. ఋష్యేంద్రమణి గారి ట్రూపులో పాదుకా పట్టాభిషేకం, సతీ


రమాప్రభతో...

సక్కుబాయి, హరిశ్చంద్ర, రంగూన్‌రౌడీలో నటించే అవకాశం వచ్చింది. కృష్ణ లీలలు లో గగ్గయ్య గారు కంసుడు. ఋష్యేంద్రమణి గారి భర్త రామకృష్ణగారు హార్మోనియం. ఏ గగ్గయ్య గారి పద్యాలు అనుకరించేవాడినో అదే గగ్గయ్య గారితో నటించే అవకాశం వచ్చింది. ఎంత అదృష్టం!

శ్రీ ఘంటసాల గారు వీరి ట్రూప్‌లో నటించారు. అప్పుడే వీరి పరిచయం జరిగింది. యిద్దరం కొన్ని నాటకాలలో కొంతకాలం నటించాము. మదనపల్లెలో 'శ్రీకృష్ణలీలలు' 2వ కృష్ణుడు నేను, 3వ కృష్ణుడు బి.ఎన్.రాజు. కారణాంతరాల వల్ల ఈయన రాలేదు. అప్పటికప్పుడు నేను 3వ కృష్ణుడు ప్రాక్టీసు చేశాను.

ఇలా నాటకాల సంగతి నడుస్తూంటే, సినిమాల సంగతి చూద్దాం.

నా రెండవ సినిమా రేణుకా ఫిలిమ్స్ 'త్యాగయ్య'! చలపతిరావు గారు ప్రొడక్షన్. జిక్కి, హనుమంతరావు, అశ్వత్థామ, ఘంటసాల గారు ఇందులో వున్నారు. నాకు ఛాన్సు ఎలా వచ్చిందంటే అది శ్రీ నాగయ్య గారి సినిమా. వీరిని చూడడానికి రెండు రోజులు పట్టింది. చివరికి ఎలాగో వారి దర్శనం అయింది. వారి ఎదుట 'సుమంగళి'లో వారి పాటే పాడాను. మెచ్చుకొని ఆశీర్వదించి 25 రూపాయలు జీతం ఇచ్చి త్యాగయ్య శిష్యుని పాత్ర యిచ్చారు. అంతవరకు బాగానే ఉంది కానీ న్యూటోన్ స్టూడియోకు శిష్య పాత్రధారులందరినీ తీసికెళ్లి చెట్ల క్రింద కూర్చోబెట్టి మంగలివానిచే అందరికీ గుండ్లు గీస్తున్నారు. ఇక నా వంతు వస్తూ వుంది. తప్పించుకొని పారిపోదాం అనిపించింది. ఇలా ఆలోచించేలోగానే మంగలి రావడం, గుండు గీయడం జరిగి పోయింది. ఏడుపు మొహం పెట్టి యిల్లు చేరాను. కోటిరత్నం, రఘురామయ్య, అన్నపూర్ణమ్మ, బాబ్జీ, కస్తూరి శివరావు అందరూ ఒకే నవ్వు! ఏం చేస్తాం? వేషం కావాలంటే ఇవి తప్పనిసరి!

3వ సినిమా 'ముగ్గురు మరాఠీలు' ప్రతిభా ఫిలిమ్స్ వారిది. శ్రీ ఘంటసాల బలరామయ్య గారు నిర్మాత, దర్శకులు. ఇందులో మొదట మరాఠీ నారాయణ రావుగారు. కుమారి గారు మా అమ్మ వేషం వేశారు. నా పాత్ర తంతీరావు. ప్రధానమైన వేషం. 60 రూపాయలు జీతం. ఆ తరువాత సినిమాలు చాలానే వచ్చాయి.నారద-నారది, యోగివేమన..ఇలా...

యోగివేమన కె.వి.రెడ్డి గారు వాహినీకి తీసిన చిత్రం. దానిలో భిక్షకులుగా నేనూ, రంగూన్ రామారావు పాడి యాక్టు చేసిన పాట -

'వచ్చే పోయే దారిలోన కోతి వున్నది.
కోతి మూతిలోన జగజ్యోతి వున్నది.
నాదమినవే మనసా
నాదమినవే
నాదమినవే నాదమిని
మోదమంది, మోదమినవే'

సినిమాలలో వచ్చిన డబ్బును జాగ్రత్త పెట్టుకుని ఇంటికి పంపించేవాణ్ని. నేను పంపిన డబ్బులతో శింహాద్రిపురంలో వున్న ఇల్లు 800 వందలకు కొన్నాం. అద్దె బాధ వదిలింది.


'శ్రీకృష్ణతులాభారం'లో మీనాకుమారి, వాణిశ్రీ లతో...

1947 'రాధిక'లో కృష్ణుడు పాత్ర వచ్చింది. దర్శకులు, కవి బ్రహ్మ సదాశివబ్రహ్మం గారు. రాధిక ఆర్. బాలసరస్వతి వేశారు. మహావిష్ణు, రఘురామయ్య, నారదుడు రామకృష్ణశాస్త్రి, నల్ల రామమూర్తి, దాసరి కోటిరత్నం, పృథ్వి వెంకటేశ్వరులు, ఎస్.బాలసరస్వతి కూడా వేషాలు వేశారు., సంగీతం హనుమంతరావు. బాల సరస్వతితో కలిసి పాటలు, పద్యాలు నేనే పాడాను. అంతే కాకుండా ఒక గోపబాలునికి ప్లేబాక్ పాడాను. అడయార్ నెప్ట్యూన్ స్టూడియోలో షూటింగ్ జరిగింది. దీనికి నిర్మాతలు సుబ్బయ్య గారు, మల్లము కోవూరు నివాసస్తులు. మిడ్లాండ్‌లో ప్రీవ్యూ యిచ్చారు. ఎందరో పెద్దలు వచ్చి చూశారు. ముఖ్యంగా ఎల్.వి.ప్రసాదు గారు. అందరూ నన్ను అభినందించారు.

తరువాత 'భక్తశిరియాళ'లో చిన్నచిరుతొండడు పాత్ర. అన్ని సినిమాలలో నా పేరు టైటిల్స్‌లో మాస్టర్ పద్మనాభరావు అని వుండేది. తరువాత వచ్చిన జెమినీ వారి 'వింధ్యరాణి' నిర్మాత ఎస్.ఎస్.వాసన్, దర్శకులు సి.పుల్లయ్య) లో రాజేశ్వరరావు గారి సంగీత సారధ్యంలో నా పాట నేనే పాడాను.

1948లో కొంత గ్యాప్ వచ్చింది. జెమిని వారి 'వీరకుమార్' చిత్రానికి ఎగ్రిమెంటు చేసి కొంత అడ్వాన్సు తీసుకొని శింహాద్రిపురం వెళ్లాను.


కృష్ణుడిగా...

అక్కడ టెంటు సినిమాహాలుకు రాధిక, భక్తశిరియాళ వచ్చాయి. అమ్మ, నాన్న, తమ్ముళ్ళు, చెల్లెళ్లు, వూరి ప్రజలు అందరూ వచ్చి ఉత్సాహంగా చూశారు.

ఇప్పుడొక విషాద సంఘటన జరిగింది. 6 ఏళ్ల తమ్ముడు ప్రభాకరుడు, ఇంకో తమ్ముడు

పురుషోత్తం, నేను చావిడిలో నిద్రపోతున్నాం. తేలు ప్రభాకరుని తలకు కుట్టింది. ఆ తరువాత పురుషోత్తం చేతికి కుట్టింది. రాత్రి ఏమీ చేయలేక, మరుసటి రోజు తెల్లారాక ఇన్‌జెక్షన్ యిప్పించారు. పురుషోత్తం కోలుకున్నాడు కానీ ప్రభాకరం విషయంలో ప్రయోజనం లేకపోయింది. వాడు కళ్లు తేలేసి 'నేను బానగుట్ట శివుని దగ్గరకు పోతున్నాను' అని అంటూ ప్రాణాలు విడిచాడు. నేను వాణ్ని భుజాలపైన వేసుకొని స్మశానానికి వెళ్లి తలారి రామునితో ఖననం చేయించాను!

ఈ దెబ్బ చాలనట్టు అతి కొద్ది కాలానికే చెల్లెలు రాజేశ్వరి జబ్బు చేసి మరణించింది. ఆ పిల్లను కూడా నేను మోసికెళ్లి ఖననం చేయించాను. దాంతో నాకు విరక్తి కలిగింది. ఎంత డబ్బు సంపాదించినా, ఏం పేరు తెచ్చుకున్నా మనిషిగతి ఇంతే కదా అనిపించింది. ఇక నాకు డ్రామాలు, సినిమాలు అచ్చి రావని నిర్ణయించుకున్నాను.

గుంతకల్ దగ్గిర కొనకండ్ల కు మా చిన్నాన్న గారు శ్రీనివాసరావు కరణం. ఆయన దగ్గర కరిణీకం నేర్చుకుందామని వెళ్లాను. నాకు వీరన్నగట్టు పల్లె కరణంగా మునీప్ వున్నది. మా తాతయ్య గారు (నాన్న నాన్న) యిక్కడనే వున్నారు. తెనాలి రామలింగని కథలు, మిడతంబొట్లు కథలు చెప్పి నవ్వించేవారు. ఎద్దుల వ్యాపారం చేసి శింహాద్రిపురంలో వున్న యిల్లు, భూములు అమ్మి వీరన్న గట్టు పల్లెల్లో కరణంగా వుండి రిటైరు అయ్యారు. భోగభాగ్యాలలో తులతూగిన బసవరాజు వంశం ధర్మం కోసం పేదరికాన్ని కూడా చవిచూసింది. పెద్దల అడుగుజాడల్లో కరణం అవుదామని నేను అనుకుంటే విధి మరోలా తలచింది.

ఫొటోకర్టెసీ: సంజయ్‌కిశోర్

**(-ఇంకావుంది.)**

---

పి.ఎ.పి.వారి 'కులగోత్రాలు'లో పద్మనాభంది చాలా మంచిపాత్ర. కామెడీ చేస్తూనే కథతోనూ, కథనంతోనూ సంబంధం ఉన్న పాత్ర. మిలటరీలో ఎక్కువకాలం వుండి వస్తాడు కనుక పాత్ర స్వభావంలో కాస్త దూకుడు, నిర్మొహమాటం ఉంటాయి. గిరిజతో పెళ్లయిన తర్వాత "ఈ బారు జడ ఏంటి బాబ్డ్ హెయిర్ చేసుకో రాదా"అని అంటాడు."చీరా గీరా తీసెయ్ గౌను వేసుకో" అని బలవంత పెడతాడు. ఆ ప్రకారం ఆమె అలంకరించుకుని వస్తే ఆమెతో పాడే డ్యూయెట్టే ఇది.

కొసరాజు రాయగా యస్.రాజేశ్వరరావు స్వరపరచగా పి.బి.శ్రీనివాస్, జమునారాణి ఆలపించిన ఆ పాట ఇది...



అ: రావే రావే బాల హలో మై డియర్ లీలా ॥2॥
ఇటు రావే ఇటు రావే ఐ లవ్‌యూ
ఆ: పోవోయ్ పోవోయ్ బావా ఎందుకీ పెడత్రోవ ॥2॥
ఈ పల్లెల్లో మన పల్లెల్లో ॥2॥
సాగవీ వేషాలూ చాలు నీ సరదాలు ఇక చాల్లే...ఇక చాల్లే
అ: టిప్పు టాపు దొరసాని అప్‌టు డేటు అలివేణి ॥2॥
ఈ రోజుల్లో మన పోజుల్లో ॥2॥
ఇది దొరల ఫేషనే రాణి
ఆ: పెద్దవాళ్లు చూస్తారు దేహశుద్ధి చేస్తారు ॥2॥
పచ్చిపచ్చి లవ్ చూపావంటే పిచ్చాస్పత్రిలో వేస్తారు॥2॥
ఈ పల్లెల్లో మన పల్లెల్లో ॥2॥
సాగవీ వేషాలూ చాలు నీ సరదాలూ... ఇక చాల్లే
అ: ఐ లవ్ యూ... ॥రావే॥
అ: తప్పేమున్నది మేడమ్ నాతో షికారు రావడమ్
ఆ: ఇక్కడ పుట్టిన వాళ్లం ఎందుకు మనకీ మేళం,
ఈ పల్లెల్లో మన పల్లెల్లో ॥2॥
సాగవీ వేషాలూ చాలు నీ సరదాలూ... ఇకచాల్లే...
అ: ఐ లవ్ యూ...రావే రావే బాలా
ఆ: పోవోయ్ పోవోయ్ బావా ॥రావే॥

ఇదిలా ఉండగా ఆ సినిమాలోనే అతని మామగారు(గుమ్మడి)ని ఉబ్బెయ్యడానికి రేలంగి, సూర్యకాంతం కలిసి షష్టిపూర్తి ప్లాన్‌చేసి పొగడ్తలతో ఊదరగొట్టేస్తుంటే పద్మనాభం ఇదంతా గమనించి తన వంతు పొగడ్తగా మంచి సీస పద్యాన్ని అందుకుంటాడు. 'మా మామగారి మీసం పై సీసం' అని అంటాడు."అదేంటబ్బాయ్...బంగారంలాంటి మా నాన్న మీసం మీద సీసం పోస్తానంటావ్?" అని సూర్యకాంతం తప్పుపట్టబోతే "సీసం అంటే ఆ సీసం కాదు ఒదిన గారూ...సీస పద్యం...చిత్తగించండి" అంటూ సీస పద్యాన్ని పాడి అవతలివారిని చిత్తుచేస్తాడు.

ఈ సీస పద్యాన్ని శ్రీ శ్రీ రాశారు. రాజేశ్వరరావు స్వరపరచగా పి.బి.శ్రీనివాస్ పాడేరు.

కారు మబ్బుల బారు సొరునేలెడి తీరు
కోరమీసము పొందు కోరుకొందు
మృగరాజు జూలునే తెగనాడ జాలు! నీ
ఘనమీసము పసందు కనులవిందు
గండుచీమల దండు కదలాడినటులుండు
నీ మీసము తెరంగు నీలిరంగు
హా! మెలిబెట్టి నిలబెట్టు మీసాల రోసాలు
గగనమండలముపై కాలు దువ్వు
ఎవరు మోయుచున్నారు?
ఈ అవని బరువు
ఆదిశేషుడా? కూర్మమా? కాదు కాదు
అష్టదిగ్గజ కూటమా? అదియు కాదు
అయితే మరేదయ్యా?
మామ మీసాలే భువికి శ్రీరామరక్ష!




విడుదల : ఆదిత్య

వెల : 38/- రూ




ఉదయ్‌కిరణ్, ఆర్తీఅగర్వాల్ జంటగా నూతన దర్శకుడు పరుచూరి మురళి దర్శకత్వంలో ప్రముఖ నిర్మాత ఎం.ఎస్.రాజు సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్ పతాకంపై నిర్మించిన 'నీ స్నేహం' ఆడియో విడుదలయింది. ఆర్.పి.పట్నాయక్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. ఇందులోని పాటలన్నిటినీ సిరివెన్నెల సీతారామశాస్త్రి రాశారు.

రాజేష్ పాడిన 'ఏమో అవునేమో నిజమేమో' పాటహాయిగా సాగే పాట. ఉత్తరాది స్థాయిలో ట్యూన్ జతపడ్డ ఈపాటను వింటుంటే 'పూలలో తేనె ప్రేమ'(జెమిని) వంటి పట్నాయక్ పాతపాటలు గుర్తొస్తాయి. ప్రతి పాటలోను ప్రేమభావాన్ని రకరకాల ఎక్స్‌ప్రెషన్స్‌తో సీతారామశాస్త్రి అక్షరీకరిస్తున్న పద్ధతి చూస్తే ప్రేమకు సంబంధించిన పాటలన్నిటి మీద ఒక థీసిస్ రాయదల్చుకుంటే ఈయన రాసిపాటలే చాలు డాక్టరేట్ తెచ్చుకోవడానికి... అని అనిపిస్తుంది.

ఉష పాడిన పాడిన 'చినుకు తడికి చిగురు తొడుగు పువ్వమ్మా' పాట - పట్నాయక్, ఉష సినీ సంగీతజీవితంలో ఒక ల్యాండ్‌మార్క్‌గా చెప్పుకోదగ్గ పాట, ఔత్సాహిక గాయనీమణులకు మెప్పులను, బహుమతులను ఇప్పించగల సత్తా ఉన్న పాట. హిందోళరాగచ్ఛాయలలో సెమీ క్లాసికల్‌గా సాగిన ఈ పాటకి స్వరకర్త పట్నాయక్ అంటే నమ్మబుద్దెయ్యదు. అందుకు ప్రధాన కారణం - ఇంతవరకు అతను స్వరపరచిన గీతాల పోకడ వేరు, ఈ పాట తీరువేరు కనుక! ఇలాంటి పాటలు మరో నాలుగైదు వివిధ రాగాలలో భవిష్యత్తులో పట్నాయక్ స్వరరచనచేసి తన సామర్ధ్యాన్ని నిరూపించుకోవలసిన అవసరం ఈపాట ఏర్పరిచింది అని అంటే దాన్ని పట్నాయక్ కామెంట్‌గా కాకుండా కాంప్లిమెంట్‌గా తీసుకోగలిస్తే 'హాసం' విశ్లేషిస్తున్న ఈ ఆడియో రివ్యూకి ఒక సార్ధకత ఏర్పడినట్టే.

ఆర్.పి.పట్నాయక్, రాజేష్ పాడిన 'కొంత కాలం కిందట/బ్రహ్మదేవుని ముంగిట/రెండు ఆత్మలు కోరుకున్నవి ఓ వరం' అనే పాట చక్కని కట్స్‌తో క్యాచీగా రూపొందింది. ఒకసారి వింటేచాలు వెంటనే 'హమ్' చెయ్యకుండా ఉండటం కష్టం. ఎటువంటి సబ్జెక్ట్ అయినా సరే డిఫరెంట్ ఎక్స్‌ప్రెషన్‌తో రాయగలగటం సీతారామశాస్త్రి గారి కున్న వరం అని పాటకూడ నిరూపిస్తుంది.

ఆర్.పి.పట్నాయక్ పాడిన 'వేయి కన్నులతో/వేచిచూస్తున్న/తెరచాటు దాటి చేరదా నీస్నేహం' పాట బొత్తిగా, పూర్తిగా పట్నాయక్ మార్కుపాట... 'చిత్రం'లోని ఊహల పల్లకిలో' పాటకి ఈ పాటకి ఎంతో తేడా ఉన్నాసరే టేకాఫ్‌నోట్స్ ఒకేలా ఉన్నాయనిపిస్తుంది.

ఇదే పాటని మరో రెండు చరణాలతో ఉష, పట్నాయక్ పాడేరు. మొదటి వెర్షన్ కన్నా సెకండ్ వెర్షన్ మరింత వినసొంపుగా ఉండటానికి కారణం వెనక జతపడిన తాళగతి, ఇంటలూడ్స్! 'ఎన్ని జన్మలైనా పోల్చుకోలేనేమో వెతికేది నీలోని నన్నేనని' అనే ఎక్స్‌ప్రెషన్ సాహితీపరంగా సెపరేటు మార్కులు కొట్టేస్తుంది.

కెకె పాడిన 'ఊరుకో హృదయమా ఉప్పెనై రాకుమా' పాట కూడా పట్నాయక్ బ్రాండ్ పాట...! పాట వింటుంటే 'జయం' లో ప్రేమా ప్రేమా ప్రేమా నీకు ఇది న్యాయమా' పాట గుర్తొస్తూ ఉంటుంది.

రాజేష్, ఉష పాడిన 'ఇలా చూడు అరచేత వాలింది ఆకాశం' పాట రియల్ మెలొడి సాంగ్! ప్రతి మాటా స్పష్టంగా వినబడేలా, హాయిగా పాడుకునేలా స్వరపరచిన ఈపాట కూడా వింటుంటే 'చిత్రం' లోని 'ఊహల పల్లకిలో' పాట గుర్తొస్తుంది. అయినా ఈ రెండు పాటల మధ్య చాలా తేడాఉంది.

మరొక రివ్యూ 36వ పేజీలో...






"ఏం జరుగుతోందక్కడ?. మేకను బలి ఇస్తున్నారు". ఒక ఆసామి దారిన పోతున్న దానయ్యను అడిగాడు.

"అదా!వన్య మృగ సంరక్షణ కేంద్రంఆఫీస్ ప్రారంభోత్సవం చేస్తున్నారు అందుకని..."



వీధి చివర టైలర్ దగ్గరకు వెళ్లి "నాతో సినిమాకు వస్తావా"! అని అడిగింది కావేరి.

"వస్తాను... ఏ సినిమాకు వెళ్దాం?" అడిగాడు టైలర్ ఆనందంతో ఎగిరి గంతేస్తూ

"అందులో ఒక పాటలో నగ్మా వేసుకున్న బ్లౌజ్ మోడల్‌లో ఒకటి నాకు కుట్టి పెట్టాలి వచ్చి చూడు". తాపీగా చెప్పింది కావేరి.



"కానీ కట్నం లేకుండా మీ అమ్మాయిని పెళ్లిచేసుకోవడానికి ఒప్పుకున్నారా! ఎంత అదృష్టవంతులండీ! మీరు."

"ఆ! ఏం అదృష్టం! ప్రతీనెలా వాళ్లింటి కరెంట్ బిల్లు నన్ను కట్టమని కండిషన్ పెట్టారు."



ఒక రాజకీయ నాయకుడు ఒక స్లమ్ ఏరియాకు వెళ్లాడు. అక్కడ పేదలందరనీ పలకరిస్తూ ఒక పేదరాలి ఇంటికి వెళ్లాడు.

పేదరాలు రాజకీయ నాయకుడ్ని చూసి చాలా సంతోషించి టీ చేసి అక్కడ తాగి పెట్టిన ఎంగిలి కప్పులో పోసేసి "తాగండి బాబుగారు, ఎప్పుడు రాని మీరు మొదటిసారిగా మాఇంట్లో కాలు పెట్టారు. టీ తాగండి బాబుగారూ" అంటూ ఆయన్ని బలవంతపెట్టింది.

ఆయన చూస్తూ చూస్తూ ఎంగిలి కప్పులో పోసిన టీ తాగలేక, వద్దంటే మిగతా అందరూ ఏమనుకుంటారో అని కక్కలేక, మింగలేక కాసేపు ఆలోచించి అందరూ కుడిచేత్తో కప్పుహేండిల్ పట్టుకుని తాగుతారు కదా! పోనీ కనీసం ఎడంచేత్తో కప్పు హేండిల్ పట్టుకుని తాగితే కొంచెం ఎంగిలైనా తగ్గుతుంది కదా! అనుకుని ఎడంచేత్తో కప్పు హేండిల్ పట్టుకుని టీ తాగాడు.

టీ కప్పు క్రింద పెట్టిన వెంటనే "మీకు కూడా నాలాగే ఎడం చేత్తో కప్పు పట్టుకుని తాగే అలవాటుందా బాబుగారూ" అని అడిగింది పేదరాలు ఆప్యాయంగా .



"ఏవేం నరళా! పక్కింటాయన నీకు చీర కొనిచ్చాడు అన్న విషయం మీ ఆయనతో చెపుతానన్నావు చెప్పావా! ఏమన్నారు?" ఆతృతగా అడిగింది సరోజ.

"ఆ! చెప్పానే! ఆ విషయం చెప్పగానే ఆయన బాగా సీరియస్ అయ్యి పక్కింటాయనను బాగా తిట్టారే!"

"ఏమని"

"ఏంటయ్యా! ఆ రంగు చీరలు మా ఆవిడకు ఇప్పటికే నాలుగు ఉన్నాయి. మళ్లీ అదే రంగు చీర కొన్నావేంటి? అని బాగా తిట్టి వచ్చారే!".



"అమ్మా! దువ్వెన ఎక్కడ పెట్టావు. కనిపించటం లేదు" అని అరిచింది కరుణ.

పక్కింటావిడతో కబుర్లు చెపుతున్న సత్యవతి "చూడమ్మా! ఫ్రిజ్ పక్కన వాషింగ్ మిషన్ మీదగాని,గ్రైండర్ పక్కన ఉన్న డైనింగ్ టేబుల్ మీదగాని, కలర్ టి.వి. దగ్గరగాని, సి.డి. ప్లేయర్ దగ్గరగాని, బీరువా పక్కన ఉన్న డ్రెసింగ్ టేబుల్ మీదగాని ఉందేమో! చూడమ్మా!" అని అక్కడి నుంచే అరచి చెప్పింది.

ఈ జోక్స్ పంపిన వారు: పరస లక్ష్మి దేవి
హైదరాబాద్







" నా కంపెనీలో కేవలం పెళ్ళయిన వాళ్ళకే ఉద్యోగాలిస్తాను".

"ఎందుకని?"

"వాళ్ళయితే ఎన్ని తిట్టినా అలవాటుగా సర్దుకుపోతారు!




ఈ రోజుల్లో బ్యాంకులకు ఉదహరణ

" ఏంటి నా చెక్ ఫండ్స్ లేవనే కారణంగా తిరిగొచ్చింది? నా ఆకౌంట్‌లో 20 లక్షలు ఉందిగా" కోపంగా అడిగాడు ధనరాజ్.

"ఫండ్స్ లేనిది మీ అకౌంట్‌లో కాదు సార్, మా బ్యాంక్‌లో" చేతులు నులుముకుంటూ చెప్పాడు మేనేజర్.




ఒక పత్రిక ఉత్తమ వ్యక్తి పోటీలు నిర్వహిస్తోంది. ఆ పోటికి వచ్చిన ఒక అప్లికేషన్ యిలా ఉంది.:

అయ్యా ! నేను పొగతాగను, మద్యం ముట్టను, పరాయి ఆడవాళ్ళను కన్నెత్తైన చూడను రోజంతా పనిచేస్తాను. సినిమాలు చూడను రోజూ టైమ్‌కి త్వరగా నిద్రపోయి ఉదయాన్నే టైమ్‌కి లేస్తాను. నేను గత ఐదు సం॥ల నుండి యిలాగే ఉన్నాను. కాకపోతే ఒకే ఒక యిబ్బంది. మీరు నన్ను ఉత్తమ వ్యక్తిగా ఎన్నిక చేసినాకూడా నేను వచ్చి బహుమతి తీసుకోలేను. ఎందుకంటే వీళ్ళు యింకో రెండేళ్ళ వరకు నన్ను విడుదల చేయరు".

"మా జూలో పులులు,మేకలు ఒకే బోన్‌లో కలిసి ఉంటాయి తెలుసా!" గొప్పగా చెప్పాడు జూ అధికారి.

"అదెలా సాధ్యం?" ఆశ్చర్యపోతూ అడిగాడు విసిటర్.

"ఏముంది? వారానికోసారికొత్త మేకల్ని లోపల వదలడమే!" కూల్ చెప్పాడా అధికారి.





ఒక కంపెనీ మేనేజర్ కి రోజూ తన దగ్గర పని చేసే వాళ్ళకి ఉచిత సలహాలిస్తూ విసిగించడం అలవాటు.:

"ఎప్పడన్నకున్న పని అపుడే చేయాలి" అని ఒక రోజు తన దగ్గర చేసే బాయ్‌తో చెప్పాడు.

అదే రోజు లంచ్ టైమ్‌లో కంపెనిలోని డబ్బంతా తీసుకుని ఉడాయించాడా బాయ్.



"కమలా! మనకిద్దరికి గ్రీన్‌కార్డ్ వచ్చేసింది. యిక మనం అమెరికన్ సిటిజెన్స్" అన్నాడు. కమలాకర్ ఆనందంగా.

"అయితే ఈ అంట్లు ఇక మీరే కడగాలి" అంది చేతిలో గిన్నెలు వదిలేస్తూ.



"నా కుక్క ఎంత తెలివైందో తెలుసా! నేను షాపు కి కోడి గుడ్ల కోసం పంపితే ఏవి తాజాగా ఉన్నాయో చూసి మరి తెస్తుంది" అన్నాడు సుబ్బారావు.

"నా కుక్కయింకా తెలివైంది . షాపుకి వెళ్ళి నా బ్రాండ్ సిగరెట్లు, లైటర్ అన్నీ జాగ్రత్తగా తెస్తుంది" గొప్పగా చెప్పాడు అప్పారావు.

మరి నీ కుక్క సంగతేంటి? యిద్దరూ రంగారావుని అడిగారు.

"మీ కుక్కలు వెళ్ళే స్టోర్‌ని నా కుక్కే నడుపుతుంది'' కూల్‌గా చెప్పాడు రంగారావు.

ఈ జోక్‌లను పంపినవారు : టి.శైలజ, హైదరాబాద్





# ఎక్కడైనా..., ఎప్పుడైనా... నీదాన ననే

## షకీరా

1977 లో కొలంబియాలోని బర్రాన్క్విలాలో తల్లిదండ్రులకు ఎనిమిదవ బిడ్డగా పుట్టిన షకీరా ఇంత పేరుప్రఖ్యాతులు సంపాదిస్తానని అనుకుని ఉండదు.

ఆమె తండ్రి విలియం ముబారక్ అమెరికన్-లెబనీస్ సంతతివాడు. తల్లి నిడియా రిపోల్ కొలంబబియా దేశానికి చెందినది. తల్లిదండ్రులిద్దరూ కూతురిని సంగీతం నేర్చుకోమని ప్రోత్సహించారు. ఈ చైల్డ్ ప్రాడిజీ అనేక జాతీయ ఎవార్డులు కూడా గెలుచుకుంది కానీ స్కూలులో బృందగానాలలో పాడనిచ్చేవారు కారు. ఎందుకంటే ఈమె గొంతెత్తిందంటే తక్కిన ఎవరి వాయిసూ వినబడేది కాదు!

సోనీ కొలంబియా వారు ఆమె మొదటి ఆల్బమ్ 'మాజియా' (మాజిక్) రిలీజ్ చేసేనాటికి ఆమెకు 13 ఏళ్లు. ఆ ఆల్బమ్ కొలంబియా దేశవాసులు బాగా రిసీవ్



8 యేళ్ల వయసులోనే షకీరా తొలిపాట రాసింది
11 యేళ్ల వయసుకే గిటార్ వాయించసాగేది
13 వ యేట సోనీ కొలంబియా వారి ఆర్టిస్టుగా ఎంపికయింది
13 వ యేట తొలిఆల్బమ్ రిలీజయితే 21 వ యేట నాలుగో ఆల్బమ్!
నాల్గవ ఆల్బమ్ ఉత్తర దక్షిణ అమెరికాలలో మల్టీ ప్లాటినమ్ కట్ చేసింది
అంతేకాదు, యూరోప్‌లోని స్పెయిన్‌లో ప్లాటినమ్ డిస్క్ కట్ చేసింది

'ఐ యామ్ వెరీసారీ
అన్నాగా వందోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి
ఇప్పుడు యూత్ తెగ పాడుకుంటున్న పాట ఇది.
ఈ పాట
'నువ్వే..నువ్వే' సినిమాలోనిది.
ఆ పాటకు ప్రేరణ
'వెనెవ్వర్...వేరెవ్వర్' అనే షకీరా పాట.
ఈ పాట వున్న
'లాండ్రీ సర్వీస్' (2001)
అనే ఆల్బమ్ షకీరా తొలి ఇంగ్లీషు ఆల్బమ్
ఆ ఆల్బమ్‌తోనే ఆమె ఒక్కసారిగా అంతర్జాతీయ పాప్‌రంగంలోకి దూసుకువచ్చింది.
సెప్టెంబరు నెల పాప్ ఆల్బమ్ అమ్మకాలలో ఆమె బ్రిట్నీ కంటె ముందుంది.

### షకీరాకు అమిత ఖ్యాతి తెచ్చిన పాట

### Whenever, Wherever

Lucky you were born that far away
So we could both make fun of distance
Lucky that I love a foreign land for
The lucky fact of your existence
Baby I would climb the Andes soley
To count the freckles on your body
Never could imagine there were only
Ten million ways to love somebody
Lo ro lo le lo le 2
Can't you see... I'm at your feet
Whenever, Wherever
We're meant to be together
I'll be there and you'll be near
And that's the deal my dear
thereover hereunder,
you'll never have to wonder
We can always play by ear
But that's the deal my dear
Lucky that my lips not only mumble
They spill kisses like a fountain
Lucky that my breasts are small and humble
So you don't confuse them with mountains
Lucky I have strong legs like my mother
To run for cover when I need it
And these two eyes are for no other
The day you leave we'll cry a river
Lo ro lo le lo le 2
At your feet...I'm at your feet
Whenever.....dear
They're over, you're under
You'll never ...my dear
Lo ro lo le lo le 2
We can fly, say it again
Lo ro lo le lo le
Tell me one more time
That you'll live
Lost in my eyes
Whenever...my dear
Thereover hereunder
You've got me head over heels
There's nothing left to fear
If you really feel the way I feel
Whenever..my dear
They're over, you're under
You've got...I feel

చేసుకున్నారు. 16 ఏళ్ల వయసుకే కొలంబియా ప్రతినిధిగా ఆమెను స్పెయిన్‌లోని మ్యూజిక్ ఫెస్టివల్‌కు పంపబోయేరు గానీ వయసు చాలదని స్పెయిన్ వాళ్లు ఒప్పుకోలేదు.

షకీరా రెండో ఆల్బమ్ 'పెలిగ్రో' (డేంజర్) కూడా సక్సెసయినట్టే. కానీ చదువు పూర్తి చేయడానికి ఆమె ప్రాధాన్యం ఇచ్చింది. మళ్లీ స్కూలు కెళ్లి హైస్కూలు చదువు పూర్తయ్యాక గానీ ఆల్బమ్‌లు చేయలేదు.

కొలంబియా వాళ్లు ఆమెను పాప్ స్టార్ చేద్దామని చూసినా, షకీరా మాత్రం రాక్, లాటిన్ సంగీతాలకు మొగ్గు చూపింది. తన మూడో ఆల్బమ్ ' Pies Descalzos'(1995) లో తను అనుకున్న, తనకు నచ్చిన రాక్, లాటిన్, పాప్ సంగీతాలమీద ఆధారపడిన ట్యూన్‌లతో పాటలు కట్టింది. అది బ్రహ్మాండమైన హిట్ అయింది. అది 8 దేశాలలో నంబర్ వన్ స్థానం సంపాదించుకుంది. నాలుగు మిలియన్ల కాపీలు అమ్ముడుపోయింది. ఆ పాప్యులారిటీతో 2 సంవత్సరాల పాటు షకీరా ఇంటర్నేషనల్ టూర్ చేసింది. బ్రెజిల్‌లోని ఫాన్సు కోసం తన పాటల పోర్చుగీస్ రీమిక్స్‌లు చేయవలసివచ్చింది. వెనువెంటనే "Estoy Aqui', 'Donde Estas Corazon' సింగిల్స్ కూడా వెలువడ్డాయి.

సంగీతంతో బాటు షకీరా కొలంబియా టీవీలో 'ఎల్ ఒయాసిస్' అనే సోప్ ఒపేరాలో 1994 నుండి 1997 వరకు నటించినా, ఆమె సంగీతం పైనే తన దృష్టి కేంద్రీకరించింది. 1998 లో రిలీజయిన నాలుగో ఆల్బమ్ 'Donde Estan Los Ladrones?' తో ఆమె తారాపథానికి ఎగిరింది.

2001 లో రిలీజయిన "లాండ్రీ సర్వీస్" ఎంత సక్సెసయిందో వేరే చెప్పనక్కరలేదు! దాని ఫాలో అప్ సింగిల్ 'అండర్‌నీత్ యువర్ క్లోత్స్' డబుల్ ప్లాటినమ్ కట్ చేస్తోంది. ఇక పాప్ రంగంలో షకీరాకు ఎదురేముంది?

**కమ్యూనికేటర్ ఫీచర్స్**



❀ షకీరా పూర్తిపేరు షకీరా ఇసాబెల్ మెబారక్ రిపోలీ.

❀ షకీరా అంటే అరబిక్ భాషలో 'ఉమన్ ఫుల్ ఆఫ్ గ్రేస్' అని అర్థం.

❀ వరల్డ్ మ్యూజిక్ ఎవార్డ్సలో లాటిన్ ఫిమేల్ ఆర్టిస్ట్ ఆఫ్ ది ఇయర్ గా ఎన్నికయింది

❀ కొలంబియన్ ప్రభుత్వం ఆమెను గుడ్‌విల్ అంబాసిడర్ గా నియమించింది "ఎరా ఆఫ్ ది రాకెరా" అన్న కవర్ స్టోరీ వేసినప్పుడు టైమ్ మేగజైన్ ముఖచిత్రంపై షకీరా ఫోటో వేసింది.

❀ ' నా పాటలు నేను రాసుకోవలసినదే! ఇంకోళ్లు రాస్తే బాగోదు' అంటుందామె!

❀ ఆమె మొదటి ఆల్బమ్‌లోని పాటలు ఆమె 8 నుండి 15 ఏళ్ల వయసులో ఉండగా రాసినవే!




## మహామేధావి రాంబాబు!



నండూరి పార్థసారథిగారు సృష్టించిన విలక్షణ హాస్యపాత్ర రాంబాబు! రాంబాబు ఓ 20 ఏళ్ల కాలేజీ కుర్రవాడు. 'సుజనమిత్ర' అనే లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డెయిలీ ఫ్రమ్ చింతల్‌బస్తీ (సర్క్యులేషన్ 2 వేల కాపీలు)లో పార్ట్‌టైము ఉద్యోగం. తన అరకొర తెలివితేటలతోనే తను మహామేధావిననుకుంటాడు రాంబాబు. ఇంగ్లీషు, తెలుగు సరిగా రాక కొంత, 'స్వేచ్ఛా'నువాదాల వల్ల కొంత, కుతర్కం వల్ల కొంత, అమాయకత్వం, అజ్ఞానం, అతితెలివి వల్ల కొంత - రకరకాలుగా తనకు తెలియకుండానే బోల్డంత హాస్యాన్ని పంచాడు రాంబాబు. 'రాంబాబు డైరీ' (రెండవభాగం)లో వింత ఆలోచనా ధోరణికి కొన్ని ఉదాహరణలు:

★ మూడు కోతుల బొమ్మ నీతి నేర్పుతుందంటే నేను నమ్మను. ఆ లెక్కన ప్రపంచంలోని గుడ్డివాళ్ళు, చెవిటివాళ్ళు, మూగవాళ్ళు అంతా నీతిమంతులే అయ్యుండాలి. అసలు దేవుడు కళ్ళు, చెవులు, నోరు ఇచ్చింది దేనికి? అన్నీ చూసి, అన్నీ విని ఏది మంచో, ఏది చెడో విచక్షించుకుని, మంచిని మాట్లాడాలి. వాటిని మూసుకుంటే మంచిని కూడా చూడలేము, వినలేము, మాట్లాడలేము.

★ కృతి యొక్క టెక్నిక్ తెలిసిపోయింది. ఇందులో పల్లవి, అనుపల్లవి చెరోలైను, చరణం మూడు, నాలుగు లైన్లు వుంటాయి. తిప్పి తిప్పికొడితే అంతా కలిసి ఐదారు లైన్లు. ఆ తర్వాత పాడేదంతా స్వరకల్పనే. దాని సంగతి కచేరీ చేసే గాయకుడు చూసుకుంటాడు. మనకేం సంబంధం లేదు. మినీ కవితలాగా ఓ ఐదారు లైన్లు రాసి పడేస్తే మన పని తీరిపోతుంది.



ఇన్నాళ్ళూ మినీ కవితలతో టైము వేస్టు చేశాను. శుభ్రంగా కృతులు రాసి వుంటే బోలెడు కీర్తి ప్రతిష్టలు వచ్చి వుండేవి.

★ "ఇప్పుడు నేను మహామహుణ్ణి కాను... నిజమే. కాని ఎప్పటికీ కాలేనని ఎలా చెప్పగలవు? మా తాతగారు ఎనభై యేళ్లు బతికాడు. ఇప్పుడు నాకు ఇరవయ్యేళ్ళు. ఇంకో యాభై, అరవయ్యేళ్లకైనా మహామహుణ్ణి కాలేక పోతానా? యాభయేళ్ళకైనా నేను మహావాగ్గేయకారుణ్ణి కాకపోతే యింకెందుకు వేస్టు?" అన్నాను.

★ "ఏమిటోరా... మాలాంటి ఇంటలెక్చువల్స్‌కి ఎంత సేపూ ఉన్నత విషయాలే తప్ప చిన్నచిన్న విషయాలు తెలియవు. గాంధీ గారికి చాప్లిన్ ఎవరో తెలీదుట" అన్నాను.

★ అసలు నా సొంత ఆత్మసాక్షే నన్ను సమర్థించక పోతే భాస్కర్రావు ఆత్మ, సారధి ఆత్మ, బాబూరావు ఆత్మ సమర్థిస్తాయా?




మహేష్‌బాబు,ఆర్తీ అగర్వాల్ జంటగా-దర్శకుడు కె.రాఘవేంద్రరావు సమర్పణలో-శోభన్ దర్శకత్వంలో-ఆర్.కె.ఫిలిం అసోసియేట్స్ పతాకంపై నిర్మాత కె.కృష్ణమోహనరావు నిర్మించిన 'బాబీ' ఆడియో క్యాసెట్ విడుదలయింది. మణిశర్మ ఈ ,చిత్రానికి సంగీత దర్శకుడు.

నూతన రచయిత శక్తి రాయగా శంకర్‌మహదేవన్ పాడిన 'ఈజండా పసిబోసి చిరునవ్వురా' అనే పాటతో మొదలవుతుంది. ఎ.ఆర్.రెహమాన్ స్వరపరచిన 'వందేమాతరం' పాట నడకను, రిథమ్‌ను గుర్తుచేస్తూ ఉన్నా స్వతంత్ర ప్రతిపత్తి ఉండేలా రూపొందింది ఈపాట. మణిశర్మ, శక్తి, శంకర్‌మహదేవన్ ముగ్గురూ పాట విజయాన్ని సమానంగా అందుకునేలా ఉంది ఈ పాట. ముఖ్యంగా రెండో చరణానికి ముందు సమకూర్చిన ఆర్కెస్ట్రైజేషన్‌లో సన్నాయికి, శాక్స్‌కి కలిపి భేటీ వేసిన మణిశర్మ రసజ్ఞతను మెచ్చుకోకుండా ఉండలేం.

సుద్దాల అశోక్ తేజ రాయగా బాలు, సునీత పాడిన 'కళ్ళల్లో ద్రాక్షరసం' పాట భలేరంజైన పాట - బృందావన సారంగ రాగచ్ఛాయలతో మొదలైన ఈ పాటలో రచనలోను, స్వరరచనలోనూ ఎన్ని సొగసులు అమిరాయో వాటన్నిటినీ బాలు, సునీత తమస్వరాల ద్వారా అతి'లబ్జుగా' అందించారు.

చిర్రావూరి విజయకుమార్ రాయగా కల్పన పాడిన 'లోకంపీకే నరకాలి పెట్రోలేసీ కాల్చాలి' అనే పాట తెలుగు సినీ సంగీతంలోని పాప్ ఒరవడి లో ఓ కొత్త ప్రయోగంగా చెప్పుకోవాలి. ప్రముఖ పాప్ గాయని జెన్నిఫర్‌లోపెజ్ పాడిన 'మైలవ్ డోన్ట్ కాస్ట్ ఎ థింగ్' పాటకు అనుసరణే అయిన - ఎవరెస్ట్‌నే కోక్‌టిన్ చేసి రెయిన్‌బోనేమో స్ట్రాచేసి సూరీడుని పూల్‌చేసి తాగించటం; చుక్కలుకోసి ఫ్రైచేసి మెరుపుల నూడుల్సు చేసి చంద్రుడికి ఆకేసి తినిపించటం లాంటి అబ్‌స్ట్రాక్ట్ భావాలు, పదిమందికై నువు ఖైదు కారాదు వంటి



విడుదల : సుప్రీమ్
వెల : 38/- రూ

ఎమోషనల్ బ్లాక్ మెయిలింగ్‌ని బద్దలుకొట్టే వాక్యాలు వీటన్నిటికీ పాప్‌స్టయిల్‌లో అక్షరరూపం ఇవ్వటంలో చిర్రావూరి విజయకుమార్ చూపిన ప్రతిభను ప్రశంసించి తీరాలి. అలాగే కల్పన పాడే పద్ధతి కూడా దర్శకుడు శోభన్ అనుకున్న రీతికి తగిన కిక్ ఇచ్చేవిధంగానే వుంది.

భారతీబాబు రాయగా మనో పాడిన 'పుల్లనీ పుల్లట్టు పంటి కంటగానే జీవ చచ్చిన జన్మకే జీవమొచ్చెరా' పాట టేస్టున్న హుషారైన పాట. అలనాటి 'మాయాబజార్' లోని 'వివాహ భోజనంబు' నుంచి ఇవాళ్టి ఈ 'పుల్లనీ పుల్లట్టు' వరకు తిండికి సంబంధించిన ఏపాటనయినా అద్భుతంగానే తయారుచేసారు మనవాళ్ళు. మనో కూడా కంఠాన్ని కొంత బిగించి పాడినా భలే కసిగా పాడేడనిపిస్తుంది. రెండోచరణానికి ముందు వయొలిన్ కాంబినేషన్‌తో మణిశర్మ సమకూర్చిన ఇంటర్ల్యూడ్ పాట ట్యూన్‌తో సహా ఆకట్టుకుంటుంది.

శక్తి రాయగా రంజిత్, హరిహరన్ పాడిన 'అడుగు అడుగు గుండెనడుగు' పాట చాలా మంచి పాట. ఒంటరిగా ఆలపించుకుంటే ఏవేవోలోకాలకు తీసుకుపోదగ్గ శక్తి వున్న పాట. ఈ పాట ను వింటుంటే-కొలోనిల్ కజిన్స్ ఆల్బమ్‌లో 'కృష్ణ నీవేగమె బారో' పాట, త్రీబదర్స్ అండ్ ఎ వయొలిన్ ఆల్బమ్‌లో పాటల్ని పాడించిన పద్ధతి ఇవన్నీ గుర్తొచ్చినప్పుడు -మనకంటూ ఆ పద్ధతిలో ఓ పాటుంటే ఏంపోయింది... మన సంగీతంలో మరొక ప్రక్రియ చోటు చేసుకుంటుంది కదా అని అనుకోగలిస్తే - ఈ 'అడుగు అడుగు' పాటని మరింత ఎంజాయ్ చెయ్యొచ్చు. రెండో చరణానికి ముందు మణిశర్మ సమకూర్చిన ఇంటర్ల్యూడ్‌ని బాగా గమనిస్తే - అవకాశం ఇస్తే రెహమాన్ లెవెల్లో ప్రయోగాలు చేయగల మణిశర్మ మనకున్నాడు అని అనిపించి గర్వంగా ఫీలయి తీరతాం.

శక్తి రాయగా మల్లికార్జున్, కల్పన పాడిన 'లాలు దర్వజ కాడి నా ముద్దుల రాంబాయి' పాటని- జానపద ధోరణిలో సాగుతూ చెవికి ఏమాత్రం ఇబ్బందినీ కలిగించని పాటగా చెప్పుకోవాలి. పాట మధ్యలో కాస్త డబుల్ మీనింగ్ చమత్కారం లాంటిది చోటుచేసుకున్నా పాటకు అమరిన మిగిలిన హంగుల మధ్య అది కొట్టుకుపోతుందనే ఆశిద్దాం.

టోటల్‌గా 'బాబీ' ఒక మంచి ఆల్బమ్‌గా పేరుతెచ్చుకుంటుంది.

## రచన: శక్తి (1) గానం : శంకర మహదేవన్

ప: ఈ జండా పసిబోసి చిరునవ్వురా దాస్య సంకెళ్లు తెంచిందిరా
ఈ జండా అమరుల తుది శ్వాసరా రక్త తిలకాలు దిద్దిందిరా !
ఇల స్వాతంత్రపోరాట తొలిపిలుపురా మనకెనలేని త్యాగాల ఘనచరితరా!
తన చనుబాలతో పోరు నేర్పిందిరా! ఉరి కొయ్యల్ని ఉయ్యాల చేసిందిరా!
ఆ తెల్లోడి గుండెల్ని తొలిచేసిన అమ్మరా
వందేమాతరం మనమే ఈ తరం వందేమాతరం పలికే ప్రతినరం ॥ఈ జండా॥
చ: శాస్త్రానికి జ్ఞానానికి ఆదిగురువురా మనదేశం మానవాళికే వైతాళిక గీతంరా భారతం
ధర్మానికి,సత్యానికి జన్మభూమిరా మనదేశం ఎన్నో మతాల సహజీవన సూత్రంరా భారతం
ఆ దైవం మనకోసం సృష్టించే ఈ స్వర్గం ఈ ప్రాణాలు పోసింది ఆ తల్లిరా
తన దేహాన్ని ధైర్యాన్ని పంచిందిరా! మనమేమిస్తే తీరేను ఆ ఋణమురా!
ఇక మనకేమి ఇచ్చిందనడగొద్దురా భారతీయులుగా పుట్టాము ఈ జన్మకిది చాలురా!
వందేమాతరం మనమే ఈ తరం వందేమాతరం పలికే ప్రతినరం ॥ఈ జండా॥
చ: పిచ్చికుక్కలా ఉగ్రవాదమే రెచ్చిపోయి కాటేసినా
వెన్నుజూపని ఉక్కుసైన్యానికే సలామురా! మంచు మల్లెల శాంతి కపోతం
నెత్తుటి తడిలో తడిసినా చెక్కుచెదరని ఐకమత్యమొకటే సవాలురా!
మానవుడే మా వేదం మానవతే సందేశం
మా శతకోటి హృదయాలదొక మాటరా!
ఉక్కుపిడికిలితో అణచేము మీబలుపురా!
చావు ఎదురైన భయపడదు మా గుండెరా!
శత్రువెవడైనా తలవంచదీ జెండారా
ఫిరంగుల్ని ఎదిరించి తొడగొట్టి నిలిచిందిరా
వందేమాతరం మనమే ఈ తరం వందేమాతరం పలికే ప్రతినరం ॥ఈ జండా॥

## రచన: సుద్దాల అశోక్ తేజ (2) గానం : ఎస్.పి.బాలు, సునీత

ప/అ: వా_ వారెవ్వా..వవ్వారెవా అ: వా_వారెవ్వా వా_వవ్వారెవా ॥3॥
చ/అ: కళ్లలో ద్రాక్షరసం, ఒళ్లంత చెరుకురసం
పరువం దానిమ్మరసం చిట్టి పెదవి తేనెరసం వా..వా..
దీన్ని పట్టబోతె పాదరసంరా..
ఆ: సూపు సపోట రసం వయసే బత్తాయి రసం
నవ్వే నారింజ రసం నీటుగాడు నిమ్మరసంరా వా..వా..
దీడె కొంటెతనం శొంటి రసంరా
అ: వా...వారెవ్వా...వవ్వారెవా
ఆ: వా...వారెవ్వా...వవ్వారెవా
చఆ: ఆ పక్క మాయక్క ఎన్నెల్లోగుమ్మడి
ఈ పక్క మాసెల్లి ఎన్నెల్లోగుమ్మడి
నడిమద్దెన నేను ఎన్నెల్లోగుమ్మడి
నిదురోత మా గదిలో ఎన్నెల్లోగుమ్మడి ఓ ఓ
సిమ్మసీకటిలోన కూ..కూ..కూ
తిన్నగా నాకాడికొచ్చి కూ..కూ...కూ
బుగ్గనిమరగలవానువు వా..వా.. ముద్దులెట్టగలవానువ్వు
అ: తలుపు కిర్రుమనకుండా గురివిందా గుమ్మడి
తైలాలు పోసిపెట్టు గురివిందా గుమ్మడి
గొళ్లాలు ఎయ్యకుండా గురివిందాగుమ్మడి
దగ్గరగ ఏసిపెట్టు గురివిందా గుమ్మడి ఓ ఓ ఓ



గోరువెచ్చని ఊపిరికే
వేలికొసల చిరుతాకిడికే
మేను మెరుపులా మెరిసింది
ఈడు మెలికలే తిరిగింది
చెలి తుంటరి నవ్వులకే
తలుపు తీయని కౌగిలికే
వయసు భగ్గున మండింది
తియ్య తియ్యగా కాల్చింది
చిగురాకులాగ నా ఒళ్లే సెగ చిమ్మి ఒణుకుతూవుంది
తమకాన్ని రేపే నీ పెదవి నవనాడులాపుతూ వుంది
నా..నరం నరం..జివ్వుంది తనువుతో అనుభవం అడిగింది ॥అడుగు॥

## రచన: శక్తి (6) గానం : మల్లికార్జున్, కల్పన

అ॥ ఏ పిల్లా పిల్లా లస్కరు ఎల్లా లగ్గొని పిల్లా
లడాయి పిల్లాబడాయి పిల్లా సరసని పిల్లా
సోకుల పిల్ల పిల్లా పిల్లా.
వ॥ లాలు దర్వాజ కాడి నా ముద్దుల రాంబాయి ॥3॥
లాల్ లాల్ తొట్టిరో లగజినకరి పట్టిరో
లగో జిగో బొమ్మరో లోలాకు గుమ్మరో ॥లాలు॥
చ॥ రాయె రాయె పిల్లా రాలుగాయి పిల్లా
ముందరుండే బతుకు ముందుకెయ్యవే అడుగు
చింత ఎందుకు పిల్లో ఓ చిన్నదానా చిందులెయ్యవో పిల్లో ఓ కుర్రదానా
ఆ॥ అడుగు వెయ్యాలంటే కాళ్లు వణుకుతుంటే పెదవి విప్పాలంటే అదురుతుంది గుండే
చెప్పలేని భయం ..ఓ చిన్నవాడా తొలచి వేస్తూవుంది....ఓ కుర్రవాడా
అ॥ ఏ..దమ్ములుంటే చాలే పిల్లా
రెండే రెండంట చావూ బ్రతుకంట ఇంకేం లేదంట జీవితమంటే
కలిసే బ్రతుకైనా కలిసే చావైనా వదలను నీచేయి ఏదేమైనా
కో॥ ॥కలిసే॥
ఆ॥ ఏ చార్మినార్ చౌరస్తాలో నా ముద్దుల రాంబాబు
చాందినీలకొస్తివి పిలగో నా ముద్దుల రాంబాబు
లాలు లాలు పిల్లడో లొల్లాయి పొరడు
లొల్లి పెట్టే గుంటడు లవ్వంటూ వదలడు
కట్టు కట్టు బండి కోడెట్ల బండి
ఇంపైనా బండి ఇరుసెయ్యని బండి
బండెక్కెయ్ పిల్లగో ఓ చిన్నవాడా
కోరుగెళ్లర పిల్లగో ఓ కుర్రవాడా
అ॥ మూల మలుపుల కాడా ఎత్తువొంపులకాడ
కోడుకొండలకాడా మోట బాయి కాడా
బండి బద్రం పిల్లో ఓ చిన్నదానా
గుండె పదిలం పిల్లో ఓ కుర్రదానా
ఆ॥ ఏయ్... నువ్వే నాతోడై వుంటే...
ఒక్క రోజే చాలు వొద్దు వెయ్యి స్వర్గాలు
నీ గుండె సవ్వడినై వుంటానంటా
అ॥ ఒక నవ్వే చాలు గెలిచొస్తా లోకాలు
గుండెనిండా నువ్వే వుంటానంటే (3) ॥లాలు॥
ఆ॥ ॥లాలు పిల్లడు॥ అ॥లాలు॥ ఆ॥లాలు పిల్లడు॥



## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (1) గానం : రాజేష్, ఉష

ప: ఏమో అవునేమో నిజమేమో..
నాలో మైమరపే ఋజువేమో
ఏంచేసిందో ఆ చిన్నది
ప్రేమించేసానంది మది..
తనపేరైనా అడగాలన్నా ఎదరుంటేనా...
చెప్పమ్మా.. వెన్నెలమ్మా.. ఎవ్వరే.. ఆ జాబిలి.. (2) ॥ఏమో॥
చ: ఒక్కటే జ్ఞాపకం ఆమెతో పరిచయం
మబ్బులో మెరుపులా తగలటం
అక్కడే ఆ క్షణం మొదలు ఈ లక్షణం..
నిద్రలో నడకలా సాగటం
ఆ మెరుపు కంట పడకుంటే..
తన జంట కలసి నడవందే
ఈ మరపు వదలనంటుందే ఇంకెలా..
చెప్పమ్మా ఓ పావురమా.. ఆమెతో ఈ సంగతి.. (2) ॥ఏమో॥
చ: ఆమెనే వెతకటం అందుకే బతకటం
కొత్తగా ఉన్నదీ అనుభవం
ప్రేమనే పిలవటం ప్రేమనే తెలపటం
బొత్తిగా నేర్పదీ సతమతం
తనకంటి చూపులో మౌనం
చదివేదెలాగ నా హృదయం..
తన గుండె గూటిలో నే వాలేదెలా..
చెప్పమ్మా.. కలవరమా.. ఆమెతోనే అలజడి.. ॥ఏమో॥

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (2) గానం : ఉష

ప: చినుకు తడికి చిగురు తొడుగు పువ్వమ్మా..
ఎవరి కనుల చిలిపి కలవు నువ్వమ్మా..
మువ్వలే మనసుపడు పాదమా
ఊహలే ఉలికిపడు ప్రాయమా..
హిందోళంలా సాగే అందాల సెలయేరమ్మా
ఆమని మధువనమా..ఆమని మధువనమా... ॥చినుకు॥
సరిగసా సరిగసా రిగమదని
సరిగసా సరిగసా నిదమదని
సాస నీని దాద మామ గమదని రిసదా
నిని దద నిని గగ నిని దద నిని గగ
సగమగ సనిదని మదనిస నిస గసగా
చ: పసిడి వేకువల్లు పండువెన్నెలలు
పసితనాలు పరువాల వెల్లువలు
కలిపి నిన్నుమలిచాడో ఏమో బ్రహ్మ..
పచ్చనైన వరిచేల సంపదలు



## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (6) గానం : ఉష, ఆర్.పి.పట్నాయక్

ప/ఆ వేయికన్నులతో... వేచిచూస్తున్న
తెరచాటు దాటి చేరదా నీస్నేహం
కోటి ఆశలతో... కోరుకుంటున్న
కరుణించి ఆదరించదా నీస్నేహం
ప్రాణమే నీకూ... కానుకంటున్నా..
మన్నించి అందుకోవా నేస్తమా...
చ: ఎప్పటికి.. నా మదిలో కొలువున్నది నువ్వైనా..
చెప్పుకునే వీలుందా ఆ సంగతి ఎపుడైనా
రెప్పదాటి రానసే స్వప్నమేమి కానని ఒప్పుకుంటే నేరమా
తప్పుకుంటే న్యాయమా ఒక్కసారి... ఒక్కసారి...
అ: ఒక్కసారి అయినా చేయి అందించి ఈ వింత దూరాన్ని కరిగించుమా ॥వేయి॥
చ/అ:ప్రతినిమిషం నీ ఎదుటే నిజమై తిరుగుతు లేనా..
నీ హృదయం ఆ నిజమై నమ్మను అంటూ వున్నా
వీడిపోని వీడలా వెంటవుంది నేనని
చూడలేని నిన్నెలా కలుసుకోను చెప్పుమా
ఎన్ని జన్మలైనా పోల్చుకోనేమో వెతికేది నీలోని నన్నేనని ॥వేయి॥

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (7) గానం : రాజేష్, ఉష

ప: ఇలాచూడు అరచేత వాలింది ఆకాశం
ఇదేనాడు అనుకోని అనురాగ సందేశం
ఈ అనుభవం వెన్నెల వర్షం ఎలా తెలపటం ఈ సంతోషం
ఓ.. హనీ
ఐ లవ్ యూ
ఓ.. హనీ
ఐ నీడ్ యూ
చ: నమ్మనంటావో ఏమో నిజమే తెలుసా
అమృతం నింపె నాలో నీ చిరుస్పర్శ
ఆ: ఒప్పుకోలేవో ఏమో మురిసే మనసా
రెప్పనేదాటి రాదే కలలో ఆశ
అ: పొద్దే రాని నిద్దర్లోనే ఉండిపోని నిన్నేచూసే కలకోసం
సర్లేకాని చీకట్లోనె చేరుకోని... నువ్వుకోరె అవకాశం...
తక్కువేం కాదులే ఈ జన్మలో ఈ వరం ॥ఇలాచూడు॥
చ: వానలా తాకగానే ఉరిమే మేఘం...
వీణలా మోగుతుంది ఎదలో రాగం...
ఆ: స్వాగతం పాడగానే మదిలో మైకం...
వచ్చి ఒడి చేరుతుందా ఊహా లోకం...
ఉన్నట్టుండి నిన్నట్నుండి రాజయోగం దక్కినంత ఆనందం
అయ్యోపాపం ఎక్కడ్లేని ప్రేమరోగం.. తగ్గదేమో ఏమాత్రం
తానుగా చేరగా ప్రియమైన ప్రేమాలయం... ॥ఇలాచూడు॥

ఊ ఊ ఊ ఏయే ఏయేయే
టేకిట్ ఈజీ.ఏయేయే.. ఏయేయే..
టేకిట్ ఈజీ బేబీ.. ఊఊఊ ఏయేయే టేకిట్ ఈజీ (4)
లోకం పీకే నరకాలి పెట్రోలేసి కాల్చాలి ఈ సృష్టికే ప్రతి సృష్టిచేయాలి
డబ్బెంతుంటే ఏంలాభం కొనడం కష్టం సంతోషంఈ హిస్టరీ తిరగేసి రాసేద్దాం
నలుగురి కోసం బతకొద్దు పెద్దలమాటే వినవద్దు పదిమంది కై నువ్వు కారాదూ ఖైదూ
ఇండియన్ కల్చర్ వదిలేసి
వయసుని కంప్యూటరైజ్ చేసి
కలలే కను కళ్లే కెమరా చేసి..

## రచన: భారతి బాబు (4) గానం: మనో

ప॥ పుల్లనీ పుల్లట్టు పంటికంటగానే జివచచ్చిన జన్మకే జీవమొచ్చెరా
ఇది అట్టంటే ॥పుల్లనీ॥
ఏసేటి అట్ల మీద యావ పుట్టగానే ఏసీలో తిండి మీద ఎగట పుట్టేరా ॥పుల్లనీ॥
ఫైవ్ స్టార్ మీద బెట్టు మన అట్టే బెస్టు
మీ అందరి మీద ఒట్టు మినపట్టే టేస్టు ॥ఫైవ్‌సార్॥ ॥పుల్లనీ॥
చ॥ ఆకి రోలు లోని పిండి రవ్వలోన కలిపి
రేకు పెనం మీదన రవ్వంత నూనె దులిపి
కట్టె పొయ్యిమీద దాని అట్ల కాగడతో కాల్చి
పొడికారం పైనచల్లి పొగ సూరకుండతీసి
కాలుతున్న అట్టు ముక్క నాలిక మీదెట్టుకుంటే॥2॥
నసాళానికెక్కి మంచి వుషారు పుట్టిస్తదిరా పుల్లట్టు అబ్బబ్బ.. ॥పుల్లనీ॥
చ॥ బర్గర్లు పిజ్జాలు దీనిముందు దిగదుడుపు
నూడుల్స్, చికెన్‌రోల్స్ అరగవురా పరగడుపు
హాట్ డాగ్స్ బర్గర్‌లని ఇంగిలిపీసు మరిగినోడు
ఫాస్ట్‌ఫుడ్ తిన్నాక టేస్టు మరిచిపోతాడు.
తెలుగింటి పుల్లట్టును తిన్నోడు ఎవడైనా (2)
పదేళ్లయినా మరచి పోలేడు పదే పదే అడుగుతాడు పుల్లట్టు...అట్టు...అట్టు..అట్టు..॥పుల్లనీ॥

## రచన: శక్తి (5) గానం: రంజిత్, హరిహరన్

అడుగడుగు గుండెనడుగు
తడబడిన ఈడునడుగు
ఏమంత్రమో వేశావే మనసునే మగతగా కమ్మావే
నీ నవ్వుతో చంపావే వయసునే వరదలా ముంచావే
గుండెలోనుండి గుసగుసలేవో వెన్నులో పాకాయిలే
ఊహకు రాని తహతహలేవో తాపం పెంచాయిలే
నా...నరనరం....జిమ్మంది తనువుతో అనుభవం అడిగింది
చ॥ కోరిక ఏదో తొలి మొటిమయి పోతే
తేనెలాగ చిరు చెమటై పోసే
మాయా.. ఇది ఎవరి మాయా..
సిగ్గు నూనుగు చిగురే వేసే
ఉగ్గ బట్టి ప్రాణాలే తీసే
మంత్రమ్ చెలి వేసే మంత్రమ్
చూపు దిగితే చెప్పలేని వయసుతో
నా..వెన్నులోను చిలుకుతున్న చిలిపి బాధా.. ॥గుండెలో॥



కాళ్ల క్రింద ఎత్తుపీట కూ..కూ..కూ పెట్టుకొని నిద్దరోతె కూ..కూ..కూ..
గుర్తుపెట్టి ముద్దులు పెడతా వా...వా... గుట్టంతా దోసుకుపోతా
వా...వారెవ్వా....వవ్వారెవా వా...వారెవ్వా....వవ్వారెవా ॥2॥
అ: మీ అమ్మ మీ నాన్న గురివింద గుమ్మడి ఎదురుగా వున్నాగాని గురివింద గుమ్మడి
ఊరిజనమంతా గూడి గురివింద గుమ్మడి సూత్తానేవున్నాగాని గురివిందా గుమ్మడి
అటు ఇటు సూడకుండా కూ..కూ..కూ.. తిన్నగా నాకాడికొచ్చి కూ కూ కూ
వదిలిపెట్టకుండా నన్ను వా..వా.. ఒడిసి పట్టగలవా నువ్వు
అ: ఊరిసెరువులోన నువ్వు ఎన్నెల్లోగుమ్మడి కలువాపూలుకోత్తా వుండు ఎన్నెల్లోగుమ్మడి
మంచినీళ్ల కోసం వచ్చి ఎన్నెల్లోగుమ్మడి కాలు జారి కేకలెడతా ఎన్నెల్లోగుమ్మడి
నా వాడివంట నీవు కూ.. కూ.. నా నడుము పట్టుకుంటే కూ..కూ..
అందరు సూత్తుండగ నేను వా..వా.. ఒంటికదుముకొంటా నిన్ను
అ: సూపు సూపు కలవాలని గురివిందా గుమ్మడే.
ఆ: తిరనాళ్ళు వస్తాయంట ఎన్నెల్లో గుమ్మడి.
అ: ఇద్దరొక్కటవ్వాలని గురివిందా గుమ్మడే.
ఆ: ఎదిగేసంటా కందిసేను ఎన్నెల్లో గుమ్మడి.
అ: వద్దు పోకూడదని కూ..కూ..కూ..
ఆ: ఇసక మెత్తగుంటదంట కూ..కూ..కూ..
అ: వయసు కొస్తే ఆడపిల్ల కూ..కూ..కూ..
ఆ: ఉరుకుతాది గోదారల్లె కూ..కూ..కూ..
అ: ఇచ్చిపుచ్చుకోవాలని కూ..కూ..కూ..
ఆ: కుర్ర జంట కోరుకుంటే కూ..కూ..కూ..
అ: తాటిచెట్టు సాటు సాలు వా..వా.. తానసాన తన్న నానా ఆ: ॥సూపు॥

## రచన: చిర్రావూరి విజయకుమార్ (3) గానం: కల్పన

లోకం పీకే నరకాలి పెట్రోలేసి కాల్చాలి ఈ సృష్టికే ప్రతి సృష్టిచేయాలి
మనుషుల బ్రేయినే వాష్ చేసి మనసుల స్కానింగే తీసి క్లోనింగుతో నవలోకం చెయ్యాలి
చుడీ దార్ తియ్ లుంగికట్టెయ్ ఓణీ తీసెయ్ తగలెట్టేయ్ నిప్పులోన ఈత కొట్టెయ్
డబ్బులోన హార్సువేసి సబ్బురుద్దెయ్
కనులుండి ఏంలాభం కలలెప్పుడూ కనకుంటే?
కలగన్నా ఏంలాభం కలలో భయమూ భీభత్సంలే.. టేకిటీజీ...యే..
స్వర్గంలాంటి ఇల్లు ఉన్నా ఏంలాభం ఫ్రీడం లేకుంటే
లోకం పీకే నరకాలి పెట్రోలేసి కాల్చాలి నవరక్తమే నరాల్లో నింపాలి
మనిషిగ పుట్టి ఏంలాభం మనసులకుందా ఆనందం!?
ప్రతి మనిషిలో పగా,ద్వేషం,స్వార్థం
సరదాగ పొగతాగి జలసాగ తెగతాగి ఆకలేస్తే హత్య చేసేయ్ హు కేర్స్ !?
డబ్బు వుంటే తప్ప పట్టదీలోకం బతుకంటే చావడమే చస్తూనే బతకాలి జగమంతా జగడాలే
మనిషికి మనిషే విషమవుతుంటే
చద్దామన్నా పుట్టడం మళ్ళీ ఖాయం మరి చావడమెందుకులే
ఎవరెస్ట్ నే కోక్‌టిన్ చేసి రెయిన్‌బోనేమో స్ట్రా చేసి సూరిడికే తాగించేద్దాం ఫూల్‌చేసి
చుక్కలు కోసి ఫ్రైచేసి మెరుపుల నూడుల్స్‌చేసి
తినుపించుదాం చంద్రుడికే ఆకేసి
గుండలే బండవుతుంటే మమతలే మసి అవుతుంటే
మనుషులే రాక్షసులైతే నడిచే శవాలు బతికేదెలాగ
నా ఒంటిలో లావా పొంగి
ఊహలే నిప్పయి మండి నిలువునా కాల్చేస్తూ వుంటే....
ఎన్నాళ్ళు ఏడ్చిన ఏమి లాభం?



## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (4) గానం : ఆర్.పి.పట్నాయక్

ప: వేయికన్నులతో.. వేచిచూస్తున్న
తెరచాటు దాటి చేరదా నీ స్నేహం
కోటి ఆశలతో.. కోరుకుంటున్న
కరుణించి ఆదరించదా నీస్నేహం
ప్రాణమే నీకూ.. కానుకంటున్నా..
మన్నించి అందుకోవా నేస్తమా... ॥వేయి॥
చ: నీ చెలిమే.. ఊపిరిలా..
బతికిస్తున్నది నన్ను..
నీ తలపే.. దీపంలా..
నడిపిస్తున్నది నన్ను..
ఎంత చెంత చేరినా..
సొంతమవని బంధమా...
ఎంతగా తలపించినా..
అందనున్న పంతమా..
ఎంత ఆశవున్నా..
నిన్ను పిలిచేదెలాగమ్మా అందాల ఆకాశమా..

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (5) గానం : కె.కె.

ప: ఊరుకో హృదయమా... ఉప్పెనై రాకుమా..
మాట మన్నించుమా... బైట పడిపోకుమా..
చెయ్యెత్తి దీవించే వేళ.. నీ కళ్లలో జలపాతాలా..
నీ పేరు నిట్టూర్పుల జ్వాల.. ప్రణయమా.. ॥ఊరుకో॥
చ: చూపులో శూన్యమే... పెంచుతూ వున్నది..
గాలిగా కరుగుతూ.. అనుబంధం..
చెలిమితో చలువనే.. పంచుతూ వున్నది..
జ్యోతిగా వెలుగుతూ.. ఆనందం..
కలత ఏ కంటిదో.. మమత ఏ కంటిదో
చెప్పలేనన్నది... చెంప నిమిరే తడి..
చెయ్యెత్తి దీవించే వేళ..
నీ కళ్లలో జలపాతాలా..
నీ పేరు నిట్టూర్పుల జ్వాల.. ప్రణయమా..
చ: దేహమే వేరుగా స్నేహమే పేరుగా...
మండపం చేరని మమకారం
పందిరై పచ్చగా ప్రేమనే పెంచగా
అంకితం చెయ్యని అభిమానం
నుదిటిపై కుంకుమై మురిసిపో నేస్తమా...
కళ్లకే కాటుకై నిలిచిపో స్వప్నమా
చెయ్యెత్తి దీవించేవేళ నీ కళ్లలో జలపాతాలా
నీ పేరు నిట్టూర్పుల జ్వాల.. ప్రణయమా.. ॥ఊరుకో॥





అచ్చతెనుగు మురిపాల సంగతులు
కళ్లముందు నిలిపావె ముద్దుగుమ్మా...
పాలకడలి కెరటాలవంటి
నీ లేత అడుగు తన ఎదనుమీటి
నేలమ్మ పొంగెనమ్మా...
ఆగని సంబరమా...ఆగని సంబరమా...
సగమద రిస సనిదమగసగ
సగమదా రిస సనిదమగసగ
సగస మదస దమద నిదమ గమదనిసా
సనిస సనిస నిస నిస నిసగారిస
సనిస సనిస నిస నిస నిసగారిస
దాద నీని దదనీని దదనిగసపా
చ: వరములన్ని నినువెంటెట్టుకుని
ఎవరి ఇంట దీపాలు పెట్టమని
అడుగు తున్నవే కుందనాల బొమ్మ...
సిరుల రాణిని చేయి పట్టి
శ్రీహరిగ మారునని రాసిపెట్టి
ఏ వరుని జాతకం వేచి ఉన్నదమ్మా
అన్నమయ్య శృంగార కీర్తనల వర్ణనలకు ఆకారమైన
బంగారు చిలకవమ్మా...
కాముని సుమశరమా ఆ..కాముని సుమశరమా ॥చినుకు॥

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (3) గానం : ఆర్.పి.పట్నాయక్, రాజేష్

ప: కొంతకాలం కిందట బ్రహ్మదేవుని ముంగిట
రెండు ఆత్మలు కోరుకున్నవి ఓ వరం..
రూపు రేఖలు వేరట.. ఊపిరొకటే చాలట
ఆ వరాన్నే స్నేహమంటున్నాం మనం
కంటిపాపని కాపుకాసే జంటరెప్పల కాపలాగా
నిండు చెలిమికి నువ్వునేనూ నీడనివ్వాలి
స్నేహమంటే రూపులేని ఊహకాదని లోకమంతా
నిన్ను నన్ను చూడగానే నమ్మితీరాలి.. ॥కొంత॥
చ: బొమ్మ బొరుసులేని నాణానికి విలువుంటుందా
మనమిద్దరము పుట్టుండకపోతే చెలిమికి విలువుందా...
సూర్యుడు చంద్రుడు లేని గగనానికి వెలుగుంటుందా
మన కన్నులలో కొలువుండకపోతే చెలిమికి వెలుగుందా...
గలగలమని సిరిమువ్వగా కలతెరగని చిరునవ్వుగా...
నా ఎద లయలే తన మధురిమలై పాడాలీ నీ స్నేహం ॥కొంత॥
చ: వివరిస్తున్నది అద్దం మన అనుబంధానికి అర్థం
నువ్వు నాలాగా నేన్నీలాగా కనిపించడమే సత్యం
నువు చూసే ప్రతి స్వప్నం నా రాతిరి దారికి దీపం
నీ కల నిజమై కనిపించనిదే నిదురించనురా నేస్తం
గెలుపును తరిమే ఆటగా నిలవని పరుగులు తీయగా
మన ప్రాణాలే తన పాదాలై సాగాలి ఈ స్నేహం ॥కొంత॥

కె. రాఘవేంద్రరావు బి.ఏ.,
సమర్పించు
ఆర్.కె. ఫిలిం అసోసియేట్స్




పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.


కె. రాఘవేంద్రరావు బి.ఏ.,


మణిశర్మ


సుద్దాల అశోక్‌తేజ


శక్తి


చిర్రావూరి విజయ్‌కుమార్


భారతీ బాబు


శోభన్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| పాటలు | : సుద్దాల అశోక్‌తేజ, శక్తి, చిర్రావూరి విజయ్‌కుమార్, భారతి బాబు |
| సినిమాటోగ్రఫీ | : వెంకట్ ఆర్.ప్రసాద్ |
| ఎడిటర్ | : సుధా |
| డాన్స్ | : నిక్కి |
| థ్రిల్స్ | : అమేన్‌ఘని |
| స్టిల్స్ | : దాస్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : సురేష్ బుజ్జి |
| ప్రొడక్షన్ | : రాము, వీరభద్రరావు, రాయుడు |
| పి.ఆర్.ఓ. | : బి.ఏ. రాజు |
| సమర్పణ | : కె. రాఘవేంద్రరావు బి.ఏ., |
| నిర్మాణ నిర్వహణ | : శోభనాద్రి యార్లగడ్డ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : మెహర్ రమేష్, రవి |
| సంగీతం | : మణిశర్మ |
| నిర్మాత | : కె. కృష్ణమోహన్ రావు |
| కథ - స్క్రీన్‌ప్లే, మాటలు దర్శకత్వం | : శోభన్ |

## తారాగణం

మహేష్ బాబు, ఆర్తీఅగర్వాల్

ప్రకాష్‌రాజ్, రఘువరన్, ప్రగతి, పోసాని కృష్ణమురళి, లక్ష్మీపతి, రమాప్రభ, రవిబాబు, బ్రహ్మానందం, ఎల్బీశ్రీరామ్, ఆలీ, మెహర్ రమేష్, రామ్



సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్




పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.


యం.ఎస్. రాజు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | :పరుచూరి బ్రదర్స్ |
| పాటలు | :సిరివెన్నెల సీతారామశాస్త్రి |
| సంగీతం | : ఆర్.పి.పట్నాయక్ |
| కెమెరా | : యస్.గోపాల్‌రెడ్డి |
| ఎడిటింగ్ | : కె.వి.కృష్ణారెడ్డి |
| కొరియోగ్రఫీ | :హరికుమార్(పరిచయం) |
| ఆర్ట్ | : 'సాబూ' శ్రీను |
| మేకప్ | : రాజు |
| కాస్ట్యూమ్స్ | : కుమార్ |
| స్టిల్స్ | : వెంకట్ |
| థ్రిల్స్ | :ఆనంద్ |
| ప్రొ॥కంట్రోలర్ | : దోనవల్లి కోటేశ్వరరావు |
| ప్రొ॥ఎగ్జిక్యూటివ్ | :బాలు |
| పి.ఆర్.ఓ. | : బి.ఎ.రాజు |
| డి.టి.ఎస్.మిక్సింగ్ | : మధుసూదన్ రెడ్డి |
| పబ్లిసిటి డిజైన్స్ | : కిరణ్ యాడ్స్ |
| కో-డైరక్టర్ | :జె.వి.వి.సత్యనారాయణ |
| అసోసియేట్ డైరక్టర్స్ | : గౌతం పట్నాయక్, కిషన్ ప్రసాద్, ఉదయ్‌కుమార్.యస్ |
| అసిస్టెంట్ డైరక్టర్ | :ఆర్.సతీష్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | :బి.భాస్కరరాజు |
| స్క్రీన్‌ప్లే, నిర్మాత | : యం.యస్.రాజు |
| దర్శకత్వం | : పరుచూరి మురళి |


పరుచూరి మురళి


సీతారామశాస్త్రి


ఆర్.పి.పట్నాయక్

## తారాగణం

ఉదయ్‌కిరణ్, ఆర్తి అగర్వాల్, జతిన్(తొలిపరిచయం), కె.విశ్వనాథ్, గిరిబాబు, ధర్మవరపు సుబ్రమణ్యం, ఆలీ, పరుచూరి వెంకటేశ్వరరావు, సుజాత సునీతావర్మ, సంగీత, హేమ, సుధ, సుదీప, శకుంతల, దేవదాస్ కనకాల, శివాజీరాజా, 'చిత్రం'శ్రీను, లక్ష్మీపతి, కళ్లు చిదంబరం, సుభాష్, సతీష్, శివ, తరుణ్‌సింగ్, బి.వి.రమణ, నర్సింగ్ యాదవ్, సుమిత్‌రాయ్, అజయ్, జెన్నీ, గాదిరాజు సుబ్బారావు, వెల్లంకి శ్రీను, శ్రావణ్‌కుమార్, గోవింద్, శ్వేత, సఖి

## అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

**చిత్రం : గైడ్ (1965)**
**బ్యానర్ : నవకేతన్ ఇంటర్నేషనల్ ఫిల్మ్స్**
**సంగీతం : సచిన్ దేవ్ బర్మన్**
**రచన : శైలేంద్ర**
**గానం : మహమ్మద్ రఫీ**
**అభినయం : దేవ్ ఆనంద్, వహీదా రెహమాన్**

# దిన్ ఢల్ జాయె హాయ్...



హిందీ చలన చిత్ర చరిత్రలో 'గైడ్' చిత్రానికి ఒక విశిష్టత ఉంది. అదేమిటంటే సమకాలీన పరిస్థితుల్లో ఈ చిత్రంలో చూపించినన్ని విభిన్న అంశాలు మరే చిత్రంలోనూ చూపించలేదని విమర్శకులు భావిస్తారు. సమాజంలోని కట్టుబాట్లు, ఆ కట్టుబాట్లను వ్యతిరేకించే ప్రేమ, ఆ ప్రేమికులను కలిపిన కళ, వారిని దూరం చేసిన భోగలాలస, ఆపై నేరం (చట్టం దృష్టిలో), శిక్ష, వైరాగ్యం, మానవత్వం, మతాతీతమైన స్నేహం, ఆధ్యాత్మికత - ఇన్ని అంశాలున్న చిత్రంలో మంచి సాహిత్యానికి, సంగీతానికి ఎంత అవకాశం ఉంటుందో వేరే చెప్పనక్కర్లేదు. ఆ అవకాశాన్ని బహుచక్కగా వినియోగించుకున్నారు గీత రచయిత శైలేంద్ర, సంగీత కర్త సచిన్‌దేవ్ బర్మన్. 'ఆజ్ ఫిర్ జీనేకీ తమన్నా హై', 'తేరే మేరే సప్నే', 'పియా తోసే నైనా లాగేరే', 'గాతా రహే మేరా దిల్', దిన్ ఢల్ జాయె' పాటలు తెలియని హిందీ సంగీతప్రియులు ఉండరు.

నాట్యాన్ని అమితంగా ప్రేమించే కథానాయిక, మధ్య వయస్కుడైన భర్త నిరంకుశత్వానికి తన కళని వదులుకుంటుంది. భర్త నిర్లక్ష్యానికి,

దిన్ ఢల్ జాయె హాయ్
రాత్ న జాయ్
తూ తోన ఆయే
తేరి యాద్ సతాయ్ ॥దిన్ ఢల్ జాయె॥
ప్యార్ మేఁ జిన్‌కే సబ్ జగ్ ఛోడా
ఔర్ హుయే బద్‌నామ్
ఉన్‌కే హి హాథోఁ హాల్ హువా యే
బైఠే హైఁ దిల్ కో థామ్
అప్నే కభీ థే
అబ్ హైఁ పరాయి ॥దిన్ ఢల్ జాయె॥
ఐసీ హి రిమ్‌ఝిమ్ ఐసీ ఫుహారేఁ
ఐసీ హి థీ బర్సాత్
ఖుద్ సే జుదా ఔర్ జగ్ సే పరాయే
హమ్ దోనోఁ థే సాథ్
ఫిర్ సే వో సావన్
అబ్ క్యోఁ న ఆయే ॥దిన్ ఢల్ జాయె॥
దిల్‌కే మేరే పాస్ హైఁ ఇత్నే
ఫిర్ భీ హైఁ కిత్నీ దూర్
తుమ్ ముఝ్‌సే, మైఁ దిల్ సే పరేషాఁ
దోనోఁ హైఁ మజ్‌బూర్
ఐసే మేఁ కిస్‌కో
కౌన్ మనాయే ॥దిన్ ఢల్ జాయె॥





విచ్చలవిడితనానికి కుమిలిపోయే ఆమెకు ఒక గైడ్ అభిమానం, ప్రోత్సాహం లభించడంతో భర్తకు ఎదురుతిరిగి ఆ గైడ్‌తో అతని ఇంట్లో ఉంటూ నాట్యసాధన చేస్తూ ఉంటుంది. ఇది నచ్చక గైడ్ ప్రాణస్నేహితుడు అతనితో విభేదించి దూరమైపోతాడు. విధవరాలైన గైడ్ తల్లి తన పుట్టింటికి వెళ్ళిపోతుంది. కోపం తగ్గిన తర్వాత తల్లి తిరిగివస్తుందనే ఆశతో, అసహాయురాలైన కథానాయికను ప్రఖ్యాత కళాకారిణిని చేయుటంలో నిమగ్నమైపోతాడు గైడ్. కీర్తితో పాటు ధనం రావడంతో విలాసాలకు అలవాటుపడతాడు. వరుస నృత్య ప్రదర్శనలతో అలసిపోయిన కథానాయిక అతని ప్రవర్తనకు కుమిలిపోతుంది. అతనికి మానసికంగా దూరమవుతుంది. ఆమెను అమితంగా ప్రేమించే అతను తట్టుకోలేకపోతాడు. ఈ సందర్భంలో వచ్చే విషాద విరహగీతం 'దిన్ ఢల్ జాయే' విషాదమేమిటంటే ఇక్కడ విరహానికి కారణం మనుషుల మధ్య దూరం కాదు, మనసుల మధ్య దూరం.

ఈపాటకు ముందు వచ్చే సంభాషణ (కథానాయికతో కాదు)లో కథానాయకుడు అనేమాటలు పరిస్థితిని వివరిస్తాయి:

**జిందగీ ఏక్ నషా హై దోస్త్**
**జబ్ చఢతాహై తోన పూఛో క్యా ఆలమ్ రహతాహై**
**పర్ జబ్ ఉతర్తా హై.....**

'జీవితం ఒక మత్తు, మిత్రమా ఆ మత్తు ఎక్కినపుడు ప్రపంచమంతా ఎంత అద్భుతంగా ఉంటుందో చెప్పలేను కానీ ఆ మత్తు దిగినపుడు....'

అని ఆర్ద్రతగా అంటాడు. ఆ ఆర్ద్రతలో ఎన్నో అర్థాలు స్ఫురిస్తాయి.

కథానాయకుడు ఓ వర్షపు రాత్రి ఈ పాట ద్వారా తన మనోవేదనను తెలియజేస్తాడు.

'దిల్ ఢల్‌నా' అంటే పొద్దు గుంకడం. 'రాత్' అంటే రాత్రి, రేయి. 'యాద్' అంటే జ్ఞాపకం.

**'పగలు గడచి పోతుంది / రేయి కదలనంటుంది**
**నీ వైతే రావు / నీ జ్ఞాపకం వేధిస్తుంది'**

పగలు ఎలాగోలా గడచిపోయినా రాత్రి వేళ మనసులోని మాటలు చెప్పుకోవడానికి తోడొకరుండాలని అందరూ కోరుకుంటారు. ఆమె చేరువలోనే ఉన్నా అతని చెంతకు రాదు. ఆమె జ్ఞాపకాలతో అతను సతమతమవుతున్నాడు.

'బద్‌నామ్‌హోనా' అంటే 'చెడ్డపేరు తెచ్చుకోవటం'. 'దిల్ థామ్‌కే బైఠ్‌నా' అంటే 'గుండె చేతపట్టుకుని కూర్చోవటం'. ఈ మాటని మామూలుగా ఉత్కంఠకి గానీ, భావోద్వేగానికి గానీ వాడుతారు. ఇక్కడ హృదయవేదనకి వాడి రచయిత చక్కని ప్రయోగం చేశారు. 'పరాయ్' అంటే పరాయి,వేరు.



**'తనని ప్రేమించి లోకానికి దూరమయ్యాను**
**లోకుల మాటపడ్డాను**
**తనే స్వయంగా చేసిందిలా**
**గుండె పట్టుకుని కూలబడ్డాను**
**ఒకప్పుడు నా మనిషే**
**నేడు వేరుగ చూస్తుంది'**

ఆమె ప్రేమకోసం అందరినీ వదిలి సమాజానికి దూరమైనా ఆమె తన హృదయాన్ని గాయపరచిందని నిందిస్తున్నాడు. ఇక్కడ అతను తన తప్పులు మరచిపోయి తప్పంతా ఆమెదే అన్నట్టు మాట్లాడుతున్నాడు.

'రిమ్ ఝిమ్' అంటే చిటపట చినుకులు,'ఫుహారే'అంటే జల్లులు. 'బర్సాత్' అంటే వర్షం. 'సావన్' అంటే శ్రావణం. 'సావన్‌కా మహీనా'(శ్రావణ మాసం) అనే పాట చాలా మందికి తెలిసే ఉంటుంది.

**'ఇవే చినుకులు, ఇవే జల్లులు / ఇలాంటి వర్షంలోనే**
**మైమరచి జగాన్ని మరచి / అప్పుడు ఇరువురం వున్నామే**
**మళ్ళీ ఆ శ్రావణమాసం / ఎప్పుడు వస్తుంది'**

తామిద్దరూ కలిసి గడిపిన క్షణాలని గుర్తుకు చేసుకుంటున్నాడు. నింద మరచి జ్ఞాపకాలను నెమరు వేసుకుంటున్నాడు. ఋతువులు మళ్ళీ మళ్ళీ వచ్చినా ప్రేమ లేనిదే వాటికి విలువ లేదని చెప్పనే గడిచిన కాలం తిరిగిరావాలని కోరుకోవటంలో ఆ ఋతువునే ఆధారంగా చేసుకోవడం అద్భుతంగా ఉంది కదూ.

'పరేషాన్' అంటే ఆందోళన, విసుగు. 'మజ్‌బూర్' అంటే పరిస్థితులకు తల వంచటం. మృదుత్వం లేని ఈ పదాలను సున్నితమైన హృదయ భావాలను చెప్పేందుకు ఉపయోగించి విషాదాన్ని ఆవిష్కరించారు కవి.

**'నా మదిలో నిండి ఉన్నా / ఎంత దూరమయ్యావు**
**నువ్వు నాతో, నే మనసుతో విసిగి / అశక్తులమై ఉన్నాము**
**ఎవర్ని ఎవరు ఒప్పించాలో / ఎలా తెలుస్తుంది'**

'నువ్వు నాతో విసిగి పోయావు, నేను మనసుతో విసిగిపోయాను' అంటూ బాధనంతా గొంతులో పలికిస్తూ రఫీ పాడిన తీరు, నటీనటుల అభినయం కళ్ళు చెమర్చేలా చేస్తాయి. మనసుకి నచ్చజెప్పాలో, ఆమెకు నచ్చజెప్పాలో ఏం చేయాలో తెలియని సందిగ్ధంలో ఉన్నాడతను.

'తీస్రీ మంజిల్', 'జానీ మేరా నామ్', 'జువెల్ థీఫ్' వంటి చక్కని సంగీత ప్రధాన చిత్రాలను రూపొందించిన విజయ్ ఆనంద్, ఆర్.కె. నారాయణ్ 'గైడ్' నవల ఆధారంగా తీసిన ఈ చిత్రం భారతదేశం తరపున 1966 లో ఆస్కార్ అవార్డ్ పోటీకి పంపబడింది. ఎన్నో ఫిలింఫేర్ అవార్డులు గెలుచుకుంది. సినిమాప్రియులు తప్పక చూడవలసిన చిత్రమిది. ఈ చిత్రం సోనీ మ్యాక్స్ ఛానల్ లో తరచూ ప్రసారమవుతుంటుంది.

**-పి.వి.సత్యనారాయణరాజు**






## సంగీతం ద్వారా ఐకమత్యం - 'సమైక్య రాగాత్మ'

గత పక్షం అక్టోబరు 18న హైదరాబాదు లోని రవీంద్ర భారతిలో ఆం.ప్ర. సాంస్కృతిక మండలి, ప్రభుత్వ సాంస్కృతికశాఖ సంయుక్తం ఆధ్వర్యంలో "సమైక్య రాగాత్మ" అనే అరుదైన కార్యక్రమం జరిగింది. ఐదు రకాల సంగీతాలను వినిపించి, వాటి అన్నిటిలోనూ అంతస్సూత్రంగా ఉన్న రాగాన్ని సభికులకు పరిచయం చేయడం ఈ కార్యక్రమం లక్ష్యం. దానికి అనుగుణంగా సర్వశ్రీ పి.వి.చలపతిరావు "అమ్మా బైలెల్లినాదో" అనే జానపద గీతం ఆలపించగా, అది బిలహరి రాగంలో ఉందని చెబుతూ డా॥ నూకల చిన సత్యనారాయణ కర్ణాటక సంగీతంలో "దొరకునా ఇటువంటి సేవ" ఆలపించారు. దాన్నే హిందుస్తానీ లో అల్హయ్యా బిలావల్ అంటారంటూ శ్రీమతి లలితా దంతాలే 'మన్‌హారువారే' అనే పాట వినిపించారు. ఆ రాగానికి దగ్గరగా ఉండే ఓ అరబిక్ గీతాన్ని అహమద్ హబీబ్ మూసా పాడి చూపగా, ప్రొఫెసర్ ఇసాక్ సిక్వేరా అది బీతోవెన్ 9 వ సింఫనీలోనిదంటూ ఆ పాట వినిపించారు. ఈ విధంగా 5 రౌండ్లలో అనేక పాటలు వినే అవకాశం శ్రోతలకు కలిగింది. కాఫీ రాగంలో ఉన్న "పుట్టలో నాగన్నా దిగిరా" అనే జానపద గీతానికి పోర్చుగీసు భాషలోని "కుంబీ ఎయ్ సాయ్‌బా"(ఇదే ట్యూన్ ను 'బాబీ' హిందీ చిత్రంలో 'నా కోయీ సోనా చాందీ నా కోయీ బంగ్లా బాడీ...గే, గే...గేగే సాయ్‌బా' పాటకు వాడుకున్నారు.)కు సంబంధం ఉందంటే



'సమైక్య రాగాత్మ' సదస్సులో తలసాని శ్రీనివాసయాదవ్, డా॥సి.నారాయణరెడ్డి, ప్రసంగిస్తున్న వరప్రసాద్‌రెడ్డి

విస్మయం కల్గింది. గాత్రధారులందరూ మధురమైన తమ గళాలతో సభికులకు వీనులవిందు చేశారు. ముఖ్యంగా అరబిక్ పాటలు పాడిన మూసా వృత్తిరీత్యా గాయకుడు కాకపోయినా గళమాధుర్యంతో నెగ్గు కొచ్చారు. సంగీత కార్యక్రమానికి సమన్వయకర్తగా డా॥ నూకల వ్యవహరించారు.

ఈ ఆలోచనకు సృష్టికర్త అయిన డా॥ సి.నారాయణరెడ్డి తమ అధ్యక్షోపన్యాసంలో సంగీతం అంతరంగం ఒక్కటేనని చాటి చెప్పడమే ఈ కార్యక్రమ లక్ష్యమన్నారు. 'స్టయిల్స్' వేరైనా, సోల్ ఒకటే అన్నారాయన. ముఖ్య అతిథిగా విచ్చేసిన మంత్రి శ్రీ తలసాని శ్రీనివాస యాదవ్ టూరిజమ్ ద్వారా సాంస్కృతిక కార్యక్రమాలను ప్రోత్సహిస్తున్న సంగతి వివరించారు. గౌరవ అతిథిగా విచ్చేసిన "హాసం" ప్రచురణకర్త శ్రీ కోడూరు వరప్రసాద్‌రెడ్డి ఓంకారనాదం నుండి సృష్టి జరిగిందని, రక్తంలాగానే రాగస్పందన కూడా అందరిలో ఒకటేనని, ప్రాచ్యదేశాలలో మన రాగాల ఛాయలెన్నో కనబడతాయనీ అన్నారు. ఉదాహరణకి జపనీస్ సంగీతం మోహనరాగం ఎక్కువగా వినబడటం వల్లనే "లవ్ ఇన్ టోక్యో" సినిమాలో "సయొనారా" పాటను శంకర్‌జైకిషన్ మోహన రాగంలో కూర్చారన్నారు. సభికుల స్పందన చూస్తే ఈ విలక్షణమైన ప్రయోగం జనామోదం పొందిందనిపించింది.




## మా టీవీ సమర్పించు

## పాడాలని వుంది





కార్యక్రమాల వివరాలు

సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం

న్యాయ నిర్ణేత: మణిశర్మ

### మొదటి సెమీ ఫైనల్స్ : 2-11-02



1. ప్రణవ శేషసాయి
   - మది శారదాదేవి మందిరమే... (జయభేరి)
   - సిరిసిరి లాలి... (భక్త ప్రహ్లాద)
   - ఎక్కడవున్నా పక్కన... (నువ్వేకావాలి)



2. పల్లవిసూరి
   - శ్రీ శారదాంబ నమోస్తుతే... (శృతి లయలు)
   - కలలై పోయెను... (సఖి)
   - తూనీగా, తూనీగా... (మనసంతా నువ్వే)



3. కార్తీక్
   - మహా ప్రాణదీపం ... (శ్రీమంజునాథ)
   - నా జన్మభూమి ఎంత... (సిపాయి చిన్నయ్య)
   - ఎక్కడవున్నా పక్కన... (నువ్వేకావాలి)



4. తేజస్విని
   - ముద్దుగారె యశోద... (అన్నమాచార్య కీర్తన)
   - కొమ్మా కొమ్మా... (నువ్వు వస్తావని)
   - తూనీగా, తూనీగా... (మనసంతా నువ్వే)

### రెండవ సెమీ ఫైనల్స్: 9-11-02



1. సాకేత్
   - నారాయణ మంత్రం... (భక్త ప్రహ్లాద)
   - పువ్వుల్లో దాగున్న... (జీన్స్)
   - ప్రేమంటే సులువు కాదురా... (ఖుషి)



2. సౌమ్య వారణాసి
   - మనసే అందాల బృందావనం... (మంచి కుటుంబం)
   - అబ్బబ్బా ఇద్దూ... (చూడాలనివుంది)
   - మాయదారి సిన్నోడు... (అమ్మమాట)



3. కళ్యాణ్ వసంత్
   - మీరజాల గలడా... (శ్రీకృష్ణ తులాభారం)
   - అమ్మా అని అరిచినా... (పాండురంగ మహాత్మ్యం)
   - ప్రేమంటే సులువు కాదురా... (ఖుషి)



4. మృదుల
   - వైష్ణవి భార్గవి... (స్వాతి కిరణం)
   - ఆనంద మానంద మాయె... (శుభాకాంక్షలు)
   - మాయదారి సిన్నోడు... (అమ్మమాట)

# కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు




ఎస్కేరావు -అరకు

☆ **అరకొస్తారా?**

జ: పావుక్కూడా రాను.

☆ **పెళ్లి అయిన వాడికి, కాని వాడికి తేడా?**

జ: పెళ్లి అయిననాడు మిసెని మిసెస్ చేస్తారు, కానివాడు మిసెస్‌ని మిస్ చేస్తాడు

☆ **'పెరుగుట విరుగుట కొరకే' అనే సామెతను నెగిటివ్ మీనింగ్‌లో చెప్పగలరా?**

జ: ధరలు పెరుగుట నడ్డి విరుగుట కొరకే.

# పేరు - రిపేరు




ఇడియట్ -స్టుపిడ్ -నువ్వే...నువ్వే...

షో - చూడాలనివుంది

బాబీ -మనమిద్దరం-ఫ్రెండ్స్

-దేవులపల్లి రామమూర్తి
విజయవాడ




# డబుల్ రోల్




అతను ఏడాది 'కోమా'రు 'కోమా'లోకి వెలుతూనే ఉన్నాడు.
ఆ 'నగ' త'నగ'దిలోనే వుందిట

-బి.విశ్వజ
జవహార్‌నగర్

'రమా'...నేను చేసింది నే'రమా'!?

-దేవరం సతీష్‌కుమార్
జగిత్యాల

# చిలిపి లిపి




PG = తాగండి

చైతన్యప్రసాద్
చందానగర్

Way Gum = వేగం

పి.సింహాచలం
పాడేరు

Moon Boy = చంద్రబాబు

-ఎల్.శ్రీనివాసరెడ్డి
కొంగరకలాన్

## ఈ రూటే వేరు



| | | |
|---|---|---|
| పెట్రోలు | = | ఇష్టమైన పాత్ర(పెట్‌రోల్) |
| | | -డి.బల్తజార్<br>ఆర్.సి.పురం |
| కేంబ్రిడ్జి | = | వంతెన వచ్చింది |
| | | -బి.శ్రీరాం<br>రుద్రారం |
| ట్రాన్స్‌ఫార్మర్లు | = | మత్తులో ఉన్న రైతులు |
| | | -పి.పి.యస్.అప్పారావు<br>ఆర్.సి.పురం |

## చిలిపి కవిత




మా వాడు
బహుసమర్థుడు
ఎవరికీ
తిండిపెట్టడు
కానీ
ఎవరికైనా సరే
ఎసరు పెట్టగలడు

-భమిడిపాటి వెంకటేశ్వరరావు
చందానగర్

## పేరడీ పేరేడ్



ఈ చదువుల తరంగాలలో
ఆ టెస్టుల చదరంగంలో
ఎవరికి ఎవరు సొంతము
ఎంతవరకీ పంతము
వచ్చినదేదో రాసేదొకడూ
ఏమీ తోచక చూసేదొకడూ
కాపీకోసం వెతికేదొకడూ
సందు చూసుకుని కొట్టేదొకడు
॥సందు॥॥ఈ చదువుల॥
మరుపే మనిషికి బందిఖానా
భయపడి బాగా చదివి వచ్చినా
తెలియని మైకం కమ్ముకుని
స్లిప్పు పట్టుకో అంటుంది ॥తెలియని॥
నీ 'మతం' మార్చుకోమంటుంది ॥ఈ తెలియని॥
హెల్ప్ చేసేవాచర్ లేడని
గంటనుకొట్టే ప్యూను ఆగడూ
నీ పేపర్‌లోన ఆన్సరుండదూ
ఆ నిజాయితీకి మార్కులుండవు
ఆ మార్కులు నీ లైఫుని మార్చక మానవు॥ ఈ చదువుల॥

---



ఈ అప్పుల అవసరాలలో ఆ తిప్పల అడకత్తెరలో
ఎవరికి ఎవరు దాతలు ఎంతవరకీ వాతలు
అప్పునుంచీ పుట్టేదొకడూ అప్పులలోనే పెరిగేదొకడూ
అప్పుతోనే చచ్చేదొకడూ
ఆ పై అప్పును తీర్చేదొకడు ॥ఆ పై॥॥ఈ అప్పుల॥
అప్పే మనిషికి బందిఖానా భయపడి ఊరిని దాటిపోయినా
తెలిసినవారే వెంటపడి ఋణం తీర్చిపొమ్మంటారు ॥తెలిసిన॥
నీ బట్టలొలిచి ఇమ్మంటారు ॥ఈ అప్పుల॥
అప్పు తీర్చే దారి లేదని
తరలించుకుపోయే జప్తులాగవు ఆ జప్తుల జమకీ జన్మచాలదు
ఈ జన్మలోన ఆ ఖర్మ తప్పదు
ఆ ఖర్మకు ఈ అప్పులు చేయకమానదు ॥ఈ అప్పుల॥

మూలం: ఈ జీవన తరంగాలలో..
చిత్రం: జీవన తరంగాలువ

సీరియల్
19

# స్వామి ద్రోహి ఇంటి కథ

-మల్లాది వెంకట కృష్ణమూర్తి

## జరిగిన కథ



అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆవిడ ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బుఇవ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేనా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావుకి చెప్తాడు. బామ్మకు చావు 'ఎరేంజి' చేయడానికి హరకేశం అనే కిరాయి హంతకుడి సాయం తీసుకోమంటాడు సుబ్బారావు. హరకేశంకు పేకాటపిచ్చి. అతన్ని వెతుక్కుంటూ లింగమయ్య వెళ్లే సమయానికి పేకాటలో కట్టుబట్టలు కూడా పోగొట్టుకుని వుంటాడు. ఇంతలో ఓ ఇన్‌స్పెక్టర్ జీపు దిగుతాడు. ఇక చదవండి....



జీప్‌లోంచి దిగిన ఇన్‌స్పెక్టర్ వైకుంఠం, గబగబా నగ్నంగా నక్కి వున్న హాఠకేశం దగ్గరకి వెళ్లాడు.

"ఏమిటీ వేషం?" అడిగాడు గద్దిస్తూ.

ఇన్‌స్పెక్టర్‌ని చూడగానే నీళ్లు నమిలాడు హాఠకేశం.

"నీ వంటిమీది బట్టలేవి? మళ్లీ పేకాట గానీ ఆడావా?" అదే గద్దింపు స్వరంతో అడిగాడు వైకుంఠం మళ్లీ.

"కాదు. బట్టలు ఆరబెట్టుకున్నాను".

"ఎక్కడా? చూపించు పద".

**ఆపరేషన్ రూమ్‌లోకి వచ్చిన డాక్టర్ ఒకమూల వున్న పూలదండని చూసి నర్స్‌ని అడిగాడు.**

**"అదెవరికి?"**

**"ఆపరేషన్ అయ్యాక తెలుస్తుంది సార్. ఆపరేషన్ సక్సెస్ అయితే మీకు. ఫెయిలైతే పేషెంట్‌కి" వివరించింది నర్స్.**

**చావు నిజానికి హాస్యాస్పదం కాకపోయినా ఇలా కామెడీతో ముడిపెట్టిన ఓ చావు కథ ఈ సీరియల్.**

"పేకాటలో పోయావని" వప్పుకున్నాడు హాఠకేశం.

'పద స్టేషన్‌కి" అతని చెయ్యి పట్టుకుని గుంజుతూ చెప్పాడు వైకుంఠం.

"నేను పేకాట ఆడిన రుజువు లేదుగా?" నసిగాడు హాఠకేశం.

"దానికన్నా పెద్దనేరంచేసావు. మొండి మొలతో రోడ్డు మీదకి రావడం పెద్ద న్యూసెన్స్ కేసు".

"మా ఇల్లిక్కడే. బట్టలు తీసుకురావడానికి నా మిత్రుడెళ్లాడు. అవి రాగానే తొడుక్కుని వస్తాను".

"కుదర్దు. బట్టలు తొడుక్కుంటే, నీ మీద కేసు వుండదు. ఇలాగే రావాలినువ్వు".

"నాకు సిగ్గు"

"నీకే కాదు. చూసే నాలాంటి వాళ్లకి కూడా. అందుకే కేసు. పద".

"అక్కడ ఆడ కానిస్టేబుల్స్ ఎవరూ లేరుగా?"

"ఆఁ? పద, రేపు మెజిస్ట్రేట్ కోర్ట్‌కి నిన్నిలాగే తీసుకెళ్తాను. అక్కడ లేడీ లాయర్లు బోలెడుమందుంటారు"

"అక్కుంబక్కుం"

"అంటే?"

"నాకూ తెలీదు. ఆలీ నడగాలి"

"ఎవరు? యముడి దగ్గరనించి భవిష్యవాణి పుస్తకం కొట్టేసిన శాస్త్రీనా?"

'అవును'

'వాడు నాకంటపడితే, ముందు అరెస్ట్‌చేసి తర్వాత మాట్లాడతాను'

ఈలోగా హాఠకేశం ఇంటికెళ్లాడు లింగమయ్య. హాఠకేశం భార్య నడిగి బట్టలు తేవడానికి. ఆమె పెనిమిటి బట్టలు ఇమ్మంటే ఇవ్వలేదు, లింగమయ్య మాటలు ఓ పట్టాన నమ్మలేదు.

'మావారు ఒంటి మీది బట్టలుకూడా తాకట్టు పెట్టేంత ఇదిగా పేకాట ఆడరు' అని భర్త దగుల్బాజీతనాన్ని ఓపట్టాన నమ్మడానికి ఇష్టపడలేదు.

దాంతో లింగమయ్య భర్తమీద ఆవిడకి గల నమ్మకానికి మెచ్చుకుని వంద రూపాయలు డిపాజిట్ చేసి ఓ లుంగీ తీసుకుని వచ్చాడు. అతనొచ్చేసరికి అక్కడ ఎవరూలేరు - పోలీస్ జీప్‌తో సహా...

వాళ్లు చెప్పారు బట్టలు లేని నేరానికి ఒకర్ని పోలీసులు జీప్‌లో తీసుకెళ్లారని. లింగమయ్య నుదిటి మీద చిన్నగా కొట్టుకుని పోలీస్ స్టేషన్‌కి దారితీసాడు.

లింగమయ్య తెచ్చిన లుంగీని హాఠకేశం ధరించడానికి ససేమిరా వీల్లేదన్నాడు వైకుంఠం. పబ్లిక్‌కి పెద్ద న్యూసెన్స్ క్రియేట్ అయ్యే సీన్ అదన్నాడు. పాకిస్తాన్ టెర్రరిస్ట్‌ల కన్నా ఇతను సమాజానికి ఎక్కువ కీడు చేస్తున్నాడన్నాడు. కాని అయిదు వందల కాగితం లింగమయ్య చేతిలోంచి వైకుంఠం చేతిలోకి వెళ్లగానే, గ్రామఫోన్ ప్లేట్‌ని అట్నించి ఇటు తిప్పితే వేరేపాట వచ్చే విధంగా వైకుంఠం నోట్లోంచి వేరే మాటలొచ్చాయి.

"ఇంకా పబ్లిక్ ఎవరూ రోడ్డుమీద తిరగని టైం కాబట్టి ఫస్ట్ వార్నింగ్‌తో వదులుతున్నాను. ఇంకెప్పుడైనా పబ్లిక్ ప్లేస్‌లో మొండిమొలతో కనబడ్డావో మీసాకింద అరెస్ట్ చేసిపారేసి కేసు లేకుండా అయిదేళ్లు రిమాండ్‌లో వుంచుతాను " హెచ్చరించాడు వైకుంఠం.

లుంగీ ధరించిన హాఠకేశం, లింగమయ్య పోలీస్ స్టేషన్‌లోంచి బయటకి వచ్చాక ఇద్దరూ అప్పుడే తెరచిన ఓ ఇరానీ రెస్టారెంట్‌కి వెళ్లారు.

'పొద్దున్నే నాతో ఏమిటి గిరాకి?' అడిగాడు హాఠకేశం వేడి వేడి టీ తాగుతూ.

"మళ్లీ పని పడింది' చెప్పాడు లింగమయ్య.

'ఎవర్ని ఈసారి?'

'పోయిన సారిలా ఎక్కువ కష్టపడక్కర్లేదు. ఓ ముసలావిడని లేపెయ్యాలి'.

'ఎక్కడుంటుంది?'

'రామ్‌నగర్‌లో ఓ భూత్ బంగళాలో'

'భూతాలంటే, నాకేం భయం లేదు. ఏభైవేలు. పదివేలు అడ్వాన్స్‌గా ఇవ్వాలి'.

'పాతిక వేలు. అయిదువేలు అడ్వాన్స్‌గా ఇస్తారు మా సుబ్బారావు సార్. ఆ టర్మ్స్‌కి మాట్లాడమన్నారు'.

'సరే'

'పని ఇవ్వాళ రాత్రే అయిపోవాలి'.

'అలాగే. నాకు అడ్వాన్స్ ఇచ్చి ఆ ఇల్లు చూపించు ఆవిడ ఫోటో ఇవ్వు'

'ముందు సుబ్బారావు సార్ దగ్గరికి వెళదాం పద. ఆయన అన్నీ మాట్లాడి కేష్ ఇస్తారు'.

'బావుంది. ఇంకో టీ తాగి..'.

మళ్లీ ఇద్దరికీ రెండు 'పవనా చాయ్‌లు' చెప్పాడు లింగమయ్య.... .... ....



మొత్తం విన్నాక చెప్పాడు సుబ్బారావు.

'నీకింకా ఈ పేకాట బుద్ధి పోలేదన్నమాట!'

'నేనింత దాకా పోగొట్టుకుంది తిరిగి సంపాదించాక ఇక పేకముక్కనే ముట్టుకోదలచుకోలేదు' చెప్పాడు హరకేశం.

'సరే, మరోసారి బేరం గుర్తుచేస్తున్నాను. ఇప్పుడు అయిదు వేలిస్తాను, రేపు రాత్రికి పనయ్యాక మిగిలిన ఇరవై వేలు ఇస్తాను'.

'అలాగే సర్'

'ఒక వేళ నువ్వు పోలీసులకి పట్టుబడితే నీకూ నాకూ ఈ విషయంలో ఎలాంటి సంబంధం లేదు'.

'అది మామూలేగా. అయినా నేను చేసిన ఏ హత్యయినా ఇంత ధాకా పోలీసులు ఆత్మహత్య లేదా ఏక్సిడెంట్ కేసో అనుకున్నారు. కాని మర్డర్ అని ఒక్కసారి కూడా అనుమాన పడ్డారా? అదీ నా టేలంట్'.

'అందుకేగా నిన్ను పిలుస్త'.

క్రితంసారి సుబ్బారావుకి సరిగ్గా ఇలాంటి సందర్భంలోనే ఓ చిక్కొచ్చింది. ఆయన డెవలప్ చేద్దామనుకున్న సైట్ హక్కుదారులు ముగ్గురు. ఇద్దరు అమ్మడానికి సిద్ధమే కాని మూడోవాడు ససేమిరా అన్నాడు. పైగా రెండు రోజుల్లో సెలవు పూర్తవగానే మిలటరిలో పనిచేసే అతను ఇండోపాక్ బోర్డర్‌కి వెళ్లిపోతాడు. మళ్లీ ఎప్పుడొస్తాడో. అతన్ని ఎన్ని విధాల టేకిల్ చేసినా తను పుట్టి పెరిగిన ఆ ఇల్లు అమ్మడానికి ససేమిరా ఇష్టపడలేదతను. 'సరే, చావుకూడా నీకందులోనే రాసి పెట్టి వుంది' అనుకుని హరకేశానికి ఆ కేసు అప్పగించాడు సుబ్బారావు.

మూడోరోజు దాకా ఏం కాలేదతనికి, మిలట్రి పాస్‌తో అతను రైలెక్కాడని తెలిసి సుబ్బారావు హరకేశాన్ని పిలిచి, తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టాడు. అవి నవ్వుతూ వింటూ టైం చూసుకోసాగాడు హరకేశం.

కొద్ది సేపట్లో

**బేంక్‌లో తుపాకి చూపించి దొంగతనం చేసిన జాన్ అనే అమెరికన్ దొరగారు బయట తన కారు స్టార్ట్ చేస్తూండగా పోలీసులు వచ్చి అరెస్ట్ చేసారు. కారులో పెట్రోల్ ఉందో, అయిపోయిందో చూసుకోలేదా పిచ్చి దొంగ. ఆ జాన్ దొరగారి లాంటి హరకేశం పాత్రని ఈ సీరియల్‌లో కలుసుకోండి.**

లింగమయ్య ఆ శుభవార్త లాంటి చావువార్త మోసుకొచ్చాడు, రైల్లో మరణించిన అతని డెడ్‌బాడీని వెనక్కి తీసుకువస్తున్నారని.

సుబ్బారావుని మిగిలిన ఇరవై వేలు అడిగాడు హరకేశం.

'ఇందాకటినించి కాస్తంత ఓపిక పట్టండి అంటే విన్నారా?' అన్నాడు పైగా.

'రైల్లో ప్రయాణించే అతన్ని ఎలా చంపావసలు?' అడిగాడు సుబ్బారావు ఆశ్చర్యంగా.

'పూర్వం అయితే నిండుగా పట్టుచీర కట్టుకున్న జ్యోతిలక్ష్మి ఫోటో చూపిస్తే, మగాళ్లకి ఇట్టే హార్ట్ ఎటాక్ వచ్చేది. కాని ఈతరం కుర్రాళ్లకి మరో జ్యోతిలక్ష్మి లేకపోయె. దాంతో వాడు రైల్లో తినడానికి ఇంట్లో వదిన చేసిచ్చిన ఉప్మాలో పులివెంట్రుకలు నాలుగు దట్టించేలా చేసాను'.

'పులి వెంట్రుకలా?'

'అవును. ఎవరికీ తెలీదీ చిట్కా. పులి మీసం దగ్గరున్న వెంట్రుక ఒక్కటి కడుపులోకి వెళితే చాలు, మరణం తప్పదు'.

'ఎట్టెట్టా?' బోలెడు ఆశ్చర్యపోయాడు సుబ్బారావు.

'అవును. మా బామ్మకి ఇష్టంలేని పెళ్లి చేయబోతూంటే, మా బామ్మ అమ్మమ్మ ఆ కుర్రాడ్ని అలాగే చంపిందని ఓసారి మా బామ్మ నాతో చెప్పింది. పులి వెంట్రుక కడుపులోకి వెళితే ఎక్కడ గుచ్చుకున్నా రక్తస్రావం జరిగి మనిషి గంటలో టపా కట్టేస్తాడు'.

'నీకు పులిమీసంలోని వెంట్రుక అసలెలా చిక్కింది?' అడిగాడు లింగమయ్య.

'నెహ్రూపార్క్‌లో పులుల ఎంక్లోజర్ దగ్గర పనిచేసే కుర్రాడి చేతిని తడిపి సంపాదించాను'.

'ఉప్మాలోకి ఇవెలా వెళ్లాయి?' అడిగాడు సుబ్బారావు.

'అసలు టాలెంట్ అక్కడే వుంది. అది నా సీక్రెట్' చెప్పాడు హరకేశం.

'బామ్మని ఎలా లేపుదామనుకుంటున్నావు? చెట్టుకొమ్మ విరిగి తలమీద పడి చచ్చినట్టుగానా?' ప్రశ్నించాడు లింగమయ్య.

'తుఫాను రోజుల్లో అయితే అది పోలీసులు నమ్ముతారు కాని అన్ని సీజన్స్‌లోనూ కాదు. బామ్మ వుండే ఇల్లు ముందు నన్ను చూడనీ. ఆవిడ ఎడ్రస్ ఇవ్వండి. ఆలోచించి డిసైడ్ చేస్తాను అందుకే రేపు రాత్రి అన్నది'.

'ఆవిడ బాగా వయసు పై బడ్డది కాబట్టి పోలీసులకి పెద్దగా అనుమానం రాదు. ఏదేమైనా ఏక్సిడెంట్ డెత్ అని పోలీసులనుకోవడం మేలు'.

'అంతా నేచురల్ డెత్ అనుకునేలా చేస్తానీసారి. పోలీసుల ప్రమేయమే రాదు' హామీ ఇచ్చాడు హరకేశం.

సుబ్బారావు అయిదు వేలు ఇస్తూంటే, హరకేశం చెప్పాడు 'ఈ పాడు చేతులకివ్వద్దు, లూజింగ్ హేండ్స్‌వి. లింగమయ్యకివ్వండి. ముందు మా ఆవిడ మంగళసూత్రం విడిపించి మిగిలిందాంతో అప్పులు తీర్చమని చెప్పి మా ఆవిడకివ్వమనండి. నాచేతిలో డబ్బుపడితే పేకాటలో మళ్లీ తగలేస్తా'.

సుబ్బారావు ఆ డబ్బు లింగమయ్య కిస్తూ హరకేశంతో అన్నాడు.

'ఈ బుద్ధి ఎప్పుడూ వుంటే బాగుపడేవాడివి'

'కాని పచ్చకాగితం స్పర్శ నా చేతికి తగిలితే చాలు నా బుద్ధి మారిపోతూంటుంది.'' ఉన్న విషయం ఫ్రాంక్‌గా వప్పుకున్నాడు హరకేశం.

---





తన మీద జరిగే ఈ కుట్రేం తెలీని బామ్మ టి.వి.లో ఏ సినిమా చూడాలా అని అన్ని ఛానల్స్‌ని రిమోట్‌తో మారుస్తూ చూస్తోంది.

ఓ ఛానల్‌లో బ్లాక్ అండ్‌వైట్ సినిమా వస్తోంది. పేరు తులాభారం.

'ఛ. ఇది వరకు చూసినప్పుడు తలభారం వచ్చింది' అనుకుని ఛానల్‌ని మార్చింది. దాంట్లో 'టాప్‌హీరో' అనే సినిమా వస్తోంది. 'బిగ్‌జీరో' అని బామ్మ మళ్లీ ఛానల్‌ని మార్చింది. ఇంకో దాంట్లో 'రక్షకుడు' వస్తోంది. 'ప్రేక్షకుల టైం భక్షకుడు' అనుకుని ఇంకో ఛానల్‌ని మార్చింది. అందులో 'దేవుడు' అనే సినిమా వస్తోంది. 'చూసిన జీవుడిదే పాపం' అనుకుని కేబుల్ టి.వి.లో ఏం వస్తోందో చూసింది. 'ప్రేమజంట' వస్తోం దందులో. 'పెద్దతంటా' అనుకుని ఇంకో ఛానల్‌కి వెళ్లింది. అందులో 'బిగ్‌బాస్' వేస్తున్నారు చూసే వాళ్లకి టైం బిగ్‌లాస్' అనుకుని ఆఖరుగా ఇంకో ఛానల్‌ని చూసింది. 'చిలక్కొట్టుడు' అది. 'వీరబాదుడు' అనుకుని తమిళ్ ఛానల్ సన్ టి.వి.లో ఏం వస్తోందో చూసింది. ఏ ఎన్నార్ నటించిన తమిళ్ చిత్రం 'దేవదాసు' వస్తోంది. 'అద్గదీ సినిమా అంటే' అనుకుని ఆ ఛానల్‌లో సెటిలైంది బామ్మ.

తన ఇంటిముందు సందులో ఓ సైకిల్ ఆగిందని, దానిమీంచి దిగి సైకిల్‌కి స్టాండ్ వేసిన హరకేశం ఎదురు షాప్‌లో కోకో కోలా కొని దాన్ని తాగుతూ తన ఇంటివంకే నిశితంగా చూస్తున్నాడని బామ్మకి తెలీదు.

హరకేశం అడిగాడు ఆ షాపతన్ని.-

'ఆ ఎదురింటి నిండా అన్ని చెట్లేంటి? అడవిలో భూత్ బంగళాలా వుంది?'

'భూత్ బంగళా కాదు స్వామీ! అందులో రెండు కుటుంబాలు కాపురం ఉంటున్నాయి'.

**ఓ డాక్టర్‌కి ఓ పార్టీలో తన పేషెంట్ కనబడడంతో పక్కకి పిలిచి చెప్పాడు. "నా బిల్లు చెల్లించడానికి మీరిచ్చిన చెక్ బేంక్‌నించి వెనక్కి వచ్చింది".**

**పేషెంట్ చిన్నగా దగ్గి చెప్పాడు "మీరు నాకు వైద్యం చేసిన దగ్గుకూడా వెనక్కి వచ్చింది డాక్టర్ గారు"**

**ఇది పాత జోకే కానీ ఈ సీరియల్‌లోని కామెడి కాంట్రాక్ట్ మర్డరర్ ఈ డాక్టర్ లాంటి వాడు కాదు. ఫలానా వాళ్లని చంపుతానంటే, ఇంతదాకా చంపి తీరుతూనే వున్నాడు. ఈసారి ఏం జరిగిందో ఈ సీరియల్ చదివిచూడండి**

'అలాగా! మనుష్యులదేనా ఆ కుటుంబాలు? పురుగు గ్రా చేరగలవు'.

'లోపల ఓ పెద్ద పాముపుట్ట కూడా వుంది'.

'అద్గదే నే చెప్పలా?' ఉత్సాహంగా చెప్పాడు హరకేశం.

'ఏటా నాగులచవితికి అంతా ఆ పుట్ట దగ్గరకి వెళ్లి పాలు పోస్తూంటారు'.

'ఎన్ని పాములున్నాయేమిటి?'

'ఓసారి నేను ఆ గేటుని ఓ తాముపాము చుట్టుకుని పడగవిప్పి ఆడుతుండడం చూసాను'.

'ఏంతుందేమిటి?'

'ఉంటుంది మూడు నాలుగడుగుల పొడవు. బామ్మ అక్కయ్యో, చెల్లెలో దాని నాయనమ్మని పెంచుకునేదిట. ఆ సెంటిమెంట్‌తో వాటినేం చెయ్యరు. అవీ ఏం చెయ్యవు'.

'నల్ల త్రాచా?'.

'కాదు. గోధుమరంగుది'.

'వాళ్లు పాములున్నాయి జాగ్రత్త' అన్న బోర్డు పెట్టాల్సింది. కొత్త వాళ్లు లోపలకెళ్తే ఎంత ప్రమాదం?'

'ఇంతదాకా అవి ఎవర్నీ ఏమీ చెయ్యలేదు'

'అలా అనకు. ఏ పుట్టలో ఏ పాము ఎప్పుడు ఎవర్ని కాటేస్తుందో ఎవరు చెప్పగలరు?'

'నిజమే. నువు చెప్పినట్లు బయట 'పాములున్నాయి జాగ్రత్త' అని పాము బొమ్మ వేసి బోర్డు పెట్టాల్సింది' ఒప్పుకున్నాడు ఆ షాపతను.

కోకోకోలా పూర్తిగా తాగేసాక హరకేశం ఖాళీ బాటిల్‌ని తిరిగి ఇచ్చి డబ్బు చెల్లించాడు. నెమ్మదిగా ఆ ఇంటి కాంపౌండ్ వాల్ పక్కనే చుట్టూతా తిరిగాడు. లోపల కాంపౌండ్ వాల్‌కి ఆనుకుని వున్న చెట్లు అనేకం కనబడ్డాయి.

బాదం చెట్టు, వేపచెట్టు, రావిచెట్టు, మామిడి, ఉసిరి, కొబ్బరి, దానిమ్మ, పొగడ చెట్లు.

ఆ సంభాషణ మూలంగా హరకేశం మనసులో బామ్మని ఎలా చంపాలో క్రమంగా ఓ ఐడియా రూపుదిద్దుకుంది. తను చూసింది చాలనుకుని మళ్లీ సైకిల్ ఎక్కి బయలుదేరాడు. ఓ పి.సి.వో. బూత్ దగ్గర సైకిల్ ఆపి లోకల్ ఫోన్ చేసాడు. అవతలవైపు ఆఫీస్‌లో లింగమయ్య ఫోన్ ఎత్తగానే అడిగాడు.

'హరకేశాన్ని. ఓ ప్రశ్న. బామ్మ వాళ్లుండేది పై పోర్షన్‌లోనా? లేక కిందా?.

'కిందే. పైన అద్దెకిచ్చారు'.

'పై పోర్షన్‌లో ఎంత మందుంటున్నారు?'

'ఓ మొగుడూ, పెళ్లాం, ఆరేళ్ల కొడుకు... మొగుడు ఎక్కువగా కేంప్స్‌లో వుంటూంటాడు'.

'సరే. నీ దగ్గరకే వస్తున్నాను, వాళ్ల ఇంటి ప్లాన్ ఓసారి గీసి చూపించగలవా? ముఖ్యంగా బామ్మ ఏ గదిలో పడుకుంటుందో వివరం కావాలినాకు'

'అలాగే. ఈ రాత్రికి పనవుతుంది కదా?' ప్రశ్నించాడు లింగమయ్య.

'చాలా తేలిగ్గా'.

'మంచిది'.

'ఓ దేవదా...' అంటూ టి.వీలో దేవదాసు పాట వస్తోంది.

అది తమిళ వెర్షన్ దేవదాసే అయినా దాని తెలుగు వెర్షన్‌ను బామ్మ పాడుతూ... తెగ ఎంజాయ్ చేస్తోంది.




**(ఇంకావుంది)**




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది





"వినాయక చవితి" సినిమా 1957-58 ప్రాంతాల వచ్చింది. సముద్రాల వారు స్క్రిప్టు రచయిత, దర్శకుడూ. అందులో ప్రకాష్ అనే ఆయన జాంబవంతుడు పాత్ర ధరించాడు. ముఖ్యమైన పాత్రే. సినిమాలో బాగా కన్పిస్తుంది.అయితే కృష్ణుడితో యుద్ధం చేసినప్పుడు అతను కాదు. ఎలుగుబంటి తోలు కప్పుకున్న స్టంట్‌మాన్. ఆ తోలు ధరించి నిలబడటం సామాన్యమైన విషయం కాదు. అలవాటుండాలి. అంచేత, చాలా షాట్సులో కూడా అతను కాడు. వేరెవరో అలవాటుపడ్డవారు ఆ 'తిత్తి'లో వుండేవారు. ఆ పాత్రకి డైలాగులున్నాయి. అవీ అతను చెప్పినవి కావు. డబ్బింగ్ గాత్రధారి చెప్పారు. ఇంతైనా, అంతైనా ఏమైనా జాంబవంతుడు -ప్రకాష్ పేరుతోనే వచ్చింది. అలాగే ఆ సినిమాలో వినాయకుడు బొడ్డపాటి.(పేరు కృష్ణారావు. "అసలు పేరు కాకుండా ఇంటిపేరుతోనే పాప్యులర్ అయిన గుమ్మడి, ముక్కామల, రాజనాలలాగే నేనూనూ" అని చెప్పేవాడు బొడ్డపాటి మామ. అతన్ని అందరూ'మాఁవా' అని పిలిస్తే పెద్దవాడైనా, చిన్నవాడైనా'అల్లుడా' అని బొడ్డపాటి పిలిచేవాడు)."పొట్టిగా, బొజ్జా అదీవుందని నాకు వినాయకుడి వేషం ఇచ్చారు. ఏం లాభం? నేనని జనానికి తెలీదే. మొహం అంతా పూర్తిగా మాస్కు తొడిగారు. తొండాం ఒకటీ. నాపేరే టైటిల్స్‌లో వేస్తామన్నా, నా మొహం కనిపించే వేషం ఇంకోటేదైనా ,చిన్నదైనా ఇమ్మని అడిగాను. ఇంకోటేదో ఇచ్చారు."వినాయకచవితి"లో పెద్ద వేషం వేస్తున్నాను. హీరోని నేనే. టైటిల్ రోల్ నాదే."అని ఆ గొప్ప చెప్పుకుని ఒక నిర్మాతని వేషం అడిగితే,"నువ్వే ఆ వేషం అని నాకు నమ్మకం ఏమిటి? నీ మొహం ఏదీ? కనిపించదే" అని అడిగాడు. అని బొడ్డపాటి ఓసారి చెప్పారు. ఆయన వేదాలు, సంస్కృత గ్రంథాలు చదువుకున్నారు. పండితుడు. సంస్కారి, చమత్కారీ. ఎన్.టి.రామారావు గారింట్లో పిల్లలకు ట్యూషన్స్ చెప్పేవాడు. "జీతం అడగాలంటే ఆయన్నే అడగాలి. ఆయన దొరకడు. తీరా కనిపించాక అడగటానికి మొహమాటం, జీతం అడిగితే సినిమాలో వేషం ఇవ్వడేమోనని. వేషం అడగటమా, జీతం అడగటమా అని సందిగ్ధంలో పడేవాడిని. జ్ఞాపకం వచ్చినప్పుడు "జీతం ఇచ్చారా?"అని అడిగేవారు- రామారావు గారు. అదే సందని "వేషం..."అని గొణిగేవాణ్ణి. ఎలాగైతేనేం - ఆయన సినిమాల్లో చిన్నదో పెద్దదో వేసేవాడిని. అలా ఆయన దగ్గర ద్విపాత్రాభినయం చేసినవాణ్ణి" అని చెప్పేవారు బొడ్డపాటి.



హైద్రాబాద్ ఏర్‌పోర్టులో ఒకసారి నేనూ చంద్రమోహనూ కలిసాం. ఇద్దరమూ మద్రాసే వెళ్తున్నాం. అతను ఎవరిదో షూటింగ్ కోసం వస్తున్నాడు. నేను వేరే కంపెనీ షూటింగ్‌కి వచ్చి మద్రాసు బయలుదేరుతున్నాను. ఇద్దరం మద్రాసులో దిగాం."ఏఁవయ్యా డొంకలావు (ఒకోసారి అలా పిలుస్తాడు చంద్రమోహన్) నీక్కారుందా?" అని అడిగాడు. " ఆ కంపెనీ కారొస్తుంది" అన్నాను - వచ్చింది కూడానూ. "నీకు?" అని అడిగాను. "నాకూ వస్తుంది - వాళ్ల టాక్సీ పంపిస్తారనుకుంటాను" అన్నాడు. అంతలో "చంద్రమోహన్" అని పెద్దక్షరాలతో పేరు రాసి ఒకతను బోర్డు పట్టుకుని నిల్చున్నాడు. " అదిగో వచ్చాడయ్యా" - అని నాతో చెప్పి"చంద్రమోహన్‌ని నేనే" అని చేతిపెట్టె పట్టుకుని బయల్దేరాడు. నేను బయటికి వెళ్లిపోయాను.

ఆ తర్వాత చంద్రమోహన్ చెప్పిందిది:

అతన్ని తీసుకుని ఆ కారు ఆఘమేఘాల మీద ఆ కారు రోడ్డు మీదనే పోతుంది. చంద్రమోహన్ ఇంటివేపు వెళ్ళడం లేదు. కొంత

వరకూ వచ్చి వేరే రూటు మారింది. "ఇటెక్కడికి?" అని అడిగాడు చంద్రమోహన్. "మన గెస్ట్‌హౌస్‌కి" అన్నాడు డ్రైవరు. "గెస్ట్‌హౌస్ కా! ఎవరిది?" "మనదే" అన్నాడతను. చంద్రమోహన్‌కి మతిపోయినట్టయింది. 'గెస్ట్‌హౌస్ ఏమిటి? మాఇంటికి కదా వెళ్లాలి' అనుకున్నాడు. "మా ఇల్లు తెలీదా మీకు?" అని అడిగాడు. తెలీదన్నాడు డ్రైవరు. అప్పుడు అనుమానం వచ్చింది. "ఇంతకీ ఈ కారు ఎవరిది? ఎవరి కోసం?" అని అడిగితే ఆ డ్రైవరు అదేదో కంపెనీదనీ, అన్నానగర్‌లో వుందనీ గెస్ట్‌హౌస్ కూడా అక్కడే వుందనీ, చంద్రమోహన్ అనే ఆయన ఢిల్లీనుంచి వస్తారని తీసుకురమ్మని చెప్పి పంపారనీ చెప్పాడు. "కొంప ముంచావు కదయ్యా - ఆపు ఆపు" అని తానెవరో ఏమిటో చెప్పాడు. ఆ చంద్రమోహన్ వేరు అన్నది అర్థమైంది. "ఐతే మీరు ఇక్కడ దిగిపోతారా?" అని అడిగాడు డ్రైవరు. "నా కోసం కారొచ్చివుంటుందయ్యా ఏర్‌పోర్టుకే పోదాం" అని చంద్రమోహన్ ఏర్‌పోర్టుకు వెళితే - అతని కోసం వచ్చిన కారు చూసి చూసి వెళ్లిపోయింది! ఢిల్లీ చంద్రమోహన్ తన కారు కోసం చూసి చూసి అతను వేరే టాక్సీలో వెళ్లిపోయాడు మరి, సినిమా చంద్రమోహన్ గతి? - ఆటోరిక్షాలో అతను ఇంటికి, ఈ కథ కంచికి! కామెడీ ఆఫ్ ఎర్రర్ అంటే ఇదే.



జూనియర్ భానుమతి అనీ -హాస్యపాత్రధారిణి. ఒక షూటింగ్‌లో రమణారెడ్డి తక్కిన వాళ్లు ఉన్నారు. భానుమతి కూడా ఉంది. మధ్యాన్నం భోజనాలారగించాక అంతా తీరిగ్గా కూచుని ఉండగా - సదరు భానుమతి రెడ్డిగారిని ఓ మాట అడిగింది. "సార్...మీరు భరణీ వాళ్ళ సినిమాలో బుక్కయినార్ట. మీ పక్కనో వేషం వుందిట- దానికి నా పేరు చెప్పరా?" అని అడిగింది. రమణారెడ్డి 'ఆఁ' అని అటూ ఇటూ చూశారు ప్రశ్నార్థకమూ ప్లస్ ఆశ్చర్యార్థకమూ మిళాయించి. ఏం చెబుతారో అని భానుమతి కూడా ఆత్రుతగా చూసింది.

" అవును- భరణీ వారు కొత్త సినిమా మొదలెడుతున్నారని తెలుసులే. కానీ నాకింతవరకూ ఏ కబురూ లేదు - ఉన్నానని నువ్వు చెబుతున్నావుగనుక. ఓ పని చెయ్యి. నువ్వు ఓపిక చేసుకుని భరణీకి వెళ్ళి - నాకు ఆ వేషం రికమెండ్ చేసి, ఇమ్మని పట్టు పట్టు. నన్ను వాళ్ళు బుక్‌చెయ్యగానే - నా పక్కన వేషం వుందా అని అడిగి, అప్పుడు తప్పకుండా నిన్ను రికమెండ్ చేస్తాను" అన్నారు రమణారెడ్డి -తాను చిరునవ్వు అయినా నవ్వకుండా పక్కనవున్న నాలాంటివాళ్ళను గొల్లున నవ్విస్తూ.





**ఒకసారి రేలంగి గారు చెప్పారు:**

సి.పుల్లయ్య గారి డైరక్షన్‌లో యాక్ట్ చేస్తున్నాను. డైలాగు ఇంకోలా మార్చి చెప్తే బాగుంటుందేమో అనిపించింది. కానీ పుల్లయ్య గారంటే -పులయ్యా. ఆ పులితో చెప్పడమా! పైగా ఆయన దగ్గర నేను కుర్రాడిలా వుంటూ అన్ని పన్లూ చేసేవాణ్ణి. ఏదో ఆయన దయవలనే నాకు మంచి వేషాలు వచ్చాయి! ఐనా తెగించి "సార్-ఇది ఇలా చెప్తే బాగుంటుందేమో సార్, బాగా నవ్వొస్తుంది" అన్నాను వినయంగా. "మళ్ళీ చెయ్యి" అన్నారు పుల్లయ్యగారు. ఆయన గొల్లుమని నవ్వారు. కడుపు పట్టుకుని విపరీతంగా నవ్వారు. దగ్గు వస్తున్నా విపరీతంగా నవ్వుతూనే వున్నారు. ఆయన నవ్వు చూసి నేను మురిసిపోతున్నాను. ఆనందించేస్తున్నాను... "నా కామెడీ అయిడియా అంత గొప్పదన్నమాట" అని ఊహించుకుంటూ - ఆనందమే ఆనందం. రెండు నిమిషాల తర్వాత ఆయన టక్కున నవ్వు ఆపి నా వేపు చూశారు. "బావుంది రేలంగీ...బావుంది...కానీ ఇప్పుడొద్దు. ఇంకో పిక్చర్‌లో పెట్టుకుందాం" అన్నారు సీరియస్‌గా. అంతే! ఆయన చమత్కారానికి నవ్వాలా, ఏడవాలా? ఏం చేయ్యాలో తెలీక వెర్రివెధవ మొహం వేసుకుని బయటికి వెళ్లిపోయాను."



ఓ జిడ్డు కథ

**ఉబ్బరించిన కళ్ళతో బుగ్గ పట్టుకుని ఒకటే సలుపును భరిస్తూ ఒక వైపు... గుచ్చే ప్రశ్నల్తో దండయాత్ర మొదలెట్టిన శ్రీమతి దాడికి తట్టుకోలేక మరో వైపు తంటాలు పడ్డం శ్రీముఖరావు వంత యింది.**

# సారీ!... వెరీవెరీ సారీ....

-కె.కె.రఘునందన

"అసలు విషయం కక్కుతారా లేదా! మీరుగాని నిజం చెప్పకుండా దాటేయటానికి నంగినంగి వేషాలు మొదలెడితే నేను సహించి ఊర్కొనేది లేదంతే... చెప్పండి ఏమైంది! "అంటూ నిల్చోబెట్టి ఊదరగొట్టేసింది వీరేశ్వరి.

"అసలు... అసలు... అమ్మో... హబ్బో..." శ్రీముఖరావు చెప్పబోయిన మాటలు పొంగిన బుగ్గచాటున దాగుడుమూతలాడుతూ మరి బయటకు రాలేదు. "అలా వీరలెవెల్లో పంటి నొప్పులు... పడే కంటే విషయం కక్కి తగలడండి" అని హుంకరించింది.

గానుగెద్దులా వెరైటీలేని పోజులో గింగిరాలు తిరుగుతున్న భర్త వంక చూస్తూ.... "మీకేమైం దండీ... నిక్షేపంలాంటి పలువరుస కనిపించ కుండా ఆ పొంగేమిటి మహాశయా!" తిరిగి ప్రశ్నలు సంధించింది.

ఈసారి శ్రీముఖరావు మొహంలో... అదే బాణీలో బాధ తొంగి చూసింది.

ఇంక అతన్నుంచి ఒక్కమాట కూడా పలికించటం తన తరం కాదనుకున్నది. అలా నిర్ధారణకొచ్చాక, వీరేశ్వరి కనుల ముందు ఆపద్బాంధవుడిలా 'డెంటిస్ట్ దేవదానం' మెదిలాడు. దంత వ్యాధుల మీద ధ్వజమెత్తడంలో అతనే నెంబర్ వన్. అందుకే భర్త వద్దంటున్నా సరే అతని దగ్గరకే ఈడ్చుకెళ్ళింది.

దేవదానం శ్రీముఖరావును తీవ్రంగా పరిశీలించి ఆ పరికరం ఈ పరికరంతో నోరంతా సాగ్గొట్టాక చూసి - ఒక్కసారి, ఎర్రగా ముఖం మాడ్చుకుని - 'ఛీ! నీకు సిగ్గులేదయ్యా!...' అని ముఖం మాడేలా తిట్టాడు.

తనెదురుగుండానే భర్తను అవమానకరంగా మాట్లాడ్డం సహించలేని వీరేశ్వరి డాక్టర్ దేవదానం వైఖరి ఎంత మాత్రం నచ్చక - "కాస్త మాటలు జాగ్రత్త..." అని ధైర్యంగానే ఎటాకిచ్చింది.

"నాక్కాదమ్మా జాగ్రత్తలు చెప్పడం.... మీ ఆయనకు చెప్పు... లేకపోతే నా సర్వీసులో పళ్ల బాధల్తో వచ్చిన కేసులు గుంపులు గుంపులుగా వున్నప్పటికీ, యిటువంటి బుగ్గ పొంగిన కేసు ఒక్కటి కూడా చూడలేదు. పైగా రెండు బుగ్గలు గాలి దూరటాన్కి కూడా వీల్లేనంత ఘోరంగా పొంగడం యిప్పుడే చూసాను. ఏనాడో ముసలి వయసులో పళ్ళూడ్డం సహజం... కాని..."

"అయ్యో... దేవదానం గారూ! మీరూ అలా బొల్లిబొల్లిగా చెప్పి చంపకండి..."

"వద్దమ్మా... మీ ఆలుమగల మధ్య తగవులకు దారితీసిన వాడినవుతాను..."

"మీరు పళ్ళు పరిశీలించటమేంటి... తరువాత మా నంసారంలో గొడవలు పెరుగుతాయనటమేంటి... ఎంత గింజుకున్నా మీరనేదేమిటో అర్థమై చావట్లేదు... సూటిగా చెప్పేయండి..." టెన్షన్ భరించలేక అడిగేసింది వీరేశ్వరి.

"మీ ఆయనగార్ని ఎవరో ఎడాపెడా దవడలు వాయగొట్టారమ్మా... అందుకే అంత ఘోరంగా..." కక్కేసాడు దేవదానం.

ఆయన మీద అంతెత్తున



అరుద్దామనుకున్నా దవడ వాపు నొప్పి వల్ల ఉరుము ఉరిమినట్టు చూడ్డం తప్ప నసవగానే మిగిలాడు శ్రీముఖరావు. ఆ మాటలకు వీరేశ్వరి మొహంలో రక్తం జరజర ప్రాకేసింది.

"అర్జంటుగా బుగ్గ పొంగులు తగ్గటానికి పవర్‌ఫుల్ టాబ్లెట్స్ రాయండి. ఉదయానికి ఈయన తడాఖా తేలుస్తాను. "అంది భర్తవైపు కసిగా చూస్తూ..."

"మింగలేడమ్మా... ప్రస్తుతానికి ముక్కుమీద ఓ చక్కనైన ఇంజక్షన్ చేసి పంపిస్తాను. రేపు ఇదే సమయానికి లాక్కురండి.... క్షణం తేడా వచ్చినా డోసు మార్చి రెండు ఇంజక్షన్స్ చేయాల్సి వుంటుంది...." అని బడా సిరంజితో లావుపాటి సూదిలో జింకలాటి మందు ఎక్కించి ఇంజక్షనిచ్చాడు. బుగ్గ నొప్పికి తోడైన ముక్కు సలుపు 'అవొమ్మో' అనటాన్కి కూడా వీల్లేకుండా లోపల్లోపల చిత్తు చేసింది.

ఎంతవమానం? బుగ్గలు వాచాయంటే... దంత వ్యాధుల జాబితాలో ఏదో ఓటి ఔతుందనుకుంది. కాని దేవదానం చెప్పింది విన్నాక గుండె మండి పోయింది.

రోజా అయితే లేవంగానే ఏ బాబా ఫొటోనో

చూసి, తాళిబొట్టు కళ్ళకద్దుకోవటం అలవాటు. కాని ఆ మర్నాడు లేవగానే ఆమె దృష్టి భర్త బుగ్గల మీద పడ్డది. ఇంజక్షన్ ప్రభావం బహు బాగా పని చేసింది. బుగ్గలు చప్పబడ్డాయి. ఇంక భర్త పని పట్టాలనిపించింది.

"చెప్పండి... మిమ్మల్ని ఎడాపెడా వాయించిం దెవరు..."

"నేను... అసలు... అసలు..." నొప్పి శేషం శ్రీముఖరావును వెంటాడ్తూనే ఉందింకా...

"ఈ వీధిలోనే కాదు. కాలనీ కంతటికీ మొత్తం వీరేశ్వరి సంగతి తెల్సు. నా సంగతి తెల్సి మీ బుగ్గలు వాయించిన మొనగాడెవరని..." అని వీరావేశంలో వూగిపోయింది వీరేశ్వరి.

"మరి... మరి..." నాన్చి నాన్చి పలికాడు శ్రీముఖరావు.

"అలా నసుగుతారేంటి... మీ బుగ్గలు వాయగొట్టిన మొనగాడెవడన్న ఆరా తర్వాత... వాడు వాయిగొట్టేంత తప్పు మీరేం చేసారని?" గుచ్చి గుచ్చి అడిగింది.

తన మొహంలో భావాలు చదవటానికి వీల్లేకుండా పెట్టాడు.

"అసలు దేవదానం ఆ మాట అనుండక పోతే మీ మీద అస్సలనుమానం వచ్చేది కాదు. మీరేదో వెధవపని చేసే వుంటారు... చెప్పండి చేసిన ఆ వెధవ పనేమిటో... ఉత్తనే బుగ్గలు వాయించటానికి ఎవరికి పట్టిందని.... ఊ.." చెప్పమని మొసలి పట్టు పట్టింది వీరేశ్వరి.

"నిన్న... నేను... బస్సులో... ఎక్కాను... ఎంత రద్దీవో చెప్పలేను.."

"మిమ్మల్ని రద్దీగురించి చెప్పమన్లేదు... బస్సులో ఏం జరిగిందట"

"ఆ బస్సులో... బస్సులో...."

"...ఆ బస్సులో..." హూంకరించింది.

మరింక చెప్పలేక బిక్కచచ్చిపోయాడు... ఇంక ఏడుపేగతి.

"నేరకపోయి ఆ బస్సెక్కానా అనిపించింది.... ఆ బస్సెక్కకపోతే... నా బుగ్గలు వాచేవి కావు..."

"వెధవ పని చేసిన వాడికి ఎక్కడైనా వాయిస్తారు"

"అదిగో మళ్ళా... అదేమాట..." ఉక్రోషం పొడుచుకొచ్చింది శ్రీముఖరావు.

"ఆ మాట నేను కూడా అంటున్నాను." అన్న కీచుగొంతుకి అటు తిరిగాడు శ్రీముఖరావు.

గిరుక్కున తిరిగింది వీరేశ్వరి.

"మీరా నామాలయ్య గారూ..." చేపాటి కర్రూపుకుంటూ ఒకటే హడావుడిగా వస్తున్న ఆయన్ను చూసేసరికి ప్రాణం లేచి వచ్చింది వీరేశ్వరికి.

ఎందుకంటే కయ్యాలెక్కడుంటాయో నామాలయ్య అక్కడుంటాడు. ఊరూవాడా చెప్పుకునే సంగతుల్లో, అవాకులో, చెవాకులో గానీండి గాని, అతని చెవిన పడకుండా ఉండదు. ఉంటే అది కల్లోని మాటే!

"ఔనమ్మా! మీ ఆయనకు సిగ్గుందో లేదో కనుక్కుందామని వచ్చాను"

"ఫోన్ చేస్తే నేనే చెప్పేద్దును కదా! బాబాయి గారూ...."

"లేకపోతే ఆ అమ్మాయి కాబట్టి చెంప చరచటంతో ఊరుకుంది... కాని, యింకోపాటి దైతేనా... గుండెలు తిరగబడేలా తన్నేది...." అని తనే బుగ్గలు అదరగొట్టిన అమ్మాయిలో పరకాయ ప్రవేశం చేసినట్లుగా అన్నాడు నామాలయ్య.

కారం రాసుకున్నట్టు వెర్రెత్తిపోయింది. వీరేశ్వరి.

"మీరూ ఆ బస్సులో..."

"లేను కాబట్టే మీ ఆయన తెగించాడు"

"ఏం చేసారింతకీ...?"

"చెప్పుకుంటే సిగ్గు చేటు... ఆ యానాదమ్మ కూరగాయల తట్టతో బొంకుల దిబ్బ దగ్గర ఎక్కిందట. ధడాలు మన్న శబ్దం అయితే అటు తిరిగిందట. ఇంకేమిటి ఓ అమ్మాయి చేత చెంప దెబ్బలు తింటూ మీ ఆయన కనిపించాట్ట... ఛ... ఛ... ఈ వయసులో సరసాలా... అదీ పబ్లిగ్గా బస్సు లోనా.... తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టడంలో దిట్టనిపించు కున్నాడు నామాలయ్య.

"బాబాయ్‌గారూ ఆ దేవదానం గారు చూచాయగా జబ్బు పోల్చారు. మీరు సంగతి విప్పి చెప్పేసారు. థాంక్స్... థాంక్స్".

"ఇంత గడ్డి పెట్టమ్మా..." అని డైరెక్షన్ యిచ్చి మరీ కదిలిన నామాలయ్యను అమాంతం మీదపడి రక్కేయాలనిపించింది శ్రీముఖరావుకి.

కాని, నామాలయ్య నిష్క్రమణ పిదప భార్య చూసిన చూపుందే.... అంత గంగవెర్రినీ యిట్టే అణగ్గొట్టింది.

"ఏమిటీ? మీరు... ఓ అమ్మాయి చేత చెంపదెబ్బలు తినే స్థాయికి దిగజారేరంటే... హూఁ

... మిమ్మల్ని... మిమ్మల్ని..." భద్రకాళి పాత్రకు పూర్తి న్యాయం చేకూరుద్దామని విశ్వప్రయత్నం మొదలెట్టింది వీరేశ్వరి.

"నేను... అసలు... అసలు..." శ్రీముఖరావు సంజాయిషీగా ఏదో అనబోతున్నా సరే ఏవిధమైన మిన హాయింపులు లేనట్లు, భర్తను చీవాట్లు పెట్టడమే, తన ధ్యేయ మన్న రీతిలో కొన సాగింది.

సరిగ్గా అప్పుడే ఘొల్లున నవ్వులు విని పించాయి.



పానకంలో పుడకవరాని కళ్ళు విప్పారి చూసింది.

"వీరూ!"

"కీరూ!"

"వీరూ!"

"కీరూ! నువ్వా! ఏంటే చెప్పాపెట్టకుండా వస్తూనే ఇనుప గొలుసులు తెగి నట్టా నవ్వు లేంటే!...."

"కాక... నీ మొగుడ్ని కంట్రోల్‌లో పెట్టే తీరు చూస్తుంటే నాకు తెగ నవ్వొచ్చింది. అప్పుడాల కర్రల రోజులు పోయాయి.. కేవలం నోటితోనే పాతరేస్తున్నావా...? అంటే బాగా సీనియర్‌వి అయిపోయా వన్న మాట..."

"నీ హాస్యాలు తగలెట్టినట్లే వుంది గాని... వచ్చిన పనేంటి..."

"ఏం లేదు. అలా మార్నింగ్ వాక్‌కి వస్తూ ఆగాను... ఆయనేనా మీ ఆయన..." అడిగింది కీరవాణి.

"ఆ... ఆయనే..."

"ఏరీ... ఆయనే ఈయనా? ఈయనే ఆయనా...?" సందిగ్ధంగా చూస్తుండి పోయింది కీరవాణి.

"ఈయన... ఆయన.. ఏంటీ? ఈయనే మా ఆయన..."

"ఆయనే మీ ఆయనా! హ్హాహ్హాహ్హా..."



"విరగబడి నవ్వుతావేంటి?"

"లేకపోతే ఆ రోజు బస్సులో ఆ అమ్మాయి అడాపెడా వాయిస్తుంటే చచ్చుదద్దమ్మలా... మిడి గుడ్లేసుకుని చూస్తుండి పోతారా! అదే మా ఆయనయితేనా... వీరలెవెల్లో పోరాడేవారు..."

"బుగ్గలు ఎలా వాచాయని నేనారా తీస్తుంటే ఆయనెదురు తిరగలేదన్న జాలి నీకెందుకే... అంటే నువ్వారోజు బస్సులో..."

"ఆ ఎక్కాను కాబట్టి చూసాను... చూసాను కాబట్టి చెప్పాను, కాబట్టి..."

"కాబట్టిలింక కట్టిపెట్టు తల్లీ..."

"నే చెప్పానని మీ ఆయన నావంకెలా గుర్రుగా చూస్తున్నారో... వస్తా తల్లీ నాకెందుకా గొడవ..." అని గున్న ఏనుగులా నడుస్తూ వెళ్లి పోయింది కీరవాణి.

ఇంతదాకా పెనం మీద వేగిన బాధే అనుభవించాడు. ఇప్పుడేమో సరాసరి పొయ్యిలో పడ్డాడు శ్రీముఖరావు.

గుడ్లురిమి చూసింది వీరేశ్వరి.

"ఎవరి దగ్గర నా పరువు పోకూడదనుకున్నానో వారి దగ్గరే పోయింది...

'కీరూ' నోరు మా చెడ్డది.... తాంబూలం పూళ్ళలోనూ వూది పారేస్తుంది... ఎలారా దేవుడా" తల పట్టుకుంది...

అంతలోనే కెవ్వున అరిచాడు శ్రీముఖరావు.

అర్ధరాత్రి హారర్ పిక్చర్‌లో సీన్స్ గుర్తుకొచ్చి అరిచిన వాడిలా కెవ్వుమన్న భర్త వెర్రివేషానికి ఒక్కసారి అగ్గెత్తుకొచ్చింది.

"ప్లీజ్ నన్ను కొట్టొద్దు. వాయించద్దు... మీకు పుణ్యం ఉంటుంది... ఏదో... పొరపాటుగా ప్లీజ్... నన్ను ఏం చేయద్దు." భర్త తైతెక్కలు అర్థం కాక వెర్రి చూపులు చూడసాగింది వీరేశ్వరి.

"అయ్యో! ఆమె... ఆమె... అదే... ఆ బస్సులో..."

"ఏంటండీ మీ వెర్రిగాని... సరిగ్గా ఏడవండదేదో..." అరిచింది వీరేశ్వరి.

ఆయన కాదు నేనూ ఏడవాల్సింది..." అన్న స్వరానికి వెనక్కి తిరిగింది.

ఎవరో రివటలాటి అమ్మాయి.

"మీరూ!"

"ఔను నేనే... మీ ఆయనగారి చెంపలు... పొరపాటుగా..."

"పొరపాటుగా చెంపలు వాయించటం నీకు అలవాటా?"

"ఏమిటీ... నాయుడిగారి తోటలోంచి కోసుకొచ్చిన స్వచ్ఛమైన కొబ్బరి కురిడీలతో, గంట స్తంభం దగ్గర రామలింగం నూనె మిల్లులో ఆడించిన ఈ నూనెను పట్టుకుని నవ్వుతావా?"

"కాకపోతే... ఈ నూనెతో మీ ఆయన బుర్రంతా పులిమారు కదూ..."

"ఔను..."

"అదే మీరు చేసిన పొరపాటు".



1979 సం॥ విజయ మాసపత్రికలో తొలి కథ అచ్చయింది. తదాదిగా వందలాది కథలు అన్ని ప్రముఖ దినవార, మాస పత్రికల్లో వెలుగు చూసాయి. బాల సాహిత్యం, వ్యాసం, నవల, కవిత, నాటకం మొ॥ అన్ని ప్రక్రియల్లోనూ ప్రవేశం ఉంది. కామెడీ వ్రాయటమంటే ఇష్టం.... అవకాశం వస్తే టి.వి., సినిమాలకు పని చేయాలన్న అభిలాష మనసులోంచి అప్పుడప్పుడు తొంగి చూస్తూంటుంది. -కె.కె.రఘునందన

రామతీర్థం, విజయనగరం జిల్లా పిన్:535 218

"అబ్బే... అదేంకాదు... అసలు పొరపాటల్లా..." "మా ఆయనది ... నీది కాదంటావు...." "ముమ్మాటికీ..." "ఆయన తప్పులేదని... ఆయన... నీ తప్పులేదని నువ్వు... ఇద్దరిదీ కాకపోతే బుగ్గలెలా వాచినట్లు..." "దానిక్కారణం మీరు..."

"నేనా..."

"ఔను. ఇంతకీ మీ ఇంట్లో పచారీ కొట్లోంచి సామాన్లు ఎవరు తెస్తారు?"

"నేనే..."

"ఏదీ! ఓసారి మీరు వాడే కొబ్బరినూనె చూపించండి"

"విషయం దాటవేస్తున్నావు... నిన్నూ..."

"ఆగ్రహం తరువాత... నేనడిగింది ఇలా తెండి..."

లోనికి వెళ్ళి సీసా పట్టుకుని తెచ్చి ఆమె చేతిలో పెట్టింది. దాంట్లోంచి కొబ్బరినూనెను కొద్దిగా చేతిలో వంపుకుని చూసాక ఒకటే పకపకలాడింది, బస్సులో భామ భ్రమర.




"పొరపాటా?"

"ఔను. మీరు చేసిన పొరపాటుకి మీ ఆయన శిక్ష అనుభవించారు... పాపం!! ఈ నాసిరకం జిడ్డునూనెను మీ ఆయన బుర్రకి పులిమారే... దాని మూలంగా ఈ రగడంతా జరిగింది" నొచ్చుకుంది భ్రమర.

"తిన్నగా చెప్పు తల్లీ... నీకు పుణ్యం వుంటుంది." విషయం తెలీక పిచ్చెత్తిపోసాగింది వీరేశ్వరి.

"మీ ఆయనకి తలమీద చెయ్యివేసి సవరించుకునే అలవాటుంది కదూ!"

"ఔను...!"

"అందుకే ఆయన అలా సవరించుకున్నప్పుడల్లా ఆయన చేయి నా మీద పడేది. అప్పుడది చూసి ఎవరీ రాలుగాయని చెప్పి ఎడాపెడా వాయించాను... కాని తరువాత మీ ఆయన చాలా మంచివారని తెలిసింది.

అయితే కారణం ఏమిటాని తీవ్రంగా యోచించాను. చివరికి తెలుసుకున్నదేమిటంటే... మీ ఆయన బుర్ర జిడ్డు వల్లే ఆయన చేయి నామీద పడేదని... ముందే తెలిస్తే చెంపలు పగలగొట్టేదాన్ని కాను కదాని పశ్చాత్తాపపడ్డాను. అందువల్ల ఇక నుండీ మీ ఇంటిల్లిపాదీ వాడాల్సింది ఈ మడ్డి జిడ్డు కొబ్బరినూనె కాదు. ఇదిగో... ఇది 'భజరంగ భళీ నాన్‌స్టిక్ టెంకాయ్ తేల్ స్పెషల్..." శాంపిల్ బాటిల్... ఇదిగో సారీ... వెరీ వెరీసారీ..." - క్రొత్త కంపెనీ కొబ్బరినూనె సీసాను అక్కడ పెట్టి వెళ్ళి పోతున్న భ్రమరవంక, బుగ్గలు తడుము కుంటున్న భర్త శ్రీముఖరావు వంక మార్చి మార్చి చూస్తుండి పోయిన వీరేశ్వరి అయోమయంలోంచి తేరుకునేసరికి చాలా సమయం పట్టింది.

# నాగేష్ సూక్తులు





స్నేహితులు కరచాలనం చేసుకుంటారు. అంచేత, కరచాలనం చేసుకునే వాళ్లందరూ స్నేహితులేనని మోసపోకండి! గోదాలోకి దిగేముందు కుస్తీపట్టే వస్తాదులు కూడా ముందుగా కరచాలనమే చేసుకుంటారు.



హస్తసాముద్రికం చెప్పేవాళ్లు చేతిరేఖలు చూస్తారు. కానీ చేతిరేఖల్లో నాకు నమ్మకం లేదు. కోతులకు కూడా చేతిలో రేఖలుంటాయి.



నాకు నచ్చిన రచయిత బ్రహ్మదేవుడు. అతను ఎక్కడా కాపీ కొట్టినట్టు కనిపించదు. ఆయన రాసిన ఏ రెండు తలరాతలూ ఒక్కలా ఉండవు! కావాలంటే మీదీ మీ స్నేహితుడిదీ పోల్చి చూసుకోండి!



'ప్రపంచం తలకిందులై పోయింది' అని చాలామంది అంటూ వుంటారు. దానికి కారణం ఉంది. ఏమిటంటే-'ఏ బి' అని ఇంగ్లీషు చదువు మొదలుపెట్టి, చదువు పూర్తయిన తర్వాత ముందు నేర్చుకున్న అక్షరాలను తలకిందులు చేసి'బి ఏ' అని రాసుకోవడమే!



మీకు పిల్లలున్నారా? వుంటే - మీ పిల్లలకు కథలు చెబితే - తోటి పిల్లల వీపుల మీద ఎక్కి వెన్నను దొంగిలించిన శ్రీ కృష్ణుడి కథలు చెప్పకండి. రొట్టె, టీల కోసం నిచ్చెనెక్కి గోడలమీద పోస్టర్లు అతికించే పిల్లల గురించి చెప్పండి.(జీవితం అర్థమవుతుంది)

పూర్వంలా ఈ రోజుల్లో ఋషులు లేకపోవడానికి కారణం ఉంది. ఉన్న అడవులన్నింటిని నరికేసి, వూళ్లుగా కట్టేశారు. అందువల్ల ఋషులు ఎక్కడ తపస్సు చేసుకుంటారు? బస్‌స్టాపులలోనా?(లేదంటే బస్‌స్టాపులలో నిలబడి తపస్సు చేసేవారిని ఋషులనుకోవచ్చునా? బస్సులకోసం నిలబడి గడ్డాలు మీసాలూ పెరగడం చేత!)






**అది 1893వ సంవత్సరం!**
**అది దీపావళి!!**
**అది దీపాల వేళ...కర్ణాటక దేశంలో...**
**ఓ పసిపాప ఏడుస్తున్నాక రాగంలో ఏడ్చాడు...ఆ ఏడుపులో ఓ గమకం వొలికింది...**
**కర్ణాటక సంగీత జగత్తులో ఓ కొత్తద్వారం తెరుచుకుంది...**
**ద్వారం వెంకట స్వామి నాయుడు గారు అలా ఆవిర్భవించారు.**

పదేళ్లొచ్చాయ్!
నాయుడు ఆరోక్లాసు చదువుతున్నాడు.
ఉన్నట్టుండి కళ్లుమసకేసిసట్లైపోయాయ్..
నల్లబల్లమీద అక్షరాలు అలుక్కు పోయి నట్టున్నాయ్...
'రేయ్ నాయుడూ'...రాసుకోకుండా దిక్కులు చూస్తున్నావేంట్రా బడుద్దాయ్...అన్నాడు మేష్టారు.
నాకేమీ కనపడట్లేదండి...వొణుకుతూ లేచి నించున్నాడు నాయుడు.
కనపడట్లేదుట్రా గుడ్డిపీనుగా...అయితే గుడ్డివెధవకి చదువెందుకూ.. బళ్లోంచి వెళ్లిపో కసురుకున్నాడు...గుడ్డి మేష్టారు...
కళ్లలో చూపులేకపోయినా నీళ్లు నింపుకుని ఇంటికెళ్లిపోయాడు.
ఉత్తరోత్తరా ఈ కుర్రాడే 'సంగీతకళానిధి' అవుతాడని ఆ మేష్టారికేం తెలుసూ...
పైగా...మేష్టారితిట్లేదీవెనలయ్యాయి...ఆయనే కనక స్కూల్లోంచి పొమ్మనకపోతే...మన నాయుడుగారు కూడా ఏ సెకండ్‌ఫారమో చదువుకుని ఎక్కడో గుమాస్తా అయ్యేవాడేమో!
ఆంధ్రదేశానికి సంగీతంలో అనర్ఘరత్నాన్ని అందించిన ఆ మేష్టారికి
జోహార్లు...

-।-।-।-।-

కళ్లలో నీళ్లు కక్కుకుని
ఇంటికొచ్చిన నాయుడు కనబడటం మానేసాడు.
పిల్లాడేమైపోయాడో అని తల్లీ తండ్రీ అంతా గాభరాపడ్తున్నారు.
అన్న వెంకటకృష్ణయ్య...ఊరంతా వెతికి ఉసూరుమని ఇంటికొచ్చాడు.
వెంకటకృష్ణయ్య వాయులీన విద్వాంసుడు.
మనసు బాగోలేక కాస్సేపు వయొలిన్ వాయిద్దామనుకుని పెట్టెతెరిచాడు. వాయులీనం లేదు!!
గుండె గుభేలుమంది...వాయులీనం తన ప్రాణం.... దాన్ని తనకి తెలీకుండా ఎవరూ ముట్టుకోరే....
ఇల్లంతా వెతికితే...ఒకచోటనించి నాదం వినిపించింది!
మేడమీద కూర్చుని...తదేకధ్యానంతో వాయులీనం వాయిస్తున్నాడు తమ్ముడు...

ఆశ్చర్యపోయాడు అన్న...
వీడువాయులీనమెప్పుడు నేర్చుకున్నాడూ.
..గమకాలంత సాగనుగా ఎలా పలికిస్తున్నాడూ...అని
కాని అలా వింటూనే ఉండిపోయాడు.
ఆ వాయులీనంలో ఏదో మెత్తదనం...
ఆ వాయులీనంలో ఏదో మత్తుదనం ఉంది..
వాయులీనం వింటుంటే హృదయం మీటినట్టుంది!



# ద్వారం వెంకటస్వామి నాయుడు

వీడు సామాన్యుడు కాడు కారణజన్ముడు..!
సరస్వతీ కటాక్షం సంపూర్ణంగా ఉన్న నాదయోగి.
అంతే...వెంటనే అన్న గారొక నిర్ణయానికొచ్చి...
తమ్ముణ్ణి తీసుకుని వీణా విద్వాంసులు తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారి శిష్యుడైన సందివనం వెంకన్న గారి దగ్గరకి తీసుకెళ్లి శిష్యుడిగా చేర్పించాడు!
అదిగో అన్నయ్య అంటే వాడూ!!
ద్వారం వెంకటస్వామి నాయుడి తపస్సు ఆరంభమయింది..
తనకి దృశ్యం కనపడదు...శ్రావ్యం తప్ప...
ఆ చీకటి కాన్వాసుమీద... వాయులీనంతో చిత్రాలు గీయాలి...రంగులు అద్దాలి... మెరుపులు మెరిపించాలి...పూవులు పూయించాలి...
గగనంలో ఎక్కడో అందకుండా సంచరించే రాగ గంగని...భగీరథుడిలా కిందికి దించాలి...
అనంత సాగర గర్భాన...అస్పృశ్యంగా ఉండిపోయిన రాగామృతాన్ని వాయులీనంలో మధించి...మోహినినై శ్రోతలందరికీ అమృతం పంచిపెట్టాలి....!
పొద్దున్న బ్రహ్మీముహూర్తంలో వాయులీనం మీద కమాను ఆడటం ప్రారంభిస్తే... మళ్లీ అపరాహ్ణం వేళ వరకూ...అదే ధ్యాస...అదే శ్వాస...
మళ్లీ సంధ్యవేళ మొదలెడితే ఎన్నోరాగాలు మెల్లిమెల్లిగా గగనం వేపుకెళ్లి...విచ్చుకోడం...
వాయులీనం తీగలు నరాలు...
వాయులీనం హృదయం....
నాయుడిగారి శరీరంలో వాయులీనం అంతర్భాగం...
కేవలం...సాధన చెయ్యడయేకాక...అన్నగారితో కాకినాడసరస్వతీ గాన సభకి వెళ్లి - అక్కడికొచ్చే మహామహోపాధ్యాయులు...సంగీత సమ్రాట్టులూ అయిన...కోనేరాజపురం వైద్యనాథయ్యర్, అరియకుడి రామానుజయ్యంగార్, కాంచీపురం నాయనపిళ్లై, మహారాజపురం విశ్వనాథ అయ్యర్, పాల్ఘాట్ అనంత రామభాగవతార్ మొదలైన గాత్ర విద్వాంసులూ, బెంగుళూర్ నాగరత్నం, తిరువాలూర్ రాజయ్, వసంతకోకిల, కోయం బత్తూర్ తంబి, ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి -మొదలైన గాయనీమణులు తిరుకోడికావల్ కృష్ణయ్యర్, మలైకోటయ్‌గోవిందస్వామి పిళ్లైవంటి వయొలిన్ విద్వాంసులు, వీణ శేషన్న, సంగమేశ్వరశాస్త్రి వంటి వైణికులు- దక్షిణామూర్తి పిళ్లై...అళహనంబి మొదలైన మృదంగ విద్వాంసులు - ఇంకా ఎంతో మంది హిందుస్థానీ గాయకులను సునిశితంగా పరిశీలించి...సంగీతంలోని ఎన్నో మెళుకువల్ని వంటబట్టించుకున్నారు ద్వారం.

-।-।-।-।-।-

'మై ఫ్రండ్స్' అనే సంగీత సభ...
సంగీత విద్వాంసులంతా తమతమ ప్రతిభా 'పాట'వాల్ని ప్రదర్శిస్తున్నారు.
చివరగా నాయుడొచ్చాడు...
'సాదాసీదా మనిషి...నల్లకళ్లద్దాలు...బక్కపల్చని శరీరం...వాణికి నమస్కారం చేసి వాయులీనం చేపట్టాడు....
సవ్యసాచైపోయాడు...
ఎడాపెడావాయిం చేస్తున్నాడు...
ప్రేక్షకులు తెలీని మత్తులోపడి కొట్టుకుపోయినారు.
సభ అయిపోయింది.
వెంటనే...సభలో ఉన్న కవి 'మారేపల్లి రామచంద్ర శాస్త్రి గారు' గబగబా వేదికనెక్కి... నాయుణ్ణి కావలించేసుకునీ...తన చేతికున్న వజ్రపు టుంగరాన్ని నాయుడివేలికి తొడిగి...

'అదరగొట్టేశావు ఫిడేల్ నాయుడూ...'అని ఆనందబాష్పాలు రాల్చాడు. ఏ సుముహూర్తంలో కవి 'ఫిడేల్ నాయుడు' అన్నాడోగానీ...ఆ పేరే స్థిరపడిపోవడం...సార్థకత చెందడంగూడ జరిగాయ్!

-।-।-।-।-

ఎంత నేర్చుకున్నా నాయుడు సంగీత దాహం తీరలేదు!

సరే విజయనగరం సంగీత కళాశాల్లో చేరి ఇంకానేర్చుకుందాం అని బయలుదేరాడు...

తీరా అక్కడ ప్రిన్సిపాల్ ఎవరయ్యా అంటే...హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు గారు...!

'ఏదీ వాయించూ' అని ఆజ్ఞ జారీచేసారు దాసుగారు!

నాయుడు ఫిడేలు అందుకున్నాడు...

సరే రేపు కోరుకొండ ప్యాలెస్‌కి రా...ఆనంద గజపతిరాజా వారు గూడా విన్నాక...నిన్ను చేర్చుకోవాలో వద్దో నిర్ణయిద్దాం...అన్నారు దాసుగారు.

మర్నాడు... సంధ్యవేళ

విజయనగరం కోరుకొండ రాజభవనంలో నాయుడి వయొలిన్ కచేరీ!

సభలో ఆనంద గజపతులతో పాటు... ఆయన స్నేహితులు బంధువర్గమూ...కొంతమంది విదేశీయులు వగైరా కూడా ఉన్నారు.

ఫిడేల్ శృతి చేసుకుని మొదలెట్టాడు. ఘనరాగ పంచకంలోని నాటరాగంలో... అగరుపొగలై పోయిన రాగాలు...అలాఅలా గాల్లో తేలుతూ... మఖ్‌మల్ తెరల్ని స్పర్శించి...పెద్దపెద్ద షాండిదిల్‌లోని వెలుగులోని ముట్టుకునీ... ప్రాంగణమంతా పాకి...శ్రీరాగంలా అమృతం కురిపించీ...వినమ్రమై నిలిచింది!

చప్పట్లు మారుమ్రోగాయ్!

ఆనందగజపతులవారు ఆదిభట్ల వారి వైపు విలాసంగా చూసారు!

దాసు గారూ...నాయుడి వైపు పరీక్షగా చూస్తూ... 'అబ్బాయ్ నువ్వేమీ అనుకోకు...నీకు విద్యార్థిగా సీటు రావడం కష్టం' అన్నారు!

గుండె ఆగినంత పనైంది! నాయుడి గార్కి... మళ్లీ దాసు గారే అందుకుంటూ లేకపోతే పుంభావ సరస్వతివి నువ్వు విద్యార్థివేంట్రా...చక్కగా ప్రొఫెసర్‌వై...అందరికి నేర్పించూ...అని ఆశీర్వదించారు.

నాయుడిగారి కళ్ల చీకట్లపైన ఎన్నో మెరుపులు... విజయనగరం సంగీతకళాశాల వయొలిన్ అధ్యాపకులు శ్రీ ద్వారం వెంకట స్వామి నాయుడు.

-।-॥-।-॥-'।-

నాయుడు గారు దాదాపు భారత దేశంలో ఉన్న అన్ని సంగీతసభల్లోనూ వాయించారు. 1941లో మద్రాస్ మ్యూజిక్ అకాడమీ కి అధ్యక్షత వహించి 'సంగీత కళానిధి' అన్న బిరుదు తీసుకున్నారు.

1940లో మైసూర్ మహారాజా వారిచే 'బంగారు రాజముద్రికతో పాటు సంగీత రత్నాకర బిరుదు. 1949లో విజయవాడ పురపాలక సంఘం ఆధ్వర్యంలో పౌర సన్మానం....అదే సంవత్సరం ఆంధ్ర విశ్వ విద్యాలయం వారి చేత' 'కళాప్రపూర్ణ'...1953లో 'రాష్ట్రపతి అవార్డు'...1957లో 'పద్మశ్రీ' అదే సంవత్సరం వెంకటేశ్వర విశ్వ విద్యాలయం చేత 'డి.లిట్'.

ఇలా ఎన్నో బిరుదులూ, సన్మానాలూ...అన్నట్టు చెప్పడం మర్చిపోయాను...ద్వారం వెంకటస్వామి నాయుడు ప్రసిద్ధుడైపోయాక... చిన్నప్పుడు 'గుడ్డిపీనుగా' అని తిట్టిన మాష్టారొచ్చి...నన్ను



క్షమించు నాయనా నువ్వింతటవాడవౌతావని ఎరగన్రా అని కంటతడి పెట్టుకుంటే...మీరు ఆ రోజు తిట్టారు గనుకే ఇంతటివాణ్ణయ్యాను మేష్టారూ అన్న సౌమ్యుడు ద్వారం...

-।-।-॥-'।-।-।

1964తో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నాయుడి గారిని ఆస్థాన విద్వాంసునిగా నియమించింది...ఆ సందర్భంగా సంగీత నాటక అకాడమీ చేసిన సన్మానం అందుకున్న రాత్రి...నాయుడిగారికి గుండెపోటు వచ్చింది!

మిత్రుడూ...మృదంగవిద్వాంసుడూ అయిన కోలంక వెంకట్రాజు గారు పక్కన ఉండగా...ద్వారం వారి ప్రాణ వాయులీనం అనంత వాయువుల్లో విలీనం అయిపోయింది!!.

**-తనికెళ్ళ భరణి**

'హాసం' పత్రిక మొదట చదివేది మీరు ప్రతి పక్షము చేసే "మహామాన్వితుల పరిచయం" గురించిన వ్యాసం. వ్యాసం ఏదయినా వ్యక్తి(మీరు పరిచయం చేయబడీ) ఎవరయినా మీరు పరిచయం చేసే అనుక్రమంలో సందర్భానుసారంగా వ్రాసే, చెప్పే కఠోర జీవిత సత్యాలు, పరిచయం చేయబడేవారి గురించి మీరు వాడే అలంకారాలు బాగా ఆకట్టుకుంటాయి. 16-31 అక్టోబరు సంచికలో పరిచయం చేయబడిన పప్పువెంకన్న గారిమీద వ్యాసం అందుకేం భిన్నమైంది కాదు. గున్నమామిడి చెట్టుచప్టామీద తంబూరామీటుతూ పాడుతున్న వెంకన్నగారి గానమాధుర్యాన్నిగ్రోలుతున్న ముగేస్తున్న వాళ్ళావిడ, నేమరుమానిన గోమాత, ఉడతా, చిలకా, ఊయల్లోని వటపత్రసాయి అంటూ సాగిన మీ పరిచయ వాక్యాలు చదువరిని నిలబెట్టేస్తాయి,మళ్ళీ మళ్ళీ చదివించుకుంటాయి. మద్రాసు ఆంధ్ర మహాసభలో వెంకన్న గారు రాజాగారి అనుజ్ఞలేకుండా పాడుతున్నానన్న భావన, రాజాగారు రాగానే తటాపటాయించిన వారి గానం, వారి మహోన్నత వ్యక్తిత్వాన్ని చెప్పకనే చెప్పాయి. ఈనాటి పరిస్థితులను తలచుకుంటే ఎంత గొప్ప విషయమది. మనిషి (యజమానైనా సరే) వెనుకనే విమర్శించే ఘనులున్నారీనాడు. ఈ వ్యాసంలో మీరు వ్రాసిన మరో జీవిత సత్యం "ఎంత విద్వత్తున్నా ఆదరించే వారులేక అష్టదరిద్రాలు అనుభవించి అంతరించిపోయిన వారు ఎందరు లేరు" అన్నది ఒక కళాకారులకే కాదు అన్ని రంగాలకు వర్తిస్తుంది. అక్షరాల సత్యం. నాకు తెలిసి మా శాఖలో ఎందరి కథ అలా ముగిసింది.

-జి. ప్రభాకర్‌రావు
హైదరాబాద్

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

తనికెళ్ళ భరణి,
కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం,
13-1-212, మోతీనగర్,
హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

# సరిగమలు - గలగలలు



## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకుడు)

**పెండ్యాల నాగేశ్వరరావు గారు అద్భుతమైన సంగీత దర్శకుడు. మొట్టమొదటిసారి ఆయన్ని విజయవాడలో దుర్గా కళామందిరంలో 'జగదేకవీరుని కథ' శత దినోత్సవ సభలో చూశాను. నా జీవితంలో ఎంతో అనుభూతి పొందిన క్షణాలు అవి. అమ్మ, నాన్న, అన్నయ్యలతో వెళ్లాను. మా చిన్నాన్న గారు గోఖలే (కళాదర్శకుడు) గారితో అందరం వెళ్లాం. ఆ సినిమాలో అన్ని పాటలూ బావున్నా 'శివశంకరీ' పాట నా హృదయంలో చెరగని ముద్ర వేసింది. పింగళిగారు, పెండ్యాల గారు, ఘంటసాల గారు ఎంత గొప్ప కాంబినేషన్! అలాగే రామారావుగారి అభినయం!!**



శ్రీ పెండ్యాల

ఆ సభలో పాల్గొన్న మహామహుల్ని చూస్తే దేవుళ్లు, దేవతలని చూసిన అనుభూతి పొందాను. అందరూ ఘంటసాల గారిని 'శివశంకరీ' పాట పాడమని అడిగారు. 'ఎంతో శ్రమించి ఈ పాట పాడాను, మొత్తం పాటంతా పాడాలంటే ఇప్పుడు నా వల్ల కాదు, పల్లవి వరకు పాడుతానని చెప్పి, అసలు ఇంత గొప్ప పాటని కంపోజ్ చేసిన పెండ్యాల గారికే ఈ అభినందనలన్నీ దక్కుతాయి, అని ఎంతో వినమ్రంగా చెప్పారు. ఆ పల్లవి పాడితే ఎంత రెస్పాన్స్ వచ్చిందో చెప్పలేము. పెండ్యాల గారయితే ఆనంద బాష్పాలు తుడుచుకుంటూనే ఉన్నారు.

అసలు పెండ్యాల గారిలో ఎంత అణకువ! మాటలో,దుస్తులు ధరించటంలో అంతా తెలుగుతనం. చాలా సౌమ్యుడాయన. ఆయన స్వరపరచిన ఎన్నో పాటలు మేము కచేరీలలో పాడుతుండేవాళ్లం. 'శివశంకరీ' పాట కచేరీలలో నేను వాయిస్తున్నప్పుడు ఎంతో అనుభూతి పొందేవాణ్ని.

మద్రాసు వెళ్లిన తరువాత 1975 ప్రాంతంలో మొట్టమొదటిసారి ఆయన వద్ద కీబోర్డ్ వాయించే అవకాశం వచ్చింది. నేను, నా భార్య 'దేవి' థియేటర్‌లో ఏదో సినిమా చూడటానికి వెళ్లాం. కమాల్‌దాస్ (ఆర్కెస్ట్రా ఇన్‌ఛార్జ్) గారు నన్ను వెతుక్కుంటూ థియేటర్‌కి వచ్చి ఇంటర్‌వెల్‌లో నన్ను పట్టుకున్నారు. ఎంత ఇబ్బంది పెట్టావయ్యా బాబూ అన్నారు. రేపటి నుండి పెండ్యాల గారి సినిమాకి రీ రికార్డింగ్ వుంది. నువ్వు కీబోర్డు వాయించాలన్నారు. మాటల్లో చెప్పలేని, రాతల్లో రాయలేని మధురానుభూతిని పొందాను.

మర్నాడు వాహిని 'ఎ' థియేటర్‌లో రీ రికార్డింగ్. ఆ సినిమా పేరు 'సతీసావిత్రి'. సౌండ్ ఇంజనీర్ వల్లభజోస్యుల శివరాం గారు నాకు తాతయ్య వరుసవుతారు. వెళ్లగానే ఆయనకి నమస్కారం చేశాను. ఆయన నన్ను పెండ్యాల గారికి పరిచయం చేశారు. పక్కనే రామారావుగారి సోదరులు త్రివిక్రమరావు గారున్నారు. అందరికీ పాదాభివందనం చేశాను. పెండ్యాల గారు 'నాయనా, నువ్వు రాజేశ్వరరావు గారు, చలపతిరావుగారు ఇలా అందరి దగ్గరా వర్క్ చేస్తున్నావని తెలిసింది. మీ బాబాయిలు నాకు చాలా కావలసినవాళ్లయ్యా. మీ ఇంటి పేరు నిలబెట్టు' అని ఆశీర్వదించారు. దైవఘటన ఏంటంటే 'సతీసావిత్రి'కి ఆర్ట్ డైరెక్టర్ గోఖలే గారు. సత్యం గారు పాడారు. అన్నయ్య పాడాడు, నేను వర్క్ చేస్తున్నాను. మేమందరం కలిసి వర్క్ చేసిన ఒకే ఒక సినిమా అది.

అక్కడ తబలా లక్ష్మణరావుగారు, పెండ్యాల గారి అసిస్టెంట్ బాబూరావు గారు, తబ్లా లక్ష్మీనారాయణ, వయొలిన్ వాయించే అచ్యుతశాస్త్రి గారు, నంజప్ప (ఫ్లూట్) గారు లాంటి మహానుభావులు పరిచయం అయ్యారు. అచ్యుతశాస్త్రి గారు ఒకసారి విజయవాడలో పెళ్లికి వచ్చారు. వాళ్ల బంధువులది. అక్కడ ఆయన ఒక ప్రోగ్రామ్ చెయ్యాలంటే నేనూ, ఒక రిథం ప్లేయర్ పాల్గొన్నాం. ఆయన నన్నెంతో మెచ్చుకున్నారు. ఆ విషయం పెండ్యాల గారితో చెప్పారాయన.

నాకు పెండ్యాల గారిలో నచ్చిన విషయం ఏమిటంటే ఆయన ఎవర్నీ నొప్పించకుండా ఆయనకి కావలసిన పెర్‌ఫక్షన్ కోసం ఎంతో తపన పడే వారు. టాక్‌బ్యాక్ బటన్‌లో మాట్లాడకుండా, ప్లేయర్స్ వద్దకు వచ్చి మంచి సూచనలిచ్చి వెళ్ళేవారు. ఒక మాదిరిగా వాయించే ప్లేయర్స్ కూడా ఆయన దగ్గర ఎంతో ధైర్యంగా, ఎంతో బాగా వాయించే వారు. అలాగే ఏనాడూ ఎవర్నీ విసుక్కొనే వారు కాదు. 'మంచి సంగీతం అందించటం కోసం ఎంతో తపన పడే గొప్ప సంగీత దర్శకుణ్ని ఆయనలోనే చూశాను.పెర్‌ఫక్షన్ కోసం పరితపించే పెండ్యాల వారంటే నాకు వల్ల మాలిన అభిమానం.



అందరికీ తెలిసిన విషయమే! సుశీల గారినీ, జానకిగారినీ తెలుగు తెరకు పరిచయం చేసిన ఘనత ఆయనదే. ఆయనకి ఘంటసాల గారంటే ప్రాణం. ఎటువంటి గొప్ప పాటల్ని స్వరపరిచారు ఆయన! ముఖ్యంగా 'రసికరాజు తగు వారము కాదా', 'శివశంకరీ - శివానంద లహరీ', 'కొండగాలి తిరిగిందీ,' 'అనురాగము విరిసేనా', రాముడు భీముడు పాటలు. ఇలా రాసుకుంటూ పోతే ఎన్నని చెప్పగలం? తిలక్ కామోద్, మోహన్, అభేరి, కల్యాణి, హిందోళ, కాపీ, భాగేశ్వరి ఇలా ఎన్నో రాగాలలో ఎన్నో మంచి పాటల్ని మలచారు.

పద్యాలు స్వరపరచటంలో మహామేధావి ఆయన. తగునా ఇది మామ, సరదా సరదా సిగిరెట్టూ లాంటి హాస్య గీతాలూ 'మాణిక్యవీణ' లాంటి భక్తి గీతాలూ, అనురాగము విరిసేనా లాంటి మృదుమధుర గీతాలూ, శివశంకరీ లాంటి సంగీత ప్రధానమైన గీతాలూ, ఇలా ఏ రసాన్నయినా ఆయన పాటల్లో పద్యాల్లో చూపించేవారు.

'పెండ్యాల - ఘంటసాల' కాంబినేషన్ నాకు తెలిసి తెలుగు సినీ వైభవానికి మణిదీపం. మకుటాయమానం. గుప్తుల కాలం అంటామే అలా పెండ్యాల, రాజేశ్వరరావు, ఘంటసాలల కాలం అని చెప్పటం ఎంతో సమంజసం. కర్ణాటక సంగీతానికి త్యాగరాజు, శ్యామాశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితార్ల వలే సినీ సంగీతానికి ఈ ముగ్గురూ అని నా అభిప్రాయం.

అలాగే తరువాతి తరంలో భగవంతుడు మనకిచ్చిన అద్భుతమైన గాయకచక్రవర్తి బాలసుబ్రహ్మణ్యం గారితో ఎంతో కాలం గుర్తుపెట్టుకొనే మంచి పాటలు పాడించారు. (ఉదా: నా పేరు బికారీ, చిత్రం భళారేవిచిత్రం లాంటి పాటలు)

అలాగే ఘంటసాల, సుశీల, పెండ్యాల కాంబినేషన్‌లో వచ్చినవన్నీ గొప్ప పాటలే! మహాగాయని జానకిగారు తక్కువ పాటలు పాడినా అన్ని సూపర్‌హిట్స్.

మా అన్నయ్య రమేష్, సుశీల గారు పాడిన 'కలగంటినో స్వామి' (దానవీరశూరకర్ణ) పాటంటే నాకెంతో ఇష్టం. వేములవాడ భీమకవిలో అన్నయ్య చేత మంచిపాటలు, పద్యాలూ పాడించారు.

ఒక సంఘటనని నేను మరిచిపోలేను. పెండ్యాల గారి వద్ద 'కళారంజని' (అది ఆయన ఆఖరి సినిమా అనుకుంటా), రీ రికార్డింగ్ 'భరణీ'లో జరుగుతోంది. నా దగ్గర ఒక Samsomito bag ఉండేది. మర్నాడు హైదరాబాద్‌లో బాలుగారి కచేరికి నేను వెళ్లాలి. మార్నింగ్ ఫ్లయిట్ టిక్కెట్, 450/-రూ॥ల క్యాష్ ఆ బ్యాగ్‌లో ఉన్నాయి. ఆ బ్యాగ్ లో అనుకోకుండా ఎవరో ఆ బ్యాగ్‌ని దొంగిలించారు. దానికి ఆయన ఎంత బాధపడ్డారో! ఎంత సున్నితమైన హృదయమో ఆయనది! ఎక్కువగా నడక ఇష్టపడే వారు. పెద్దపెద్ద అంగలేసుకుంటూ హుందాగా నడచేవారు.

గుంటూరులో ఆయన సంగీత విభావరి జరిగింది. దానికి నేను కీ బోర్డు ప్లేయర్‌ని. ' నా పేరు బికారీ' పాటకి హార్మోనియం వాయించాను. ఆ పాటను వాయించింది ప్రఖ్యాత సంగీత దర్శకులు వేణుగారు. ఆ పాటలో BGMS వాయిస్తున్నప్పుడు హార్మోనియం బిట్స్ అన్నీ ఇలా ఉండాలి అని దగ్గరుండి చెప్పేవారు రిహార్సల్స్‌లో.

ఒకసారి పి.బి.శ్రీనివాస్ గారు నాతో మాట్లాడుతూ ఘంటసాల గారంటే పెండ్యాల గారికి ఎంత అభిమానమో వివరిస్తూ ఒక సంఘటన చెప్పారు. 'మంటలు రేపే నెలరాజా' (రాము) ఒరిజినల్ వెర్షన్ తమిళంలో పి.బి.ఎస్. గారు పాడారు. 'ఆ పాటని పిబిఎస్‌గారు ఎంతో అద్భుతంగా పాడాను, నేను ఎంతవరకు న్యాయం చేయగలనో చూడాలి' అని ఘంటసాల గారు పెండ్యాల గారితో అన్నారట. ఆ విషయం పెండ్యాల గారు ఒక సందర్భంలో పిబిఎస్ గారితో చెబుతూ 'ఘంటసాల గారు మిమ్మల్ని ఆ పాట ఎంతో బాగా పాడారని మెచ్చుకున్నారండీ' అన్నారుట. ఘంటసాల గారు చెప్తే పెండ్యాల గారికి తిరుగులేదు' అన్నారు పి.బి.ఎస్.గారు.

ముఖ్యంగా నేను 'భైరవద్వీపం'లో 'శ్రీ తుంబురనారద నాదామృతం' పాటని కంపోజ్ చేయటానికి ముఖ్యమైన ఇన్స్పిరేషన్ 'శివశంకరీ' పాట. విజయా సంస్థలో రామారావు గారికి 'శివశంకరీ' పాట ఎంతో గొప్ప పేరు సంపాదించి పెట్టింది. అలానే అదే సంస్థలో తరువాతి తరం వాళ్లమైన నాగిరెడ్డిగారి కుమారులు వెంకటరామిరెడ్డిగారు, నేను, వేటూరి గారు, బాలకృష్ణ గారు, సింగీతం శ్రీనివాసరావు గార్ల కాంబినేషన్‌లో ఎంతో కసిగా ఈ పాట ప్రాణప్రతిష్ఠ చేశాము. 'దర్బార్ కానడ' రాగంలో పెండ్యాల గారు 'శివశంకరీ' పాటని కంపోజ్ చేస్తే, పల్లవి, మొదటి చరణం వరకు 'అభేరి'. రెండవ చరణంలో షడ్జమానికి హంసధ్వని, రిషభానికి కేదారిగౌళ, గాంధారానికి మోహన, మధ్యమానికి హిందోళ, పంచమానికి సరస్వతి,ధైవతానికి చక్రవాకం, నిషాదానికి కల్యాణి రాగాలలో 'శ్రీతుంబర నారద గానామృతం' పాటని కంపోజ్ చేశాను. వేటూరి గారు అద్భుతంగా రచించగా, బాలసుబ్రహ్మణ్యం గారు అమోఘంగా ఆలపించగా, బాలకృష్ణగారు ఇచ్చిన 'లిప్ మూవ్‌మెంట్' ఎక్స్ట్రార్డినరీగా వుండటం దైవఘటన. ఈ పాటని పెండ్యాల గారు విని ఆశీర్వదిస్తే నా జన్మకి సార్థకత ఉండేది. కానీ నాకా భాగ్యం లేదు.

'విశ్వనాథ నాయకుడు' చిత్రానికి మొదటి పాట రికార్డ్ చేస్తున్నారు. జె.వి.రాఘవులు గారి సంగీత పర్యవేక్షణ. ప్రసాద్‌లాబ్ 70 ఎం.ఎం. రికార్డింగ్ థియేటర్‌లో ముహూర్తం. వడ్డే రమేష్‌గారు నిర్మాత. నేను కీ బోర్డ్ ప్లేయర్‌ని ఆ పాటకి. మధ్యాహ్నం 12 గంటల ప్రాంతంలో పిడుగులాంటి వార్త 'పెండ్యాల గారు పరమపదించారని'. ఎస్పిబి గారి కోసం అందరం వెయిట్ చేస్తున్నాం. బాలుగారే రాగానే ఈ వార్త చెప్పారు. మా రికార్డింగ్ అయ్యేటప్పటికి ఆయన భౌతిక కాయాన్ని ఖననం చేశారు. గురువుగారి భౌతిక కాయాన్ని చూడలేక పోయానని ఎంత బాధపడ్డానో ఆ భగవంతుడి కెరుక.

మళ్లీ ఒక పెండ్యాలగారు పుడతారని నేననుకోను. ఆయన ఆశీర్వాదం సినీ సంగీతాభిమానులందరికీ లభించాలని మనసా వాచా కర్మణా కోరుకుంటున్నాను.



# విశ్వ సంగీత ప్రేమ యాత్రికుడు "యాన్నీ"

**పసితనంలో ఎప్పుడో ఎక్కడో విన్న సంగీతం అతడి మనసును కట్టి పడేసింది. ఆ సంగీత మాధుర్యంలోని రహస్యాలు అతడికి అర్థం కాకుండా వేధించాయి. తెలుసుకోవాలనే తలంపు అతడిని నిలువనీయకుండా వెన్నాడింది. ఆ తలంపే అతడిని సంగీత ప్రపంచ పటంలో కెక్కించింది. అతడే "యాన్నీ".**

యాన్నీ ప్రేమమందిరమైన తాజ్‌మహల్ ముందు పాశ్చాత్య సంగీత ప్రదర్శన చేసి భారతీయుల హృదయాలను దోచుకున్నవాడు. చారిత్రక కట్టడం తాజ్‌మహల్‌కు తన సంగీతంతో స్వరార్చన చేసాడు యాన్నీ.

గ్రీస్‌లోని కాలమాతాలో 1954 నవంబర్ 14న యాన్నీ పుట్టాడు. పూర్తి పేరు 'యాన్నీ క్రిసోమల్లిస్" సంగీత సాధనే జీవితంగా భావించాడు. ఇరవయవ ఏట 1974లో ఇల్లు వదిలి అమెరికా చేరుకున్నాడు. జీవిక కోసం ఒంటరిగా, రికామిగా దిక్కుతోచిన వైపు తిరిగాడు. ఈ ఒంటరితనానికి దూరం కావడానికి పియానోను ఆశ్రయించాడు. క్రమంగా పియానోను పలికించిన వ్రేళ్లను కీ బోర్డువైపు మళ్లించాడు. ప్రావీణ్యతను గడించాడు. ఎందరో సంగీతకారులకు కీబోర్డుతో వాద్య సహకార మందించాడు. మరో వైపు మెనెసోటా యూనివర్శిటీ నుండి సైకాలజీలో పట్టభద్రుడైనాడు. ఇంతలో ఒకానొక రాక్ మ్యూజిక్ ట్రూప్‌లో "కీ బోర్డు ప్లేయర్"గా చేరాడు. కేవలం 600 డాలర్ల వేతనంతో దుర్భరమైన దారిద్ర్యాన్ని గడిపాడు.

ఒకరి మోచేతి కింది నీళ్లు తాగినంతకాలం మనకంటూ ఉనికి ఏర్పడదని గుర్తించి వేరేవారి నీడలో మ్రగ్గలేక ఆ బృందం నుండి బయట పడ్డాడు. స్వతంత్రంగా ప్రదర్శన ఇవ్వాలని చేసిన ప్రయత్నాలేవి అంత త్వరగా ఫలించలేదు. జీవిక కోసం చాలా ఉద్యోగాల్లో చేరినా ఎక్కడా వారం, పది రోజులకు మించి మనగలగ లేకపోయాడు. ఈ సంఘటనలన్నీ యాన్నీని కీ బోర్డుకు మరింత చేరువ చేశాయి. మనసులో బాధలు, భావాలు కొత్త ట్యూన్స్‌ని పలికించాయి. ఇవేమి ఆయనకు సోలో కచేరీలు చేయడానికి అవకాశాలు రప్పించలేకపోయాయి. కానీ రేడియోలో పలు ప్రోగ్రామ్‌లు చేయగలిగాడు. ఈ ప్రోగ్రామ్‌లే అతడి సంగీత జీవితాన్ని మహత్తరమైన మలుపు తిప్పాయి.

యాన్నీ సంగీతాన్ని రేడియోలో విన్న 'లిండా ఇవాన్స్' అనే వంవెాళ్ అతడిని కలుసుకోవాలని ఫోన్ చేసింది. ఇద్దరూ ఒక హోటల్‌లో కలుసుకుని స్నేహితులై పోయారు. లిండా ఇవాన్స్ అమెరికా చరిత్రలో అత్యంత ప్రఖ్యాతి పొందిన టి.వి. సీరియల్ 'ది డైనస్టీ'లో



నవంబర్ 14న యాన్నీ జన్మదిన సందర్భంగా...

'క్రిస్టీ కారంగ్టన్' పాత్ర ధారిణిగా అమెరికన్‌ల మనస్సుల్లో నిలిచిపోయిన నటి. లిండా, యాన్నిల స్నేహం ప్రేమగా మారి వివాహానికి దారి తీసింది. వివాహానికి వారి వయసుల్లో ఉన్న తేడా అడ్డురాలేదు. యాన్నీకన్నా లిండా వయసులో 12 ఏళ్లు పెద్ద.

లిండా తన జీవితంలోకి వచ్చిన తరువాత యాన్నీ సంగీతకారుడుగా క్రమంగా ఎదుగుతూ వచ్చాడు. ఆమెనే నిర్వాహకుల వద్దకు వెళ్లి యాన్ని కచేరీలు ఏర్పాటు చేయించేది. ఆ కార్యక్రమాల ముందు లిండా ప్రత్యేకంగా కనిపించేది. అయితే "వాస్తవానికి ప్రేక్షకులు ఆమెను చూడటం కోసమే వచ్చి, ఆ తరువాత సరేలే అని యాన్నీ సంగీతంను కూడా వినేవారని" కూడా అంటారు. లిండా కలిసే నాటికే యాన్ని ఓ ఆల్బంను విడుదల చేసి ఉన్నాడు. కానీ అదంత బాగా క్లిక్ అవలేదు.

లిండా తొలిసారిగా 'విన్ ఫ్రే ఒపేరా'లో యాన్నీ షోని ఏర్పాటుచేసింది. ఆ తరువాత ఈ షో కేసెట్‌ను 'రిఫ్లెక్షన్స్ ఆఫ్ పాషన్స్''గా విడుదల చేసారు. అనంతరం ఒక ప్రదర్శనకు ముందు లిండా "తనకు పరిచయమున్న మగవారందరిలో యాన్నీ అత్యంత గొప్పవాడైన మగవాడు'' అని ప్రకటించడంతో అతని ఆల్బమ్స్ అమ్మకాలు ఒక్కసారిగా మూడు లక్షల కాపీలకు చేరుకున్నాయి. ఏది ఏమైనా లిండానే యాన్నీలోని సంగీత ప్రతిభను వెలికి తీసి ప్రపంచానికి చూపింది. "ప్రపంచం కోరుకునే అత్యద్భుతమైన సంగీతం నీలో ఉందన్న సంగతి ఎవరికీ తెలీదు. దానిని కళాప్రియులందరికి చేరువ చేయడమే నా లక్ష్యం" అన్న లిండా తన లక్ష్యాన్ని సాధించింది.

అయితే యాన్నీ క్రమంగా లిండా వల్లనే ఎదుగుతున్నాడనే విమర్శలకు సమాధానంగా కొత్త కొత్త ట్యూన్స్ వినిపించడం ప్రారంభించాడు. అవన్నీ ఒకదాని మించిన ఒకటి హిట్ అయి అతడ్ని ఉన్నత స్థానానికి చేర్చాయి.

యాన్నీకి ఆధ్యాత్మికత పట్ల అమితమైన విశ్వాసం. సంస్కృతి, సంప్రదాయాలంటే మక్కువ. అందరు పాశ్చాత్య సంగీతజ్ఞుల మాదిరిగా స్టేడియంలలో, ఆడిటోరియంలలో ప్రదర్శనలిచ్చే ఆచారానికి దూరంగా వుంటాడు. నాగరికతా చిహ్నాలైన, ప్రశస్తిగాంచిన పురాతన, చారిత్రక కట్టడాల ముందు కచేరీలు చేయడానికే ఇష్టపడతాడు. గ్రీకు నగరంలో "హేరోడ్ అట్టికస్" వాతావరణం గల "ఆక్రోపోలిస్'' నిర్మాణం వద్ద తొలి విశిష్ట కచేరీ చేశాడు. ఆ తరువాత చైనా నగరంలో వదిలివేసిన నగరం "ఫ్రర్‌బిడిన్'' సిటీ వద్ద ప్రదర్శన ఇచ్చాడు. ఈ నేపథ్యంలో తన మూడవ మజిలీగా భారతదేశంలోని ప్రేమ మందిరం ''తాజ్‌మహల్''ను ఎంపిక చేసుకున్నాడు.

యాన్నీ సంగీత కచేరీ చేయడానికి తాజ్ మహల్ ప్రాంగణాన్ని ఎంచుకున్నది మొదలు పలు రకాల వివాదాలు మొదలైనాయి. శబ్ద కాలుష్యం వల్ల "తాజ్"కు నష్టం వాటిల్లుతుందని, ఆ పరిసర ప్రాంతాలలోని రైతుల నష్టపరిహారం విషయం,

రోమిల్లా థాపర్ వంటి చరిత్రకారుల నుంచి, పర్యావరణ పరిరక్షణ సంస్థల నుంచి పలు రకాల విమర్శలను, అభ్యంతరాలను ఎదుర్కొనవలసి వచ్చింది. అయితే సుప్రీంకోర్టు యాన్నీ సంగీత ప్రదర్శనకు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడంతో యాన్నీ చిరకాల వాంఛ నెరవేరేందుకు మార్గం సుగమమైంది. ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది మంది అభిమానులు ఎదురు చూస్తుండగా 45 మంది అనుచరులతో వాద్య ఘోషల నడుమ అమెరికాకు చెందిన స్పెషల్ 32-ట్రాక్ సోనీ ఆడియో సిస్టమ్ సహకారంతో తన స్వర విన్యాసాన్ని పూర్తిచేశాడు యాన్నీ. ధ్వని, కాంతి ప్రభావం తాజ్‌పై పడకుండా ఫ్రెంచ్ శాస్త్రవేత్తలు రూపొందించిన తెరను వేదిక వెనుక నిర్మించారు. పండు వెన్నెల రాత్రి, వెనుక తళతళమని మెరిసే పాలరాతి నిర్మాణం తాజ్‌మహల్ ముందు ధగధగమెరిసే వేదిక మీద యాన్నీ కీ బోర్డుపై వేలికొనలను అలవోకగా కదిలిస్తూ సృజించిన సంగీతం విన్నవారికి అదో మధురానుభూతి.

కళాకారుడికి భాష, మతం, జాతి, ప్రాంత భేదాలు లేవని, సంగీతానికే హద్దులు లేవని నమ్మే యాన్నీ తాను గతంలో "తాజ్‌మహల్‌ని ఫోటోలలో చూసినప్పటి నుండి నాలో భావోద్వేగం పెరిగిపోయేది" అనే యాన్నీ తాజ్ అందాలకు, దాని నిర్మాణ కౌశలానికి నివాళులర్పిస్తూ ఎనిమిది పాటలు ట్యూన్ చేశాడు. "తాజ్ ముందు, అందునా ప్రేమ మందిరం ముందు పాశ్చాత్య సంగీతమా?" అని అభ్యంతరాలు పెట్టే వారి మనసులను సైతం దోచుకున్నాడు. ప్రదర్శన



ద్వారా వచ్చిన ఆదాయాన్ని 150 కోట్లు తాజ్ అందాల పరిరక్షణకు వినియోగించాలని నిర్ణయించాడు యాన్నీ. ఈ నిర్ణయం తాజ్‌పై అతనికున్న ప్రేమను నిరూపిస్తుంది.

పండిట్ రవిశంకర్, బిస్మిల్లాఖాన్ వంటి అనన్యమైన సంగీతకారుల జన్మస్థానమైన భారతదేశంలో ఒక పాశ్చాత్య సంగీతకారుడు తన కచేరీతో సంగీత ప్రేమికుల హృదయాలను దోచుకోవడం అంత సులభ సాధ్యం కాదు. దానిని సుసాధ్యం చేసిన వాడు యాన్నీ.

తాజ్ వద్ద చేసిన స్వర సమ్మేళనాన్ని యాన్నీ "లైఫ్ ఎట్ తాజ్‌మహల్" పేర సి.డి.గా విడుదల చేశారు. మన దేశంలోని ఇవి 50 లక్షలకు పైగా అమ్ముడు పోయినట్లు ఓ సమాచారం. మైఖెలాంజిలో, డావిన్సి, క్రీస్తు, గాంధీ, మహ్మద్ ప్రవక్త తన కళకు ప్రేరణనిస్తారంటారాయన.

"సంగీతాన్ని పాశ్చాత్య, జాజ్, అరబ్బీ, కర్ణాటక, హిందుస్థానీలుగా విభజించడం సరిగాదు. ఎవరు ఎన్నిపేర్లు పెట్టి పిలిచినా అది తమ సంతృప్తి కోసమే తప్ప అదంతా ఒకే ఒక సంగీతమే" అంటాడు యాన్నీ. ఇంకా "ఏదో శాస్త్రం ప్రకారం పొందికగా కూర్చడమే సంగీతం కాదు. సంగీతం ద్వారా ప్రజలకు ఒక సందేశం అందించడమే ప్రధానం. ప్రపంచ మానవాళి భావ పరంపరను ఏకం చేయడమే నా లక్ష్యం. నా ఈ సంగీతం మానవాళిపై ప్రభావం చూపుతుందనే అనుకుంటాను" అనే యాన్నీ విశ్వసంగీత ప్రేమ యాత్రికుడు.

-హెచ్.రమేష్‌బాబు

---




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. దధి (చిరంజీవులు... తెల్లవారవచ్చె...)
   ఎ) పాలు  బి) సముద్రము
   సి) నీరు  డి) పెరుగు
2. కెందూళి
   (చిరంజీవులు...కనుపాప కరవైన)
   ఎ) సాయంత్రం  బి) బంతి
   సి) ఎర్రటిదుమ్ము, డి) సమూహం
3. నవకము
   (చిరంజీవులు... ఎందాకా ఎందాకా)
   ఎ) కొత్తది  బి) మృదుత్వము
   సి) కవిత్వము  డి) శ్రమ
4. వైతాళిక గీతం (బాజీ...ఈ జెండా)
   ఎ) పాట  బి) పొగడ్త
   సి) కవిత  డి) మేలుకొలుపు
5. కపోతం (బాజీ...ఈ జెండా)
   ఎ) చిలక  బి) పావురం
   సి)చెక్కిలి  డి) బలిసిన పక్షి
6. తైలం (బాజీ...కళ్లల్లో ద్రాక్షరసం)
   ఎ) నువ్వులు  బి) పెట్రోలు
   సి) తలకు సంబంధించినది
   డి) నూనె
7. యావ (బాజీ...పుల్లనీ పుల్లట్టు)
   ఎ) ధ్యాస
   బి) యౌవనము
   సి) ప్రయాణము
   డి) మొత్తము
8. కొలువు (నీ స్నేహం...కొంతకాలం కిందట)
   ఎ) ఆస్థానము  బి) కొలత
   సి)జాతర  డి) నిప్పుగుంట
9. స్పర్శ (నీ స్నేహం...ఇలాచూడు)
   ఎ) తెలివి తెచ్చుకొనుట బి) తాకుడు
   సి) పోటీపడు  డి) జోడు
10. ఉప్పెన (నీ స్నేహం...ఊరుకో హృదయమా)
   ఎ) ఉప్పనిది  బి) చవుటినేల
   సి) సముద్రపు పొంగుడి) ఉబలాటము

### జవాబులు

1) d  2) c  3) b
4) d  5) b  6) d
7) a  8) a  9) b
10) c

బాలు






తెలుగు ప్రేక్షకుడికి సినిమా పాట మీద అపారమైన అభిమానం, గౌరవం కలిగించిన ఘంటసాల గాయకునిగా చిరస్మరణీయుడు, తెరస్మరణీయుడు. సంగీత దర్శకునిగా స్వరస్మరణీయుడు, స్థిరస్మరణీయుడు... 1956లో విడుదలయిన



# చిరంజీవులు

చిత్రం ఆయనలోని ఆ రెండు పార్శ్వాలను ద్విముఖంగానే కాక ప్రముఖంగా కూడా ఆవిష్కరించింది. ప్రతి పాటలోను ఏదో ఒక ప్రత్యేకతను నింపుకొన్న 'చిరంజీవులు' చిత్రంలోని కొన్ని పాటల గురించి విశేషంగా చెప్పుకోవాలి. తెలుగు సినీ కవులందరూ మనస్ఫూర్తిగా మొక్కే స్వర్గీయ మల్లాది రామకృష్ణ శాస్త్రివిందులోని పాటలను రాశారు.

అల్లవాడే - రేపల్లెవాడే ॥అల్లవాడే॥
అల్లిబిల్లి పిల్లంగోవి పాటకాడే సయ్యాటకాడే ॥అల్లవాడే॥
నీలాల కన్నుల నీటుకాడే తెరవాటుకాడే -
వాలారు చూపుల వన్నెవాడే వన్నె చిన్నెవాడే
నీలాటి రేవులు ఏలేవాడే ॥నీలాటి॥
కన్నార నినుజూచి కవ్వించివాడే ॥అల్లవాడే॥
గానాల తేనెలు చిందువాడే కనువిందువాడే
మైమరపించే మాటకాడేమోమాటకాడే
అర విరిసే చిరునవ్వులవాడే ॥అర॥
అనువైన మనవాడే అందాలవాడే ॥అల్లవాడే॥











ఈ పాటను ఘంటసాల, లీల, బృందం పాడగా ఎన్.టి.ఆర్, జమున మరికొంతమంది ఉప పాత్రధారులు అభినయించారు. మోహనరాగచ్ఛాయల పైన ఆధారపడిన ఈ గీతాన్ని ఇప్పుడు వినడం తటస్థిస్తే శ్రోతల మనసులలో రకరకాల భావాలు చెలరేగుతాయి. అందుకు ముఖ్య కారణం 'మాయా బజార్' సినిమాలోని సంగీతానికి సంబంధించిన విశేషమే! 'మాయాబజార్' సినిమాకు సంగీత దర్శకునిగా ఘంటసాల పేరువున్నా, అందులోని ముఖ్యమైన నాలుగు యుగళగీతాలూ యస్.రాజేశ్వరరావు స్వరపరిచారన్న విషయం తెలుగు సినీ సంగీతాన్ని జాగ్రత్తగా గమనిస్తూ వున్న వారందరికీ తెలుసు. అయితే అందులో చాలామంది ఆ నాలుగు పాటల్నీ రాజేశ్వరావు గారు ట్యూన్ చేయటమే కాకుండా రికార్డింగ్ కూడా చేసేసారని అనుకుంటూ ఉంటారు. కానీ ఆ పాటల ట్యూన్‌లు 'ఓకే' అయిపోయాక కొన్ని కారణాంతరాల వలన రాజేశ్వరావు గారు ఆ సినిమానుండి తప్పుకోగా ఘంటసాల గారు మిగిలిన పాటలను ట్యూన్ చేయటమే కాకుండా ఈ నాలుగు పాటలకు ఇంటర్‌లూడ్‌లు సమకూర్చి రికార్డింగ్ బాధ్యతలు అవీ నెరవేర్చారు. ఆ విషయాన్ని ఈ 'అల్లవాడే రేపల్లెవాడే' పాట ధృవీకరిస్తుంది. కావాలంటే 'మాయాబజార్' లోని 'లాహిరి లాహిరి లాహిరిలో' పాటను ఈ'అల్లవాడే రేపల్లెవాడే' పాటను పక్క పక్కన పెట్టుకుని, ఒకదాని తర్వాత ఇంకొకటి వినిచూడండి. రెండింటి రూపకల్పనలోనూ ఎంతపోలిక వుందో తెలుస్తుంది.



అ: చికిలింత చిగురు - సంపంగి గుబురు
చినదాని మనసూ - చినదానిమీద మనసూ ॥చికిలింత॥
ఆ: మనసైన చినదానికి అందానికీ ॥మనసైన॥
కనుసైగ మీద మనసూ
అ: ఆ...ఆ...ఆ...
ఆ: ఆ...ఆ...ఆ...
అ: చెంపకు చారడేసి కన్నులున్న చిన్నదీ
చిన్నదాని సిగలో రేకలెన్నో గువ్వకన్ను రైకమీద చుక్కలెన్నో
ఆ: ఎన్నుకో - వన్నెలెన్నుకో - చిన్నెలెన్నుకో ॥ఎన్నుకో॥
వన్నెచిన్నెలెన్నుకో - ఎన్నికైన చిన్నవాడా
పైరుగాలి ఘుమఘుమలో - చెంగావిచెంగు రిమరిమలో
అ: ఆ...ఆ...ఆ...
ఆ: ఆ...ఆ...ఆ...
అ: దిరిసెన పూవుమీద చిలుకూ ముగ్గులూ
చిన్నారి బుగ్గమీద చిలిపీ సిగ్గులూ
మల్లెల దొంతరలూ - మరుమల్లె దొంతరలూ
ఆ: మనసే... మనసే మరుమల్లెల దొంతర
అ: మన ఊసే - విరజాజి దొంతర
ఆ: పాలవెన్నెలలో
ఆ: మురిపాల వెన్నెలలో
అ: ఆ...ఆ...ఆ...
ఆ: ఆ...ఆ...ఆ... ॥చికిలింత॥








ఈ పాటను ఘంటసాల,లీల పాడగా ఎన్.టి.ఆర్, జమున అభినయించారు. సాహిత్యపరంగా చూస్తే పాటనిండా కనిపించేది తెలుగుతనం-తెలుగుధనం! చికిలింత చిగురు, గువ్వకన్ను రైక,పైరగాలి, రిమరిమ, ఊసు, దొంతర ఇలా ఎన్నో మురిపించే పదాలు...! చిన్నారి బుగ్గమీద చిలిపి సిగ్గులు దిరిసెన పూవు మీద చిలికే ముగ్గుల్లా ఉన్నాయట... ముగ్గులు చిలకటం... ఎంత భావుకత..'సాహో రామకృష్ణ శాస్త్రీ' అని తక్కిన కవులు ఊరికే అన్నారా!?ఇక ట్యూన్ పరంగా చూసుకుంటే పల్లవి లోని స్పీడుకి బుడిబుడి గంతులు వేసే కుందేలుపిల్ల గమనం, ,చరణాలలో హాయిగా తీసుకునే టేకాఫ్ కి స్లోమోషన్‌లో పరుగెడుతున్నలేడి పిల్లల పరుగు ఈ రెండు కళ్ళముందు కనిపిస్తున్నట్టు ఉంటుంది. తర్వాతి రోజుల్లో ఘంటసాల ఇటువంటి పాట మరొకటి చెయ్యలేదేమోనని కూడా అనిపిస్తూ ఉంటుంది.

ఆ: ఎందాక? ఎందాక? ఎందాక?
అ: అందాక - అందాక - అందాక ॥ఎందాక॥
ఆ: యీ ఉరుకేమిటి ఈ పరుగేమిటి... ఓ...ఓ...ఓ... ॥ఎందాక॥
అ: చివ్వునపోయి రివ్వునవాలి చిలకను సింగారించాలి
ఓ చిలకను సింగారించాలి
ఆ: పువ్వులతోనా అ: రవ్వలతోనే ఆ: ఆ!
అ: ఆ! మా నాన్న కోడలు బంగారుబొమ్మా
ఆ: ఓ...ఓ...ఓ... ॥ఎందాక॥
ఆ: అయితే గియితే అమ్మాయి ఎవరో
అ: ఆడే పాడే అందాల బాల
ఆ: అయితే నువ్వో అ: నేతిమిఠాయి
ఆ: ఆ! అ: ఆ!
ఆ: పక్కింటి అబ్బాయి బంగారు తండ్రి
అ: ఓ...ఓ...ఓ.... ॥ఎందాక॥
అ: కన్నులు నిండే కలకలలే కన్నెకు సొమ్ముగ తేవాలి
నవకాలొలికే నీ చిరునవ్వే చిలుకకు సింగారం కావాలి
కావాలి కావాలి - కావాలి - పరుగున
రావాలి రావాలి - రావాలి
ఆ: రావాలి రావాలి - రావాలి పరుగున
రావాలి రావాలి - రావాలి








ఈ పాటను ఘంటసాల, లీల ఆలపించగా ఎన్.టి.ఆర్, జమున అభినయించారు. కవులలో రామకృష్ణ శాస్త్రిగారి శైలి ప్రత్యేకంగా ఉంటుంది. ఎందాక, అందాక, ఎంచక్క, నవకాలు ఇవన్నీ ఆ పరిమళాన్ని పట్టి ఇచ్చే పదాలు. ఇందులో నవకం లాంటివి ప్రస్తుతం వేటూరి సుందర్రామ్మూర్తి గారి పాటలలో మాత్రమే కనిపిస్తూ ఉంటాయి. మంచి పాటకి చెవియొగ్గి వినే ప్రతి శ్రోత గుండెలోనూ నేటికీ నిలిచిపోయిన పాటలలో ఇదొకటి. అందుకు సాక్ష్యం -ఇవాళ్టికీ ఆంధ్రప్రాంతాలలో కొన్నిచోట్ల ఎవరైనా ఎక్కడికైనా వెళుతుంటే 'ఎందాక ఎందాక ఎందాక' అని సరదాగా ట్యూన్‌లో అడగటం గమనించవచ్చు.

ఏనాటికైనా నీ దాననే
ఏనాటికైనా నీ దాననే
చిననాటి మాటలూ
మనసైన పాటలూ
మటుమాయమౌనా
మనపూలబాటలూ ॥ఏనాటికైనా॥
కనులార చూడవ
దయలేని వాడవ
మిగిలేవి - తీరని కోరికలా
చిననాటి మాటలూ
మనసైన పాటలూ
మటుమాయమౌనా
మనపూలబాటలూ ॥ఏనాటికైనా॥
నిలచిన వలచిన నీ నీడనేగా
చివురుకు జీవము నీవేగా
చిననాటి మాటలూ
మనసైన పాటలూ
మటుమాయమౌనా
మనపూలబాటలూ ॥ఏనాటికైనా॥







ఈ పాటను పి.లీల పాడగా జమున అభినయించారు. ఈ పాటలో గమనించవలసింది ఏమిటంటే చరణాలలోని వాక్యాలు రెండే. మిగిలినవన్నీ అనుపల్లవి నుంచి తీసుకుని పల్లవి వైపు నడిపించేవే. పునరుక్తి అంతగా ఉన్నా పాట నిలబడిందంటే అందుకు కారణం తేలికగా పట్టుబడే సంగీత సాహిత్యాలే!




మనసునీదే - మమతనాదే
నాదానవే - నే నీ వాడనే ॥మనసు॥
చివురు మామిడి పందిళ్ల నీడా
నిలిచింది చిలక నా కోసమే ॥చివురు॥
చివురింటి చిన్నదానా - నా దానవే -నే నీ వాడనే ॥మనసు॥
కనుల కాటుక కళ్యాణ తిలకం
నగుమోము కలకల - నా కోసమే ॥కనుల॥
చిరునవ్వు చిన్నదాన - నా దానవే - నే నీ వాడనే ॥మనసు॥
పువ్వులు జల్లీ - పన్నీరు జల్లి
దీవించి మీ వారు పంపారులే ॥పువ్వులు॥
మనసైన చిన్నదానా - మీ యింటికి - మా యింటికి ॥మనసు॥





ఈపాటను ఘంటసాల పాడగా ఎన్.టి.ఆర్, అభినయించారు. ఈ పాటలో కూడా మనకు కనిపించేది చిన్న చిన్న చరణాలు, తేలికైన సాహిత్యం నోటికి పట్టుబడే వరస! కాకపోతే కొద్దిగా గమనిస్తే పాటనడకలో 'ఆహ్'(తెలుగులో ప్రేమలేఖలుగా వచ్చింది) చిత్రంలోని 'చోటీసీ యే జిందగానీ'(తెలుగులో 'పాడు జీవితము యవ్వనము' అనే పాటగా వచ్చింది)పాట గుర్తొస్తూ వుంటుంది.

తెల్లవారవచ్చె -తెలియక నాసామి
మళ్లీ పరుండేవు లేరా మళ్లీ పరుండేవు లేరా ॥తెల్లవార॥
మళ్లీ పరుండేవు మసలుతూ వుండేవు
మళ్లీ పరుండేవు మసలుతూ వుండేవు
మారాము చాలింక లేరా
మారాము చాలింక లేరా ॥తెల్లవార॥
కలకలమని పక్షి గణములు
చెదిరెను కళ్యాణ గుణధామ లేరా ॥కలకల॥
తరుణులందరు దధి చిలికే వేళాయే
దైవరాయ నిదురలేరా తరుణులందరు దధి చిలికే వేళాయే
దైవరాయ నిదురలేరా దైవరాయ నిదురలేరా
నల్లనయ్యా రారా! నను గన్నవాడా!
బుల్లితండ్రి రారా బుజ్జాయి రారా
నల్లనయ్యా రారా! నను గన్నవాడా!
బుల్లితండ్రి రారా బుజ్జాయి రారా
నాన్నా మీ అమ్మ గోపెమ్మ పిలిచేను
వెన్నతిందువుగానీ రారా
నాన్నా మీ అమ్మ గోపెమ్మ పిలిచేను
వెన్నతిందువుగానీ రారా వెన్న తిందువుగాని రారా ॥తెల్లవార॥







మోహనరాగానికి ప్రామాణిక గీతంగా నిలిచిపోదగ్గ స్థాయిలో ఈపాట స్వరపరచబడింది. సాధారణంగా మేలుకొలుపు పాటలకు ఉపయోగించే 'భూపాల' రాగానికి బదులు మోహన రాగాన్ని ఎన్నుకోవటంలో ఔచిత్యమేమిటన్న ప్రశ్నకు మోహనని హిందుస్థానీ సంప్రదాయంలో 'భూపాలీ'అని అంటారనే చమత్కారమే తగిన సమాధానం. కోమల స్వరాలు పలికే భూపాల రాగాన్ని మరపిస్తూ తీవ్రస్వరాలు తొణికే మోహనరాగంలో ఈ పాటని మలచుకొంటూ పి.లీల సంగీత జీవితంలో ఓ మరపురాని మజిలీగా తీర్చిదిద్దడంలో ఘంటసాల ప్రజ్ఞను మాటలతో కొలిచి చూపలేం. మొదటి చరణం తరువాత పల్లవి రిపీట్ కాకపోవటం, పాటలోని చాలా పంక్తులు పలుమార్లు పునరుక్తి అవుతున్నా రసోత్పత్తికి భంగం కలగకుండా స్వరపరచడం ఈ పాట ప్రత్యేకతలలో కొన్ని. సాహిత్యపరంగా చెప్పుకోవాలంటే ఈ పాటకు మాతృకగా ఓ జానపద గీతం ఉంది. అదిలా ఉంటుంది:

**తెల్లవారెనమ్మ, చెల్లనేమందు నల్లని నా సామిలేరా**
**మరల పడుకునేవు మసలుచున్నావు మర్యాద గాదిక పోరా ॥తెల్ల॥**
**కలకలమని పక్షి గణములు కూసెను కాంతుడ యిక నిద్రలేరా**
**జలజారి కాంతులు వెలవెల బారెను తలుపు తీసి చూడు లేరా ॥తెల్ల॥**
**తరుణులందరు లేచి దధి చిల్కు వేళాయె తడవుండ రాదింక లేరా**
**అరగంటి చూపుతో నట్టిట్టు చూచేవు నెరజాణ వౌదువులేరా ॥తెల్ల॥**

ఈ జానపద మాతృకలో అయిదు చరణాలున్నా సినిమా వరకూ రెండు చరణాలనే తీసుకున్నారు. స్వతంత్రంగా, అత్యద్భుతంగా రాయగలిగి ఉన్నా సరే గీత రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రి ఆ మాతృకలోని చరణాలనే తీసుకుని మార్చుకోవటానికి గల కారణం మల్లాది వారికి ఆ సాహిత్యం పట్ల గల గౌరవమే తప్ప వేరొకటి కాదు.

మిగిలింది నేనా - బ్రతుకిందుకేనా.. ఇందుకేనా...
మిగిలింది నేనా - బ్రతుకిందుకేనా
మరచేవా యెడబాసి - మాయమయ్యావా ॥మిగిలింది॥
కన్నార చూసింది - కలకలా నవ్వింది ॥కన్నార॥
మనసార దరిచేరి మురిసిపోయింది
మనసైన పాట...మనసైన పాట... మన పూలబాట
మరచేవా ఎడబాసి - మాయమయ్యావా ॥మిగిలింది॥
నీవు నేను కలసి కలగన్న మనయిల్లు ॥నీవు నేను॥
ఈ తీరై కన్నీరై కూలిపోయెనా
ఆకాశమేలే అలనాటి మన ఊహ ॥ఆకాశమేలే॥
ఈ తీరై కన్నీరై రాలిపోయెనా ॥మిగిలింది॥
కనుల వెలుగులేదు నీ పలుకు వినరాదు
మనసు నిలువలేదు నిన్ను మరవలేదు
భరమై - విషమై - రగిలే ఈ బ్రతుకెందుకో






ఈపాటను ఘంటసాల పాడగా ఎన్.టి.ఆర్., అభినయించారు. ఈ పాటలో పల్లవి ముగియగానే మొదలయ్యే ఇంటర్‌లూడ్‌ని అందుకునే పద్ధతిని గురించి ముఖ్యంగా చెప్పుకోవాలి. పల్లవి చివర్న గల ల్యాండింగ్ నోట్ - ఇంటర్‌లూడ్ మొదలయ్యే టేకాఫ్ నోట్ - ఈ రెండిటికీ సమన్వయం కుదిరితే అది ఎంత చక్కగా ఉంటుందో - అసలు ఇంపుగా అమరటం అంటే అర్థం ఏమిటో తెలుస్తుంది. ఈ పాటకి సంబంధించిన మరొకవిషయం ఏమిటంటే- ఇది హరికాంభోజి స్వరాలమీద స్వరపరచబడింది. హరికాంభోజి స్వరాలమీద ఘంటసాల కూర్చిన మరొకపాట "మరువలేనురా- ఓ...పంచదార వంటి పోలిసెంకట సామి నిన్ను నేను మరువలేనురా"! ఈపాట మరచిపోయే తెలుగువాడుండడు. ఈ పాట ఇంటర్లూడ్‌లు, 'మిగిలిందినేనా' పాట ఇంటర్లూడ్‌లు ఒకదాని తరువాత ఇంకొకటి విని చూడండి. ఎంత పోలిక కనబడుతుందో మీకు తెలుస్తుంది. "అరె! అది హుషారు గీతం ఇది విషాద గీతం...అదెలా!?" అని అనిపించటం సహజం... మూలం ఒకే రాగానికి సంబంధించిన స్వరాలు అని తెలిస్తే ఆ అనుభూతి చాలా బావుంటుంది. ప్రయత్నించి చూడండి. ఇదిలా ఉండగా 'భరించునది'అనే అర్థంలో మల్లాది వారు ఈ పాటలో 'భరమై' అనే పదాన్ని వాడేరు. తర్వాత్తర్వాత ఈ పదాన్ని ఇంకే సినీ గీతం లోనూ వాడినట్టు లేదు.

అ: కనుపాప కరవైన కనులెందుకో
తనవారే పరులైన బ్రతుకెందుకో ॥కను॥
ఆ: విరజాజి శిలపైన రాలేందుకే
మరుమల్లె కెంధూళి కలసేందుకే ॥విర॥
మనసైన చినదాని - మనసిందుకే -
రగిలేందుకే ॥కను॥
అ: అలనాటి మురిపాలు కలలాయెనా
చిననాటి కలలన్ని కథలాయెనా
తలపోసి తలపోసి కుమిలేందుకా
తమవిందుకా ॥కను॥
ఆ: తనవారు తనవారె విడిపోరులె
కనుమూసి గగనాన కలసేరులే ॥తన॥
అ: ఏనాటికైనా నే నీదాననే - నీదాననే
అ: చిననాటి మన పాట మిగిలేనులే
కలకాల మీగాధ రగిలేనులే
కలకాల మీగాధ రగిలేనులే
రగిలేనులే...







ఈ పాట నటభైరవి రాగంలో స్వరపరచబడింది. ఘంటసాల, లీల గానం చేయగా ఎన్.టి.ఆర్, జమున అభినయించారు. ఈ పాటని ఆలపించుకుంటే బరువెక్కని గుండె ఉండదని, ఒకవేళ అలా ఉంటే ఆ గుండె సానుభూతికే తప్ప రసానుభూతికి నోచుకోలేదని అనుకోవాలి. తర్వాతి తరంలో ఈ నటభైరవి రాగంలో ఎన్నో సినీగీతాలు వచ్చినా అందులో ఎక్కువ భాగం ధైవతాన్ని (ద అనే స్వరాన్ని) మార్చుకుంటూ ఉన్నవే. నటభైరవి రాగానికుండే స్వరాలను యధాతథంగా వాడుకుంటూ వచ్చిన ఈ పాటలో సంగీతం, సాహిత్యం, గాత్రయుగళం వీటన్నిటి ప్రతిభావ్యుత్పత్తులూ పతాకస్థాయిలో సమకూరాయి. సరితూగాయి.

## నిర్వాహకులు

దర్శకత్వం : వేదాంతం రాఘవయ్య
సంగీత దర్శకుడు : ఘంటసాల వెంకటేశ్వరరావు
రచన : మల్లాది రామకృష్ణశాస్త్రి, ఎం.ఏ.,
కళ : గోడగాంకర్
ఛాయాదర్శకుడు : వి.ఎన్. రెడ్డి
సహకార దర్శకత్వం, కూర్పు : ఆర్.హనుమంతరావు
అలంకరణ : కె.నాగేశ్వరరావు, నారాయణస్వామి, వాసు
దుస్తులు : కె. అచ్చుతరావు
ప్రొడక్షన్ : వి. రామారావు
నిర్మాణము : రేవతి స్టూడియో

## నటీ నటులు

ఎన్.టి.రామారావు, గుమ్మడి,
సి.యస్.ఆర్., బి.ఎన్.ఆర్.,
పేకేటి, మహంకాళి వెంకయ్య,
డబ్బాచారి, బాలకృష్ణ,
మాష్టర్ బాబ్జి, పద్మశ్రీ,
జమున, బాలసరస్వతి,
సూర్యకాంతం,
ఛాయాదేవి,
బేబీ శశికళ మొదలగువారు...

నిర్మాత
డి.యల్. నారాయణ




సత్యమూర్తి

ఈసారి మనం బావని బాగా ఏడిపించాలి

బదువుల్రావు దీపావళికి వాళ్ళ మేనమామగారి ఇంటికి వెళ్ళాడు

...ఐతే ఏం చేద్దాం?

ఫ్స్...ఫ్స్... ఫ్స్...ఫ్స్

మెల్లిగా వెళ్ళి మెయిన్ స్విచ్ ఆఫ్ చేస్తాడు

బావా! లైట్లు వచ్చేదాకా ఈ కొవ్వొత్తి వెలిగించు

వీళ్ళకి కొవ్వొత్తి వెలిగించడం కూడా రాదు. కుర్రకుంకలు

అని అటు చూస్తూ వొత్తి దగ్గర అగ్గిపుల్ల పెట్టాడో లేదో

పాపం మనరావు మాత్రం ఏంతెలుసు టపాకాయి బుట్టూ మైనం రాసిచ్చారని



'దాశరథీ కరుణాపయోనిధీ' అన్నది ఎప్పట్నించో ఉన్నమాట. 'దాశరథీ కవితాపయోనిధీ' అన్నది సినీ జనులు అన్నమాట. 'ఇద్దరు మిత్రులు' చిత్రంలోని 'ఖుషీఖుషీగా నవ్వుతూ' పాట ద్వారా చలన చిత్రసీమలో అడుగుపెట్టిన డాక్టర్ దాశరథి తన సినీ కవితా రంగంలో తరంగాలవలె ఉవ్వెత్తున లేచిన కొన్ని పాటలకు గల 'జన్మరహస్యాల'ను ఇలా వెల్లడించారు:

**(ఈ ఇంటర్వ్యూ 1984 లో జరిగింది)**

# సినిమా అంటే అన్ని రకాలూ రాయాలి లేకుంటే కలం జేబులో పెట్టుకుని వెళ్లిపోవాలి

## —దాశరథి

**"ఖుషీ ఖుషీగా నవ్వుతూ"** పాట తర్వాత "ఇద్దరు మిత్రులు" చిత్రం కోసమే ఒక 'కవ్వాలి' రాయటం జరిగింది. అప్పట్లో అన్నపూర్ణా వారి ఆఫీసు టి.నగర్‌లో ఉండేది. "మాకో కవాలి సాంగ్ కావాలి" అన్నారు దుక్కిపాటి మధుసూదనరావుగారు.

" ట్యూన్ ముందరే ఇచ్చి దానికి సాహిత్యాన్ని సమకూర్చమనటం రాజేశ్వరరావుగారి పద్ధతి. ఆయన ట్యూన్ చేసి ఇలా వినిపించారు:

"తన్నానా తన్నానా తా తన్నన తన్నా తన్నానా"

"చాలా కష్టమండోయ్ రాయడం" అని కూడా అన్నారు రాజేశ్వరరావు గారు.

"అవును. చాలా కష్టంగానే ఉంది" అని అన్నారు చుట్టూ ఉన్న నిర్మాణ బృందమంతా.

"మీకు కవ్వాలియే కదా కావలిసింది..." అని ఓ రెండు క్షణాలు ఆలోచించి "నవ్వాలీ నవ్వాలీ నీ నవ్వులు నాకే ఇవ్వాలి" అని అన్నారు దాశరథి.

అందరికి ఆశ్చర్యం... సాహిత్యం ట్యూన్‌కి నూటికి నూరుపాళ్ళూ సరిపోయింది.... అదీ అంత తక్కువ వ్యవధిలో! చూస్తుండగానే పాటంతా తయారయింది. "భలేగా ఉందే హైదరాబాద్ దెబ్బ" అని అనుకున్నారట ఆ రోజు అందరూ.

"నవ్వాలీ నవ్వాలీ" అనే ఆ కవ్వాలీ గీతంలో "నీకున్న చింతావంతా ఈనాడే తీరాలీ" అనే వాక్యం ఉంది. ఆ "చింతా వంతా" అనే ప్రయోగాన్ని ఆయన ఇంకో పాటలో కూడా జొప్పించటం జరిగింది.

అది "నాదీ ఆడజన్మే" చిత్రం. అందులో **"చిన్నారి పొన్నారి పువ్వు"** అనే పాటని దాశరథి రాశారు. చరణాలలో "ఏ చింత ఏ వంత లేని పసివాడే నిజమైన మౌనీ" అని ఆయన రాశారు. అందరూ ఎంతో బావుందన్నారు. కానీ డిస్ట్రిబ్యూటర్‌లలో ఒకాయన "మౌని అంటే ఏమిటండి?" అని అడిగారు.

"మౌనంగా వుండే వాడు మౌని. సాధారణంగా మునులను మౌని అని అంటారు" అన్నారు దాశరథి.

"ఏమో, ఈ వాక్యం చాలా కష్టంగా వుందండీ" అని అన్నారాయన.

"నిజం చెప్పాలంటే ఈ మునులు ఋషులు వాళ్ళందరికీ ఏవో చింతలు వుంటూ వుంటాయి ఎంత సంసార బాధ్యతల్ని ఒదుల్చుకున్నా! పసివాడికే అవేవి వుండవు . అందుకే అలా రాశాను" అని అన్నారు దాశరథి.

"స్టాండర్డ్ ఎక్కువగా వుంది... అందరికీ అర్థం అవ్వాలి" అని అన్నారాయన. అంతవరకూ 'బావుంది బావుం'దన్న వారంతా కూడా 'పోనీ మార్చి ఇంకోటి రాయకూడదా' అని అన్నారు.

దాశరథి మనసు చివుక్కుమంది. సినీ రంగంలో నిర్మాణ బృందానికి కావలసింది రాయటం, అదీ అతి త్వరగా ఇవ్వడం- ముఖ్యంగా వుండాల్సిన లక్షణాలు.

ఓ రెండు నిముషాలు వరండాలో పచార్లు చేసింతర్వాత....

"పసివాడు పలికేటి మాట ముత్యాల రతనాల మూట" అని చెప్పి "ఇది సరిపోతుందా" అని అడిగారు దాశరథి. అంతా "బాగా కుదిరింది" అని అన్నారు. చివరికి ఈ వాక్యమే పాటలో ఉంచడం జరిగింది.

"ఇలా వాక్యం రాసిన తర్వాత, పిక్చరైజ్ అయిన తర్వాత కూడా ఎప్పుడైనా మార్చడం జరిగిందా" అని అడిగితే-

"డాక్టర్ చక్రవర్తిలోని ఓ పాట ఆ బాధకు గురైంది" అన్నారు దాశరథి.

**"ఓ బొంగరాల బుగ్గలున్నదానా**
**నీ కొంగు తాకి పొంగిపోతి జాణా**
**నీ తస్సదియా తాళలేనే"** అంటూ రాశారు దాశరథి. పాట చిత్రీకరణ కూడా అయిపోయింది. సెన్సార్ అధికారులు ఈ చరణాన్ని ఒప్పుకోలేదు.

"తస్సదియ్య అంటే బూతు" అని అన్నారు.

"తస్సదియ్య అన్నది ఊతపదం. పల్లెపదం. దీన్లో తప్పేంలేదండి" అని వాదించారు దాశరథి.

"ఈ తస్సదియ్యా మాత్రం తీసె య్యాల్సిందే" అంటూ పట్టు పట్టారు అధికారులు.

అప్పటికే రికార్డయిపోయి, చిత్రీకరణ అయిపోయి. ఉన్న ఆ పాటకి "లింప్‌సింక్" చెడకుండా ఆ ఒక్కలైనూ మార్చాలి.... ఎలా?

"సరే... 'నువ్వు కస్సుమంటే తాళలేనే' అని అంటే ఫర్వాలేదా?" అని అన్నారు దాశరథి.

సెన్సారు వారు ఓకే అని అన్నారు. అప్పటికప్పుడు పి.సుశీలగారితో తిరిగి పాడించి డబ్ చేశారు.

"ఇదీ ఆ పాట వెనకనున్న కథ... వ్యథ" అని అన్నారు దాశరథి.

అప్పటికప్పుడు సరిపడే మాట తట్టడం సినీ కవికి తప్పనిసరిగా ఉండాల్సిన ముఖ్యార్హతల్లో ఒక్కటి. అదే ఆశుగుణం. అది ఉన్న వాళ్ళే సినిమాల్లో రాసుకుపోగలరు. దూసుకుపోగలరు కూడా.

ఓసారి "మూగమనసులు" చిత్రం కోసం పాట కంపోజింగ్‌కని కూర్చున్నారు - ఆత్రేయ, దాశరథి, మహదేవన్, పుహళేంది. ఆదుర్తి - హైదరాబాద్ తాజ్‌హోటల్లో! అప్పటికి తమిళంలో ఓ పాట విశేష ప్రచారంలో ఉంది. ఆ పాటని ఆదుర్తి సరదాగా ప్రారంభించారు.

"కావేరీ కర్రై ఇరిక్కి" అని.

వెంటనే దాశరథి **"గోదారీ గట్టుంది"** అని అన్నారు. వెనువెంటనే రెండోలైను "కర్రై మేలే మర మిరిక్కి" అని అన్నారు ఆదుర్తి.

ఆ వెంటనే "గట్టు మీద చెట్టుంది" అని అన్నారు దాశరథి.

"బ్రహ్మాండం... ఊఁ తరువాత" అని అన్నారు ఆదుర్తి.

"తమిళం చెప్పండి మరి" అని అడిగారు దాశరథి.

"జ్ఞాపకం లేదండీ..."

"నేనే స్వతంత్రంగా చెప్తా పోనీ" ... అంటూ "చెట్టు కొమ్మన పిట్టుందీ. పిట్ట మనసులో ఏముందీ" అని పూర్తి చేశారు దాశరథి. "పల్లవి అద్భుతంగా వచ్చింద"ని అందరూ అనగానే అదే ఊపులో పాటని పూర్తి చేశారాయన. తర్వాత మహదేవన్ ట్యూన్ సమకూర్చారు. "అదే పాటలో చివర్న వచ్చే చరణం పిట్ట మనసు పిసరంతయినా పెపంచమంతా దాగుందీ, అంతు దొరకనీ నిండు గుండెలో ఎంత తోడితే అంతుందీ" అనే చరణాన్ని రికార్డ్స్ రిలీజయేటప్పుడు సమయం ఎక్కువైందని తొలగించారు. సినిమాలో మాత్రం ఉంది" అని అన్నారు దాశరథి.

"ఇలాటిదే మరొకటి. అది తమిళ ట్యూన్‌కి రాసింది. ఇప్పటికీ నా కది "ఫోన్‌లో ట్యూన్‌గా నాకు జ్ఞాపకం" అంటూ ఉపక్రమించారు దాశరథి.

"బాబూ మూవీస్ వారి "మంచిమనసులు" చిత్రానికి ఆధారం "కుముదం" అనే తమిళ చిత్రం. ఆ తమిళ చిత్రంలో "ఎన్నైవిట్టు ఓడిపోహ ముడియుమా" అనే హిట్ సాంగ్ ఉంది. అప్పుడు ఆదుర్తి సుబ్బారావుగారు అన్నపూర్ణ పిక్చర్స్ వారి షూటింగ్ కార్యక్రమంలో హైదరాబాద్‌లోనే ఉన్నారు. కె.వి.మహదేవన్ గారు మద్రాసు నుంచి కదలడానికి వీలులేక పోయింది. ఆదుర్తి గారు నాకు ట్యూన్ వినిపించారు. ఆ ట్యూన్ విని బాగా ఆకళింపుచేసుకొని **"నన్ను వదిలి నీవు పోలేవులే అదీ నిజములే"** అని రాశాను. పాట పూర్తయింది. సాహిత్యాన్ని విమానంలో మద్రాసుకు పంపారు.



అప్పటికి యస్.టి.డి. సౌకర్యం లేదు. అవతల



యస్. రాజేశ్వరరావుతో...

మహదేవన్‌గారు, ఇవతల ఆదుర్తిగారు, నేనూ. ఫోన్‌లో ఆ ట్యూన్ సుమారు తొమ్మిది నిముషాల పాటు సాగింది. అందరికీ ఓ.కే. అయింది. ముఖ్యంగా-

**"తొలినాటి రేయి తడబాటు పడుతు**
**మెల్లమెల్లగా నీవు రాగా**
**నీ మేని హొయలు నీలోని వగలు**
**నాలోన గిలిగింత లిడగా**
**హృదయాలు కలిసి ఉయ్యాల లూగి**
**ఆకాశమే అందుకొనగా**
**పై పైకి సాగి మేఘాల దాటి**
**కనరాని లోకాలే కనగా"**

అనే ఆ చరణం తమిళ ట్యూన్‌కి సరిపోవటం. తమిళవాసన లేకుండా పూర్తిగా తెలుగు పాటే అనేట్టుగా తెలుగు పదాలు పడడం, అవన్నీ అనుకున్న భావాలకి సరిపోవటంతో ఆదుర్తి గారెంతో మెచ్చుకున్నారు. ఆ పక్కనే ఉన్న దుక్కిపాటి వారు కూడా ఎంతగానో



సి.నారాయణరెడ్డి, భాగి నారాయణ మూర్తి, కాళోజీ, ఆరుద్ర, పుట్టపర్తి నారాయణాచార్యులు , ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, దాశరథి, శ్రీ శ్రీ, వానమామలై వరదాచార్యులు

మెచ్చుకున్నారు" అన్నారు దాశరథి.

"దుక్కిపాటి వార్ని మెప్పించడం అంత సులువైన పని కాదు. వారి రెండు చిత్రాలలో ఓసారి నావి రెండు పాటలూ నాకు గుర్తుంచుకోదగ్గ అనుభూతిని మిగిల్చాయి" అంటూ సినీ వినీలాకాశంలోని జ్ఞాపకాల మబ్బుల చాటికి వెళ్ళిపోయారు దాశరథి.

"అది "ఆత్మగౌరవం" సినిమా అనుకుంటా. హైదరాబాదు సోమాజీగూడాలో అన్నపూర్ణ వారి కార్యాలయం వుండేది. సాంగ్స్ కంపోజింగ్‌కని మద్రాసు నుంచి రాజేశ్వరరావు, సహాయకులుగా కృష్ణయ్యర్. హార్మనీ చక్రధరరావు (సంగీత దర్శకులు కృష్ణ-చక్ర ద్వయంలోని చక్ర) వచ్చారు. ఆ ఆఫీసులోనే మాకందరికీ భోజనాలూ, బస. రాజేశ్వరరావు ఓ డిఫరెంట్ మ్యూజిక్ డైరెక్టర్. ఆ రోజు ఆయన నాకో రష్యన్ ట్యూన్ వినిపించారు. అంతా ఆ ట్యూన్‌ని మెచ్చుకున్నారు. ఎంత ప్రయత్నించినా తగిన తెలుగుమాటలు ఆ ట్యూన్‌కి ఇమడటం లేదు.

"తెలుగు ట్యూన్‌కి తెలుగు మాటలు పలుకుతాయి. ట్యూన్ కనీసం ఇండియన్‌దైనా అయితే బాగుణ్ను. రష్యన్ ట్యూన్‌కి తెలుగు పదాలు కూడడం కష్టం" అని అన్నాను.

రాత్రయింది. అందరికీ చిరాకేసింది. అక్కడే ఆరుబైట మంచాలు వేసుకొని పడుకున్నాం. అర్థరాత్రయింది. అందరు నిద్రలోకి జారుకున్నారు. పైన చంద్రుడు కనిపించాడు. వెంటనే పల్లవి గుండెల్లో పలికింది. ఆ వెంటనే నోటికి అందింది. 'ఏమనుకుంటాడో ఏమిటో' అని అనుకుంటూ రాజేశ్వరరావు గారిని నిద్రలేపాను. "ఒక్కసారి ఆ ట్యూన్ మళ్ళీ అందిస్తారా" అంటూ. నిజంగా మహానుభావుడాయన. ఏ మాత్రం విసుక్కోకుండా ట్యూన్ పాడి వినిపించాడు.

**"అందెను నేడే అందని జాబిల్లి**
**నా అందాలన్నీ అతని సొంతములే"**

అని అన్నాను.

"సరిపోయిందండీ" అంటూ మెచ్చుకోలుగా చూశారు రాజేశ్వరరావు. ఆకాశంలో జాబిల్లి నన్ను మెచ్చుకుంటున్నట్టు అనిపించింది. అప్పుడు నిద్రపట్టింది. మర్నాటికి పాటంతా ఓకే.." అంటూ ఊపిరి పీల్చుకున్నారు దాశరథి - ఓ మబ్బు విడిపోయింది.



**సంగీత దర్శకులు నౌషాద్, విజయభాస్కర్‌లతో...**

ఇంకోసారి.... "చదువుకున్న అమ్మాయిలు" చిత్రం కోసం రాజేశ్వరరావు ఓ ట్యూన్ ఇవ్వడం జరిగింది. **"ఒకటే హృదయము కోసము ఇరువురి పోటీ దోషము"** అని పల్లవి రాశాను. ఎన్నాళ్ళు శ్రమపడ్డా చరణాలు సరిగ్గా రావటం లేదు. దుక్కిపాటి వారు విసుక్కోవడం మొదలు పెట్టారు. నేనే కాస్త గిల్టీగా ఫీలయి నా మిత్రుడు ఆరుద్రని సాయం తెచ్చుకోనా అని అడిగాను. ఓ...కే... అన్నారాయన. నేను కోరగానే వచ్చి కూచున్న ఆరుద్ర చరణాలలో అక్కడక్కడా సర్దాడు. కానీ నేను వేసిన పల్లవి మార్చటం కుదర్లేదు. "పల్లవి బావుందండి... సిట్యుయేషన్‌కి సరిపోయింది కూడా" అని ఆరుద్ర అనడంతో దుక్కిపాటి వారు అప్పుడు ఒప్పుకున్నారు. ఆ పాటలో ఓ రెండు పద్యాలు రాశాను.

**"గుట్టుగా లేత రెమ్మల కులుకు నిన్ను**
**రొట్టె ముక్కల మధ్యన పెట్టిరనుచు**
**ఏల ఇట్టుల చింతింతువే టొమేటో**
**అతివలిద్దరి మధ్య నా గతిని కనుమా!"**

**"ఒకరు సత్యభామ ఒకరేమో రుక్మిణి**
**మధ్య నలిగినాడు మాధవుండు**
**ఇద్దరతివలున్న ఇరకాటమేనయా**
**విశ్వదాభిరామ వినురవేమ"**

ఇదీ ఆ పాట వెనుక గల కథ." అని అన్నారు దాశరథి - మబ్బుల నుంచి బైటపడ్డ చందమామలా నవ్వుతూ.

"అలా దుక్కిపాటి వారి చిత్రాలకు రాయటంతో ఆదుర్తి సుబ్బారావు, అక్కినేని గార్లతో పరిచయం పెరిగి వారిద్దరూ కలిసి తీసిన "సుడిగుండాలు"లో మీరు పాట రాయటం జరిగిందనుకుంటాను."

"అవును. "సుడిగుండాలు" చిత్రంలో స్వాతంత్ర్య సంగ్రామం మీద, దేశభక్తి మీద ఓ



పెద్దపాట రాశాను. ఆ పాటలో పిల్లలకు మూమెంట్స్ చెప్పడానికి బొంబాయి నుంచి ఓ మరాఠీ డాన్సు మాస్టరు వచ్చాడు. ఆయనతో కూచుని ఆ పాటని కొన్ని రోజుల పాటు రాశాను. భోజనానికి ఇంటికి కూడా వెళ్ళకుండా వారి ఆఫీసులోనే వుండి, ట్యూన్ వింటూ రాసుకొంటూ వుండే వాణ్ణి. నా ఓర్పుకి ఆదుర్తిగారికి ఆశ్చర్యం వేసింది. ఏ పాటకూ పడని శ్రమ ఈ పాట విషయంలో పడ్డానని ఆదుర్తిగారు గుర్తించారు. ఓ రోజు నా దగ్గరకు వచ్చి "దాశరథి గారూ, మీరేం అనుకోకండి. మిమ్మల్ని ఎక్కువ శ్రమ పెట్టాం. డబుల్ రెమ్యూనరేషన్ ఏర్పాటు చేస్తాను" అని అన్నారు.

"ఆ మాట మాత్రం అనకండి. నో రెమ్యూనరేషన్ ఫర్ దిస్ సాంగ్. నేను స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నవాణ్ణి. నేను పైసా కూడా పారితోషికం తీసుకోను. మీరు, ఏయన్నార్‌గారూ కలిపి తీస్తున్న ఈ 'నో ప్రాఫిట్' చిత్రానికి నేను డబ్బు తీసుకుంటానా? పైగా స్వాతంత్ర్య సమరగాథ మీద పాట'' అని అన్నాను. ఆదుర్తిగారు ఆశ్చర్యంతో నిశ్చేష్టులై ఉండి పోయారు. ఆ రోజు అలా అన్నందుకు ఇవాళ్టికీ ఎంతో తృప్తిగా ఫీలవుతాను నేను" అని అన్నారు దాశరథి.

"మరి అక్కినేని గారితో..."

"ఆయన పాటలక్కూడా మంచి అనుభవాలే ఉన్నాయి. ముందిది వినండి. ''అమర శిల్పిజక్కన్న'' చిత్రంలో **"అందాల బొమ్మతో ఆటాడవా"** పాట రాశాను. పల్లవి సింపుల్‌గా, పాపులర్ అయ్యేట్టు కావాలి అని అన్నారు. ఎన్నో పల్లవులు రాశాను. చివరకు ఇది ఓ.కే. అయింది. తమాషా ఏమిటంటే "మా యింట్లో పిల్లలందరూ అందాల బొమ్మతో ఆటాడవా అని పాడుకుంటున్నారయ్యా దాశరథీ! ఇది శృంగార గీతం అని తెలియక'' అని అన్నాడు నారాయణరెడ్డి సరదాగా.

"ఆ చిత్రంలోనే ఇంకో పాట **"మధురమైన జీవితాన కథ ఇంతేనా"** రాశాను. దర్శకుడు బి.యస్.రంగా కన్నడిగుడు. ఆయనకు తెలుగు భాషలో అంతగా ప్రవేశం లేనందున నాగేశ్వరరావుగారే ఈ పాటని నాతో కూచొని రాయించారు. అంత బిజీ హీరో ఒక పాట ఎలా కావాలో, ఏ భావాలు రావాలో అంతా చెప్పూ రాయించడం మాటలు కాదు."

"మరో విచిత్రమైన విషయం ఏమిటంటే అక్కినేని నటించిన "దొరబాబు" చిత్రం కోసం ఓ అన్నా చెల్లెళ్ళ యుగళగీతం రాయటం. రికార్డు చేయడం. పిక్చరైజేషన్‌కి పంపడం జరిగింది. నాగేశ్వరరావు గారికా పాట నచ్చలేదని తెలిసింది. మళ్ళీ రాయమన్నారు. "టెక్ట్స్ (సాహిత్యం) నచ్చలేదా, ట్యూన్ నచ్చలేదా" అని అడిగాను. ఫోన్‌చేసి తెలుసుకుంటే ట్యూన్ మారాలి అని అన్నారని తెలిసింది. మరో ట్యూన్ చెయ్యడం జరిగింది. ఆ ట్యూన్‌కి ఈ సాహిత్యం కుదర్లేదు. అప్పుడు మళ్ళీ ఇంకోవిధంగా రాయడం జరిగింది. నాగేశ్వరరావు గారు ఆ రెండో వెర్షన్‌ను చాలా మెచ్చుకున్నారు. ఆ పాటే -**"ఆ దేవుడెలా ఉంటాడని ఎవరైనా అడిగితే"**.

"ఇలా అన్నాచెల్లెళ్ల పాటలు మీరే ఎక్కువగా రాశారనుకుంటాను-అన్నా నీ అనురాగం మొదలైనవి"

''అవుననుకుంటాను. ఈ **"అన్నా నీ అనురాగం"** పాట 'ఆడపడుచు' చిత్రంలోనిది. పాట పూర్తిగా రాసేసి హైదరాబాద్ వచ్చాను. ఎందుకో నా పాట మొదట్లో వారికి నచ్చలేదు. తర్వాత అయిదుగురు కవులతో అయిదు రకాలుగా రాయించారట. చివరకు మళ్ళీ నేను రాసిందే ఓకే చేశారు. "ఇలా జరిగిందండీ మరోలా అనుకోకండి'' అని అన్నారు. నాకు కోపం వస్తుందేమోనని అనుకున్నారట. కోపం దేనికీ? నచ్చనప్పుడు పోతుంది. నచ్చితేనే నిలుస్తుంది" అన్నారు దాశరథి అనుభవాలతో పండి నిండిన కంఠంతో.



రాష్ట్రపతి : డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ తో...

"అయిదుగురు రాసిన తర్వాత కూడా మీ పాట ఒకే కావటం గ్రేట్ కాదా?"

"అలా అయితే ఇంకోటుంది. నేను రాసిన తర్వాత అయిదుగురు రాయటం ఇందాక చెప్పాను. అయిదుగురు రాసిన తర్వాత నేను రాయటం ఇంకో చిత్రం కోసం జరిగింది. సినిమా గుర్తులేదు. పూర్ణచంద్రరావుగారు నిర్మాత. చలపతిరావు మ్యూజిక్. సినిమా అంతా రెడీ అయిన తర్వాత "ఎంటర్‌టైన్‌మెంట్ తక్కువగా ఉంది. జ్యోతిలక్ష్మి డాన్సు పెట్టాలి - సందర్భం ఉన్నా సరే లేకున్నా సరే" అని అనుకున్నారట. అయిదుగురు కవుల చేత ముందు రాయించారు. అప్పుడు నేను సాహిత్య అకాడమీ సభల సందర్భంగా హైదరాబాదులోనే ఉన్నాను. తిరిగి నేను మద్రాను చేరుకునే సరికి పూర్ణచంద్రరావుగారు పిలిపించారు. అప్పటికి



ఆకాశవాణిలో ప్రసారమయ్యే - శ్రోతలు కోరే సినీగీతాల కార్యక్రమానికి 'జనరంజని' అనే పేరుపెట్టి తొలిగీతాన్ని ప్రారంభిస్తున్న సమయాన...

అయిదుగురితో రాయించిన సంగతి నాకు తెలియదు. "రంజైన పాట కావాలి - నో స్పెషల్ సిట్యుయేషన్. స్కై ఈజ్ ది లిమిట్" అని అన్నారు. జ్యోతిలక్ష్మి అని అనేసరికి ఏవేవో శృంగార పదాలు జ్ఞాపకం వచ్చాయి. "సూదిలో దారం సందులో బేరం" అని అన్నాను. "భేష్ భేష్" అని అన్నారు. పాట పూర్తయింది. ఆ పాటతో పిక్చర్ యమ ఆడింది. గ్రామాల్లో రికార్డు పెట్టుకొని అక్కడి లోకల్ డాన్సర్స్‌ని ఆడిస్తూ వికారపు చేష్టలు చేస్తూ యువకులు ఒకటే గెంతడం నాకిప్పటికీ గుర్తు....



యన్.టి.ఆర్.తో...

"మీరా... ఇలాటి పాటలు రాయడమా" అని ఒకరడిగారు నన్ను. "సినిమా అంటే అన్ని రకాలు రాయాలి. లేకుంటే కలం జేబులో పెట్టుకొని వెళ్ళిపోవాలి" అని అన్నాను.

"ఇంతవరకూ ఒకే పాటకి ఐదు వెర్షన్‌లు గురించి చెప్పారు. 'శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్న' చిత్రంలో మీరు మరో ముగ్గురు రచయితలతో ఒక పాట రాశారు కదా?"

"అవును. అది అయిదు చరణాల పాట. విజయనరసింహం. అరుణ్‌ప్రకాశ్, శ్రీనివాస్ అనే రచయితలతో పాటు నేను తెలుగు, ఉర్దూ చరణాలను రాయటం జరిగింది.

ఉర్దూ అంటే జ్ఞాపకం వచ్చింది.... రాం రహీమ్ చిత్రంలో తెలుగు - ఉర్దూ వెర్షన్ పాట ఒకటి నాచేత రాయించారు. సినిమాలో రహీం పాత్రధారి ఉర్దూలో పాడాలి. దానికి రఫీ వస్తున్నారు. పాట రాయించడానికి బొంబాయి నుంచి ఎవరైనా కవిని పిలిపించాలని డైరెక్టర్ బి.ఎ. సుబ్బారావు అనుకున్నారట. 'తలకింద సముద్రం'లా దాశరథిగారు మద్రాసులోనే ఉంటే బొంబాయి నుంచి ఉర్దూ కవి ఎందుకండి అని ఒకరన్నారట. **"యునానీ హకీం హూ"** అంటూ రాశాను. రఫీగారు స్టూడియోలో పాడే ముందు 'ఇంత బాగా ఉర్దూలో రాసేవాళ్ళు ఇక్కడ వున్నారా' అని అడిగారు బి.ఎ.సుబ్బారావుగారు నన్ను చూపించారు. ఆయన ఆనందానికి అవధులు లేవా రోజు. హమ్మయ్య అని అనుకున్నాను" అని అన్నారు దాశరథి.

"మీరు రాసిన భక్తిపాటలకు ఏ చరిత్రా లేదా?"

"లేకేం - "రంగులరాట్నం" చిత్రంలో **"నడిరేయి ఏ ఝాములో"** అనే పాట రాశాను. అది రాయడానికి ముందు బి.ఎన్.రెడ్డిగారు అన్నారు - 'వెంకటేశ్వర స్వామి వార్ని స్తుతిస్తూ యూజువల్‌గా వచ్చే పాట అయితే వద్దండి. నాకు కొత్త రకంగా కావాలి అని. అది విని నేనో మాట అన్నాను ఆయనతో. "శ్రీ వైష్ణవ సంప్రదాయంలో "పురుషకారం" అని ఒకటి ఉంది. అదేమిటంటే అమ్మవారి చేత స్వామి వారికి చెప్పించడం. రికమెండేషన్ అన్నమాట. అంటే స్వామివార్ని కాకుండా అలివేలు మంగమ్మని ప్రార్థించటం."

బి.యన్.గారు ఎగిరి గంతేశారు. "బాగుంటుంది. రాయండి" అన్నారు.

**"మముగన్న మా యమ్మ అలివేలు మంగమ్మ - ప్రభువుకు మా మనవి వినిపించవమ్మా"** అనిరాశాను.

"అదీ కొత్తదనం" అని సంబరపడ్డారు బి.యన్.గారు. గోపాలం గారు ట్యూన్ చేశారు. భలే పేలిందాపాట. ఇప్పటికీ నేను తిరుపతి కొండకెళితే నా పాటే నాకు వినిపిస్తూ ఉంటుంది. అదో మధురానుభూతి. ఏదైనా తిరగేసి చెప్పటంలో కొత్తదనం వస్తుంది" అన్నారు దాశరథి అర్ధ నిమీల నేత్రాలతో.

"కొత్త రుచిని సంతరించుకొంటుంది కూడా"

"రుచి అన్నారు, కనుక ఇక్కడో తమాషా సంఘటన చెప్తాను వినండి. పిఏపి వారి 'మనుషులు - మమతలు' చిత్రంలోని ఓ పాట అది. మద్రాసు రామన్‌స్ట్రీట్‌లో చలపతిరావుగారి మేడగదిలో మ్యూజిక్ కంపోజింగ్. ఎన్ని కాఫీలు, టీలు తాగినా పాట పలకలేదు.

"చారు తెప్పిస్తాను తాగి చూడండి" అన్నారు చలపతిరావు గారు. "చారుతో పాట పలుకుతుందా" అని అనుకున్నాను. ఇంతలో వారి సతీమణి వేడివేడి చారును కప్పుల్లో అందరికీ పంపించారు. అది మసాలా చారు. ఆ ఘుమఘుమకి పాట వచ్చేసింది.

**"వెన్నెలలో మల్లియలు**
**మల్లియలలో ఘుమఘుమలు**
**ఘుమఘుమలో గుసగుసలు**
**ఏవేవో కోరికలు"**

అని అన్నాను. "భేష్ భేష్" అని అన్నారు నిర్మాత పిఏపి సుబ్బారావు గారు, దర్శకులు ప్రత్యగాత్మ గారూ.

ఇలా రోజా వాళ్లింట్లో మసాలా చారు తాగటం, పాట రాయడం, అన్ని పాటలు బాగా వచ్చాయి. సుమారు ఆరు పాటలు రాశాను ఆ పిక్చర్‌కి. చారులో వున్న జోరు అప్పుడు తెలిసింది. బారులోను, బీరులోను లేని జోరు చారులో ఉందండీ" అని అన్నారు దాశరథి హుషారుగా 'రస'జగత్తులోంచి ఊడిపడుతూ.

"మన కవులు రాసిన చాలా పాటలకి ఒరిజనల్స్ తమిళకవి కీర్తి శేషులు కణ్ణదాసన్ రాసిన పాటల్లో ఉన్నాయంటారు. మీకలా ఏవీలేవా?"

"జమీందారు గారమ్మాయి" చిత్రంలో ఓ పాట రాశాను. "తేనెశిందునేవానం" అంటూ కణ్ణదాసన్ ఎప్పుడో ఓ పాట రాశారు. ఆకాశం నుండి తేనె కురుస్తున్నదని దాని అర్థం. ఆ పాటని తమిళులు తెగమెచ్చుకునే వారు. అదే ట్యూన్‌లో తెలుగులో పాట రాయాలన్నారు. రాశాను -

**"మ్రోగింది వీణా పదే పదే**
**హృదయాలలోనా"** అంటూ,

ఈ పాట కూడా ఇంచుమించు అంతే పాపులర్ అయింది. మిత్రుడు కణ్ణదాసన్‌కి వినిపించాను.

"రొంబ అళగాయిరుక్కె" (చాలా అందంగా ఉందే) అని అన్నారాయన. "రొంబనన్రి" (చాలా కృతజ్ఞతలు) అని అన్నాను.

ఓసారి 'ఓ కౌన్ థీ' అనే హిందీ చిత్రాన్ని రీమేక్ చేస్తున్నప్పుడు నేనూ, కణ్ణదాసన్ కలిపి పాటలు రాశాం. "ఆమె ఎవరు?" అని తెలుగులోను, "యార్ నీ?" అని తమిళంలోనూ తీశారు. ట్యూన్స్ అన్నీ హిందీవే. తెలుగులో అన్ని పాటలూ నేనే రాశాను. ఆయనా, నేనూ ఆ రెండు వెర్షన్స్‌కి పూటకోపాట చొప్పున రాశాం. అన్నీ బాగా వచ్చాయన్నారు అందరూ.

"నేను రాసినంత స్పీడ్‌గా ఎవరూ రాయలేరు అని అనుకునే వాణ్ణి. ఇవాళ నుంచీ అలా అనుకోను" అని అన్నారు కణ్ణదాసన్. "నన్రి" (కృతజ్ఞతలు) అని అన్నాను.

"హోటల్‌లో కూచొని లోకాభిరామాయణం మాట్లాడుకునే వాళ్ళం. నేనిక్కడ ఆస్థాన కవిగా నియమించబడిన కొద్ది రోజులకే అతనూ అక్కడ మద్రాసులో ఆస్థాన కవి అయ్యాడు. ఇప్పుడతను చనిపోయాడు. ఆస్థాన పదవి అక్కడ ఉంది. ఇక్కడ పదవి పోయింది. నేను జీవించే ఉన్నాను. వాట్ యాన్ ఐరనీ' అని ముగించారు దాశరథి.

-రాజా

# దాశరథి సినీ గీతాలు

## చిత్రం: రాము

**సంగీతం : ఆర్.గోవర్ధన్** **గానం : ఘంటసాల**

మంటలు రేపే నెలరాజా
ఈ తుంటరితనము నీకేలా ॥మంటలు॥
వలపులు రేపే విరులారా
ఈ శిలపై రాలిన ఫలమేమి ॥మంటలు॥
ఆకాశానికి అంతుంది
నా ఆవేదనకు అంతేది ॥ఆకాశానికి॥
మేఘములోన మెరుపుంది
నా జీవితమందున వెలుగేది ॥మంటలు॥
తీగలు తెగిన వీణయపై
యిక తీయని రాగంపలికేనా ॥తీగలు॥
ఇసుక ఎడారిని ఎపుడైనా
ఒక చిన్న గులాబి విరిసేనా ॥మంటలు॥
మదిలో శాంతి లేనపుడు
ఈ మనిషిని దేవుడు చేశాడు ॥మదిలో॥
సుఖమూ శాంతి ఆనందం
నా నొసటను వ్రాయుట మరిచాడు ॥మంటలు॥

## చిత్రం: మూగమనసులు

**సంగీతం: కె.వి.మహదేవన్** **గానం:పి.సుశీల**

ప: గోదారి గట్టుంది
గట్టుమీద సెట్టుంది
సెట్టుకొమ్మన పిట్టుంది
పిట్ట మనసులో ఏముంది...
ఓ.. ఓ.. ఓ... హొయ్ ॥గోదారి॥
చ: ఒగరు ఒగరుగా పొగరుంది
పొగరుకుతగ్గ బిగువుంది
తీయతీయగా సొగసుంది
సొగసును మించే మంచుంది ॥గోదారి॥
చ: ఎన్నెలవుందీ ఎండుందీ
పువూ ఉందీ ముల్లుందీ
ఏది ఎవ్వరికి యివ్వాలో
యిడమరిసే ఆ యిదివుంది ॥గోదారి॥
చ: పిట్టమనసు పిసరంతయినా
పెపంచమంతా దాగుంది
అంతుదొరకని నిండుగుండెలో
ఎంత తోడితే అంతుందీ ॥గోదారి॥

## చిత్రం: మంచిమనిషి

**సంగీతం: టి.చలపతిరావు** **గానం: పి.బి.శ్రీనివాస్**

సాకీ :ఓ.. గులాబి ॥2॥
వలపు తోటలో విరిసిన దానా
లేత నవ్వుల వెన్నెల సోన
ప : ఓహొ గులాబీ బాలా అందాలా ప్రేమమాలా
సొగసైన కనులదానా సొంపైన మనసుదానా
నీవారెవరో తెలుసుకో తెలుసుకో ॥ఓహో॥
చ : కొంటె తుమ్మెదల వలచేవు
జుంటి తేనెలందించేవు ॥2॥
మోసం చేసి మీసం దువ్వే
మోసకారులకు లొంగేవు..లొంగేవు ॥ఓహో॥
చ : రూపం చూసి వస్తారు
చూపుల గాలం వేస్తారు
రేకులు చిదిమీ
సొగసులు నులిమీ
చివరకు ద్రోహం చేస్తారు
చివరకు.. ద్రోహం.. చేస్తారు ॥ఓహో॥

## చిత్రం : ఆత్మగౌరవం

**సంగీతం : యన్.రాజేశ్వరరావు** **గానం : పి.సుశీల**

ప: అందెను నేడే అందని జాబిల్లి
నా అందాలన్నీ ఆతని వెన్నెలలే ॥అందెను॥
చ: ఇన్నేళ్ళకు విరిసే వసంతములు
ఇన్నాళ్ళకు నవ్వెను మల్లియలు
నిదురించిన ఆశలు చిగురించెలె ॥2॥
చెలికాడే నాలో తలపులు రేపెనులె ॥అందెను॥
చ: నా చెక్కిలి మెల్లగ మీటగనే
నరనరముల వీణలు మ్రోగినవి
గిలిగింతల నా మేను పులకించెలే ॥2॥
నెలరాజే నాతో సరసములాడెనులె ॥అందెను॥
చ: ఇక రాలవు కన్నుల ముత్యములు
ఇక వాడవు తోటల కుసుమములు
వినువీధిని నామది విహరించెలే ॥2॥
వలరాజే నాలో వలపులు చిలికెనులే ॥అందె॥

## చిత్రం: తేనెమనసులు

**సంగీతం: కె.వి.మహదేవన్** **గానం: ఘంటసాల, సుశీల**

డు: దివినుండి భువికి దిగివచ్చె దిగివచ్చే
పారిజాతమే నీవై నీవై
మె: గుడిలోన ప్రతిమ వచ్చింది వచ్చింది
కోటి ప్రభలతో నీవై నీవై ॥దివి॥
చ: అందని జాబిలి అందాలు పొందాలి
అనుకున్నా నొకనాడు ఆనాడు
అందిన జాబిలి పొందులో అందాలు
పొందాను ఈనాడు ఈనాడు ॥2॥
చ॥ కనరాని దేవుని కనుల చూడాలని
కలగంటి నొకనాడు ఆనాడు
కల నిజముచేసి కౌగిలిలోచేర్చి
కరిగించేవీనాడు ఈనాడు ॥2॥ ॥దివి॥
చ: కడలిలో పుట్టావు అలలపై తేలావు
నురగపై వచ్చావు ఎందుకో
కడలి అంచువు నిన్ను కలిసి నీ ఒడిలో ॥2॥
ఒదిగి కరగాలనే ఆశతో.... ॥దివి॥

# దాశరథి సినీ గీతాలు

## చిత్రం: రంగులరాట్నం

**సంగీతం: యస్.రాజేశ్వరరావు, బి.గోపాలం**
**గానం: ఘంటసాల, యస్. జానకి**

నడిరేయి ఏ జాములో
స్వామి నినుచేర దిగివచ్చునో
తిరుమల శిఖరాలు దిగివచ్చునో
మముగన్న మా యమ్మ అలివేలు మంగమ్మ ॥మము॥
పతిదేవు ఒడిలోన మురిసేటి వేళ
స్వామి చిరునవ్వు వెన్నెలలు కురిసేటి వేళ
విభునికి మా మాట వినిపించవమ్మా
ప్రభువుకి మా మనవి వినిపించవమ్మా
ఏడేడు శిఖరాల నే నడువలేను
ఏపాటి కానుకలందించలేను
వెంకన్న పాదాలు దర్శించలేను
నేను వివరించి నా బాధ వినిపించలేను
అమ్మా...
మముగన్న మా యమ్మ అలివేలు మంగా...ఆ...ఆ...ఆ...
మముగన్న మా యమ్మ అలివేలు మంగా
విభునికి మా మాట వినిపించవమ్మా
ప్రభువుకి మా మనవి వినిపించవమ్మా
కలవారినే గాని కరుణించలేడా
నిరుపేద మొరలేవి వినిపించుకోడా
కన్నీటి బ్రతుకుల కనలేని నాడు
స్వామి కరుణామయుండన్న బిరుదేలనమ్మా
అడగవే మా తల్లీ అనురాగ వల్లీ
అడగవే మాయమ్మ అలివేలు మంగా ॥నడి॥

## చిత్రం: వాగ్దానం

**సంగీతం: పెండ్యాల　　గానం: ఘంటసాల, సుశీల**

ఆ: నా కంటి పాపలో... నిలిచిపోరా...
నీ వెంట... లోకాల... గెలువనీరా...
నా కంటి పాపలో నిలిచిపోరా
నీ వెంట లోకాల గెలువనీరా
ఈనాటి పున్నమి ఏనాటి పున్నెమో
జాబిలి వెలిగేను మనకోసమే ॥ఈ నాటి॥
అ: నెయ్యాలలో తలపుటుయ్యాలలో
నెయ్యాలలో తలపుటుయ్యాలలో
అందుకుందాము అందని ఆకాశమే ॥నాకంటి॥
ఆ చందమామలో ఆనందసీమలో
వెన్నెల స్నానాలు చేయుదమా ॥ఆ చంద॥
ఆ: మేఘాలలో వలపు రాగాలలో
మేఘాలలో వలపు రాగాలలో
దూరదూరాల స్వర్గాలు చేరుదమా ॥నాకంటి॥
ఈ పూల దారులు ఈ నీలి తారలు
తీయని స్వప్నాల తేలించగా ॥ఈ పూల॥
అ: అందాలను తీపి బంధాలను ॥అందాలను॥
అల్లుకుందాము డెందాలు పాలించగా ॥నా కంటి॥

## చిత్రం: బుద్ధిమంతుడు

**సంగీతం: కె.వి.మహదేవన్　　గానం: ఘంటసాల**

సాకి: వేయి వేణువులు మ్రోగే వేళా
హాయి వెల్లువై పొంగే వేళా
రాసకేళిలో తేలే వేళా
రాధమ్మను... లాలించే వేళా
ప: నను పాలింపగ నడచీ వచ్చితివా
మొరలాలింపగ తరలీ వచ్చితివా....గోపాలా ॥నను॥
చ: అరచెదరిన తిలకముతో అల్లదిగో రాధమ్మా
అరజారిన పయ్యెదతో అదిగదిగో గోపెమ్మా ॥అర॥
ఎరుపెక్కిన కన్నులతో ఇదిగిదిగో సత్యభామ
పాదపాదలో యెదయెదలో
నీకొరకై వెదకుచుండగా ॥నను॥
చ: కంసుని చెరసాలలో ఖైదీగా పుట్టావు
కాంతల కౌగిళ్ళల్లో ఖైదీవై పెరిగావు
కరకు రాతి గుళ్ళలో ఖైదీవై నిలిచావు
ఈ భక్తుని గుండెలో ఖైదీగా వుండాలని ॥నను॥

## చిత్రం: అమరశిల్పి జక్కన్న

**సంగీతం: యస్.రాజేశ్వరరావు　　గానం: ఘంటసాల**

ఎచ్చటకోయి నీ పయనం
ఏమిటోయి ఈ వైనం
ఏలనోయి ఈ ఘోరం
ఎవరిపైన నీ వైరం
మధురమైన జీవితాల కథ ఇంతేనా
ప్రేమికులకు విధియొసగిన వరమింతేనా ॥మధుర॥
నిను నమ్మిన నీ సతినే నమ్మలేకపోయావా?
శిలలను కరగించునీవు
శిలవే అయిపోయావా? ॥మధుర॥
వెన్నెలతో విందుచేయు పున్నమ చంద్రుడవు నీవు
కళలు మాసి కాంతిబాసి
గ్రహణం పాలైనావా? ॥మధుర॥
విరబూచిన చెట్టులాగా మురిసిపోవు నీ బ్రతుకే
వాడి మాడి మోడుబారి
వన్నెమాసిపోయిందా? ॥ఎచటికో॥

## చిత్రం : పూలరంగడు

**సంగీతం : యస్.రాజేశ్వరరావు　　గానం : పి.సుశీల**

నీవు రావు నిదురరాదు, నిలిచిపోయె ఈ రేయి
తారా జాబిలి ఒకటై - సరసమాడె ఆ రేయి
చింతా చీకటి ఒకటై -చిన్నబోయె ఈ రేయి ॥నీవు॥
ఆశలు మదిలో విరిసె -దోసిట విరులై కురిసే
ఆలయాన వేచియుండ-స్వామికానరాడయె
నా స్వామికానరాడయె ॥నీవు॥
కౌగిలిలో ఒదిగిపోయి -కలలుకనే వేళాయే
ఎదురుచూచి ఎదురుచూచి
కన్నుదోయి అలసిపోయె ॥నీవు॥

